
ప్రథమ ముద్రణ : జూలై 1991
ముద్రణ : వంశీగ్రాఫిక్స్, గుంటూరు
రేఖాచిత్రాలు : టి.వి. కృష్ణారావు
ట్రాన్స్పరెన్సీస్: రాజ్ కపూర్, SCREENO ARTS
విజయ్, SATYAM PROCESS
వెల : రు 150 :
ముఖ చి[illegible]ం - విజయ్
ప్రచురణ :
స్టూడెంట్స్ బుక్ సెంటర్
అరండల్ పేట, గుంటూరు



సీమచింత - 50 సెం.మీ
వంపులు తిరిగిన కాండం - 18 సం.
డా. ప్రసాద్

## ఇదీ పరిణామం......



వాగచెట్టు - 35 సెం.మీ
ఏటవాలు - 12సం.
డా.ప్రసాద్

డెలొనిక్స్‌రీజియా - 50సెం.మీ
ఇన్‌ఫార్మల్ అప్‌రైట్ - 10సం.
శ్రీమతి మీనాక్షి







**గమనిక:** ముఖపత్రంమీది బోన్సాయ్ డాక్టర్ ప్రసాద్‌గారిది. లోపలి చిత్రాల్లో వ్యక్తుల పేర్లు ఉదహరించని బోన్సాయ్‌లు రచయిత్రివి.



# పరిచయం

కళకు ఎల్లలు లేవు. బోన్సాయ్ ఎక్కడో చైనాలో పుట్టింది. వరి పండించినా, హోండాని సృష్టించినా ప్రపంచంలో తమదైన ప్రత్యేకతను చాటుకోగల జాపనీయులు బుద్ధి జీవులు మాత్రమే కాదు కళాపిపాసులు కూడా ననే సత్యానికి నిదర్శనంగా వారి చేతిలో ఈ బోన్సాయ్ ఒక సజీవకళా రూపంగా ఆవిష్కరించబడింది. ఆ కళ ఈనాడు మూడు పూవులు, ఆరుకాయలుగా ప్రపంచ మంతా విస్తరిస్తోంది.

బోన్సాయ్ పెంపకం గురించి, అందులోని నులువులను గురించి నేనిక్కడ చెప్పనవసరం లేదు. ఆ విషయాలను మంగాదేవిగారు ఎంతో విపులంగా చర్చించారు. నేను చెప్పవలసింది ఈ పుస్తకం గురించి-పుస్తక రచయిత్రి మంగాదేవిగారి గురించి-ఈ పరిచయవాక్యాలు వ్రాయడానికి నాకున్న అర్హత గురించి!

పుస్తకానికి మంగాదేవిగారు ''వామన వృక్షాలు'' అని పేరుపెట్టారు. ఇంతింతై, వటుడింతై విశ్వాన్నంతా ఆక్రమించాడు వామనుడు. ఆవామన రూపంలోనే విశ్వాన్నంతా ఇముడ్చుకో గల శక్తి ఉన్నట్లు, విశాలంగా విస్తరించి పెరిగే మహావృక్షాలు అర చేతిలో నిలిచేంత చిన్నవిగా మారిపోయే బోన్సాయ్‌లకు సూక్ష్మ వృక్షాలని, మరోటని పేరుపెట్టకుండా ''వామన వృక్షాలు'' అని పేరు పెట్టడంలో ఎంతో ఔచిత్యాన్ని ప్రదర్శించారు ఆమె.

మంగాదేవి గారు కూడా భారీ మనిషేమీ కాదు. అయిదడుగులు మించని ఆమెలో భారీగా ఉన్నది మనోబలం! ఆబలంతో ఆమె ఎంత అసాధ్యమనిపించే విషయాన్నైనా సాధించ గలరు - కొన్ని విలువల కోసం ఎంతటి వాటినైనా తృణప్రాయంగా వదులు కోనూ గలరు.

మంగాదేవి గారు ఈ పుస్తకాన్ని అంకితం చేసిన ఇందిర నా సహధర్మచారిణి!



కళకు ఎల్లలు లేనట్లే స్నేహానికి కొలబద్దలు లేవు. ఇందిర, మంగాదేవి గారు చిన్ననాటి స్నేహితులు. వజ్ర సంకల్పురాలైన మంగాదేవి గారి వ్యక్తిత్వమంటే మనస్విని అయిన మా ఇందిరకు ఎనలేని గౌరవం! ఇందిరన్నా, ఆమె అభిరుచులన్నా కళాహృదయంగల మంగాదేవి గారికి అమితమైన ప్రేమ! వాళ్ళిద్దరి మధ్య ఉన్న ఆ బంధానికి నిదర్శనమే మంగాదేవిగారు ఈ పుస్తకాన్ని ఇందిరకు అంకితమివ్వడం!

ప్రీతితో ఈ పుస్తకాన్ని అంకితం ఇవ్వ దగ్గ వ్యక్తులు మంగాదేవి గారికి వేరెందరో ఉండవచ్చు. అలాగే బంధువులు, మిత్రులు ఇందిరకు ఎన్నో కానుకలిచ్చి ఉండవచ్చు. కాని మంగాదేవి గారు ప్రేమతో ఇచ్చిన ఈ కాను కంత విలువైనది, ఆనందదాయకమైనది ఇంది రకు మరొకటి ఉండేది కాదని మాత్రం నేను చెప్పగలను. అలాటి మిత్రురాలున్న నాభార్య అదృష్ట వంతురాలు!

ఇందిరకు బోన్సాయ్‌లు పెంచడమంటే ఎంతో ఇష్టం! ఏ ఊరు వెళ్ళినా - వెళ్ళేదారి లోను, వెళ్ళిన చోటా కూడా బోన్సాయ్‌కి తగిన మొక్కల కోసం ఆమె కళ్ళు వెదుకుతుం డేవి. అలాటివి దొరికితే త్రవ్వి తెస్తుండే వాళ్ళం! మాబోన్సాయ్‌ల్లో ఎక్కువ భాగం అలాటివే! ఈ పుస్తకం అట్టమీద ఉన్న చెట్టును సీతానగరం కొండమీద ఎర్రటి ఎండలో నిలబడి త్రవ్విం చింది ఇందిర.

ప్రాణంగా పెంచుకుంటున్న మా బోన్సాయ్ చిత్రాలను చూస్తూనే ప్రాణం విడి చింది ఆమె!

ఇందిరకు ఇష్టమైన ఈ బోన్సాయ్ పెంపకం గురించి పుస్తకం వ్రాయాలని ఎంతోకా లంగా అనుకుంటుండే వాడిని. ఆ పని నేను చెయ్యలేక పోయాను. నేను చెయ్యలేకపోయిన పనిని మంగాదేవిగారు చేసి ఇందిరకు అంకిత మిచ్చి పరిచయ వాక్యాలు వ్రాసే అవకాశాన్ని నాకు కలుగజేసారు. అందుకు ఆమెకు నా కృతజ్ఞతలు.

మనిషిగా మంగాదేవి గారి గుండెలో నాలుగు గదులున్నా ఆమె జీవితాన్ని పరిశీలిం చిన వాళ్ళకు ఆమె హృదయానికి రెండే గదులు న్నాయని పిస్తుంది. ఒక గదినిండా భావి ప్రపం చాన్ని రూపుదిద్ద వలసిన పసిపిల్లలు - రెండో గదినిండా ప్రపంచాన్నే ఆహ్లాదపరిచే పచ్చటి మొక్కలు!

ప్రముఖ విద్యావేత్త అయిన డా.మంగా దేవి ఉత్తమ బాలల రచయిత్రి కూడా! సాహిత్యం ద్వారా బాలలను ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దవ చ్చని విశ్వసించే ఈమె పిల్లల కోసం డజనుకు పైగా పుస్తకాలు వ్రాసారు.

మంగాదేవి గారి చిన్నతోటలో మామూలు మొక్కల కంటే అరుదైన మొక్కలే ఎక్కువ కనిపిస్తాయి. వైవిధ్యాన్ని ఇష్టపడే ఈమె విలక్షణమైన బోన్సాయ్ పెంపకంపట్ల ఆకర్షితు రాలు కావడంలో ఆశ్చర్యంలేదు. స్వతహాగా రచయిత్రి కూడా కావడంతో బోన్సాయ్‌లను



పెంచడంతో సంతృప్తి పడక దాన్ని గురించి పుస్తకం కూడా వ్రాయగలిగారు.

వ్యాపార వేత్తలు వ్యాపార రహస్యాలను నలుగురికీ చెప్పరు. కాని విద్యావేత్తలు తమకు తెలిసిన జ్ఞానసారాన్నంతా తమ శిష్యులకు అందించాలని తపన పడుతుంటారు. మంగాదేవిగారు విద్యావేత్త గనుకనే బోన్సాయ్‌ని గురించిన మౌలిక విషయాలను చెప్పి ఊరుకోకుండా- బోన్సాయ్ పెంపకం గురించి విశేషంగా చదివి గ్రహించిన విషయానికి తమ అనుభవసారాన్ని జోడించి ఔత్సాహికులైన బోన్సాయ్ పెంపకం దార్లకు ఈ పుస్తకం ద్వారా అందించారు. ఎలాటి స్పెషల్ టెక్నిక్స్‌ని ఉపయోగించి అతి తక్కువ కాలంలో చక్కని బోన్సాయ్‌లను తయారు చేయవచ్చో విపులంగా చర్చించారు. అందుకు సాధనాలుగా వర్ణచిత్రాలతో పాటు నూరుపై చిలుకు రేఖా చిత్రాలను ఉపయోగించారు.

వివిధ దశల్లో ఉన్న బోన్సాయ్‌లు మంగాదేవి గారి దగ్గర చాలానే ఉన్నాయి. అయినా ఈ పుస్తకాన్ని కేవలం తన బోన్సాయ్‌లకు మాత్రమే పరిమితం చెయ్యకుండా అనుభవజ్ఞుల దగ్గర ఉన్న ఉత్తమమైన బోన్సాయ్‌ల చిత్రాలతో పాటు ఔత్సాహికుల చిత్రాలను కూడా ప్రచురించారు. ఇలా చేయడం ఆ అభిరుచి గలవారిపట్ల ఆమెకున్న గౌరవాన్ని తెలుపుతోంది. ఇది ఎంతైనా అభినందనీయం!

బోన్సాయ్ పెంపకంపట్ల విశేషాసక్తి చూపుతున్న తెలుగు వారికోసం డా. మంగాదేవి రచించిన ఈ తొలి తెలుగు ''వామన వృక్షాల''ను అనుభవజ్ఞులు ఆశీర్వదిస్తారని, ఔత్సాహికులు మార్గ దర్శకంగా ఉపయోగించుకుంటారని ఆశిస్తూ-

హైదరాబాద్
**10.5.1991**

-డి.ఎల్.ఎస్. ప్రసాద్.



# సూక్ష్మం సుందరం - అరుదు అపురూపం

ప్రకృతిలో స్వేచ్ఛగాను, సువిశాలం గాను విస్తరించి వ్యాపించే మహావృక్షాలను నియంత్రించి అరచేతిలో సైతం ఇముడ్చుకోగల సూక్ష్మరూపంలో మలచగలగడం ఓ అద్భుతం!

అతిప్రాచీన కాలంలో పుట్టి అపురూపమైన కళగా రూపొందిన వామన వృక్షాల పెంపకం పట్ల నేటి ఆధునిక సమాజానికి విపరీతమైన ఆకర్షణ! శరవేగంతో సాగిపోతున్న నాగరిక మానవుని యాంత్రిక జీవన యానం మనోజ్ఞమైన ప్రకృతి నుండి అతడిని రోజు రోజుకూ దూరం చేస్తోంది.

దూరమైపోతున్న ప్రకృతికి చేరువ కావాలన్న తపన - నిర్మలమైన ప్రకృతి సాంగత్యంలో నిశ్చలమైన అలౌకిక ఆనందాన్ని పొందగలనన్న విశ్వాసం - పుష్పాలంకరణ, వామన వృక్షాల పెంపకం మొదలైన విభిన్న కళారూపాల వ్యాప్తికి దోహదం చేస్తోంది. అవ్యక్తమైన ఆధ్యాత్మిక చింతనను అందంగా అభివ్యక్తం చేసే 'ఇకేబనా' (పుష్పాలంకరణ) నుండి లభించే ఆనందం పరిమితం కాని నిత్యనూతనంగా మన మనసుల నలరించే సజీవ శిల్పాలైన వామన వృక్షాలు కలుగ జేసే ఆనందం నిరంతరం!

పుష్పాలంకరణలాగే వామన వృక్షాల పెంపకం కూడా ఒక కళగా అందరూ అంగీకరించినదే! అందుకే శాస్త్రీయమైన ఆకళలు నిష్ణాతులైన గురువుల దగ్గర అభ్యసిస్తే గాని అలవడ వన్న అపోహ మనలో చాలమందికి ఉంది.

ఏ విద్య కయినా సరయిన శిక్షణ విషయ పరిజ్ఞానాన్ని పెంచి అవగాహనను పెంపొందిస్తుంది. కాని ఆ అవకాశం - ముఖ్యంగా ఈ రెండు కళల్లోనూ - పెద్ద పెద్ద పట్టణాల్లో తప్పించి మామూలుగా అన్ని చోట్ల లభ్యం



కాదు. అంత మాత్రాన నిరుత్సాహ పడి బోన్సాయ్ కళపట్ల అభిలాషను చంపుకోనవ సరం లేదు. బోన్సాయ్ మొక్కల పెంపకానికి అవసరమైన ప్రాథమిక సూత్రాలను గురించి తెలుసుకోవడానికి ఏ బోన్సాయ్ పుస్తకం చదివినా సరిపోతుంది. ఎటొచ్చీ ఈ గ్రంధాలలో ఎక్కువ భాగం విదేశీయులు వ్రాసినవి, ఆంగ్లంలో ఉన్నావీను! అందుకే వాటిలో ఉదహ రించిన మొక్కలు, వాటితీరుతెన్నులు ఆయా దేశాల భౌగోళిక స్థితి గతులకు అనుగుణంగా ఉంటాయి.

భారత దేశంలో ఈ రంగంలో ప్రముఖులుగా పరిగణించబడుతున్న జ్యోతి నికుంజ్ పరేఖ్, లైలా దండా మొదలైన వారు మన శీతోష్ణ స్థితికి అనువైన బోన్సాయ్ మొక్కల పెంపకాన్ని గురించి చక్కనిగ్రంధాలను వెలువరించారు. అయితే ఇవి కూడా ఇంగ్లీషులోనే ఉన్నాయి.

ప్రస్తుతం బోన్సాయ్ కళ పట్ల తెలుగువారిలో కూడా అపరిమితమైన ఉత్సాహం కనిపిస్తోంది. నానాటికి వృద్ధి చెందుతున్న ఈ ఉత్సాహాన్ని గమనించిన వివిధ పత్రికలు బోన్సాయ్ పెంపకాన్ని గురించి ఎంతో కొంత సమాచారాన్ని అందిస్తూనే ఉన్నాయి. ఈ సమాచారం బోన్సాయ్ కళపట్ల ఆసక్తి కలిగించటానికేగాని కళగా దానిని అభ్యసించడానికి తగినంత సమగ్రంగా ఉండదు. ఆలోటును భర్తీ చేసే ఉద్దేశంతోనే నా ఈ ప్రయత్నం! బోన్సాయ్ పెంపకంలో మౌలికమైన సిద్ధాంతాలను తెలుసుకోవడానికి ఈచిన్న పుస్తకం ఉపకరిస్తుందనే నాఆశ!

ఇంక తరువాతి గురువు ప్రకృతే! ప్రకృతి సౌందర్యం పట్ల ప్రీతి, పరిశీలనా శక్తి ఆసక్తి ఉన్నవారికి ప్రకృతిలోని ప్రతి చెట్టూ ఒక గురువై పాఠం చెప్తుంది. వామన వృక్షాల శైలీ విన్యాసాలు ప్రకృతిలోని మహా వృక్షాలకు ప్రతిబింబాలేకదా!

డా. డి.యల్.యన్ ప్రసాద్ గారి సతీమణి ఇందిర నాచిన్ననాటి స్నేహితురాలు, ఇందిరతో ఏపాటి పరిచయం ఉన్నవారైనా ఆప్యాయత, ఆదరణలతో కూడిన ఆమె పలకరింపును, ప్రశాంతమైన ముఖంలో చిరుదివ్వెలా వెలిగే ఆచిరు నవ్వునూ మరిచిపోలేరు. తండ్రి నుండి సౌజన్యంతో పాటు కళా తృష్ణను కూడా పుణికి పుచ్చుకున్న ఇందిరకు అన్నివిధాలా ఆమె అభిరుచులను మన్నించే ప్రసాద్ గారు జీవిత భాగస్వామి కావడం ఆమె అదృష్టం. ప్రకృతిని చూచి పరవశించిపోయే ఈ దంపతులు బోన్సాయ్ పెంపకంపట్ల ఆకర్షితులవడంలోను, ఆకళలో నిష్ణాతులవడంలోను అబ్బురం లేదు!

నేను హైద్రాబాద్ వెళ్ళి నప్పుడల్లా ఏమాత్రం వీలుచిక్కినా ఆమె 'నందనం' చూడకుండా వచ్చేదాన్ని కాదు. బోన్సాయ్ పట్ల నాకీఆసక్తికలగడానికి ఇందిరే కారణం! అందుకే నాయీ పుస్తకం ఇందిరకు అంకితం!



ఈ పుస్తకంలో పరిపూర్ణమైన బోన్సాయ్ లతో పాటు వివిధ దశల్లోను, శిక్షణలోను ఉన్న బోన్సాయ్‌ల చిత్రాలను కూడా ప్రచురించాం. బోన్సాయ్ పెంపకాన్ని క్రొత్తగా ప్రారంభించిన వారు ఇప్పటికే చక్కని రూపాన్ని సంతరించుకున్న బోన్సాయ్‌లను చూచి నిస్పృహకు లోను గాకుండా - తాము రూపొందించబోయే బోన్సాయ్‌ల ప్రాథమిక దశలను ఇందులో చూచి ఉత్సాహంతో ముందడుగు వేస్తారనే ఉద్దేశంతోనే ఈ చిత్రాలను కూడా పుస్తకంలో పొందుపరచడం జరిగింది. నిజానికి మొక్కకు ఏ దశలో ఉండే అందం ఆ దశలో ఉంటుంది గదా!

వామన వృక్షాలను గురించి తెలుగులో మొట్టమొదటి సారిగా వెలువడుతున్న ఈ పుస్తకం మరింత పరిపుష్టంగా ఉండడానికి తగిన సలహాలనిచ్చి, పరిచయ వాక్యాలను వ్రాయడంతో బాటు వర్ణచిత్రాలను ప్రచురణకిచ్చి తోడ్పడిన డా. ప్రసాద్ గారికి సర్వదా కృతజ్ఞురాలను.

ఈ కళలో అభినివేశం ఉన్న శ్రీమతి ఊర్మిళా చంద్రశేఖర్ గారు, శ్రీమతి శ్రీదేవీ అప్పారావుగారు, శ్రీమతి మీనాక్షి అనిల్ కుమార్ గారు నాకోరికను మన్నించి వారిబోన్సాయ్‌ల వర్ణచిత్రాలతో ఈ పుస్తకానికి మరింత శోభను చేకూర్చారు. వారి సహకారానికి నాహృదయ పూర్వక కృతజ్ఞతలు.

నా అభిరుచులను అర్థం చేసుకుని ప్రోత్సహించే నాసహచరి ప్రభావతికి, సహాధ్యాయి జయశ్రీకి-

అక్కయ్య ఏంచేసినా అపురూపంగా భావించి సదా సహకరించే చెల్లాయి పాపకు-

ఈ పుస్తకం ఇంత సమగ్రంగా రూపొందడానికి అనుక్షణం శ్రమించిన స్నేహమయి మరుద్వతికి-

ఇందుకవసరమైన రేఖా చిత్రాలను ఎంతో ఓర్పుతోను, నేర్పుతోను గీసిన మా డ్రాయింగ్ మాష్టారు శ్రీ టి.వి. కృష్ణారావుగారికి-

వర్ణచిత్రాలను ఎంతో నైపుణ్యంతో తీసిన సత్యం ప్రోసెస్ అజయ్‌గారికి, స్క్రీనో ఆర్ట్స్ రాజ్ కపూర్ గారికి-

ఈ పుస్తకాన్ని సాహసించి ప్రచురించిన న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్ రమేష్ గారికి-

పుస్తకాన్ని అందంగా ముద్రించిన వంశీ గ్రాఫిక్స్ వారికి-

*కృతజ్ఞతలతో*

గుంటూరు

**జూన్ 1, 1991.**

-మంగాదేవి



# 1 - బోన్సాయ్ పూర్వాపరాలు

దోసిలంత తొట్లో చారెడంత మట్టిలో మూరెడంత ఎత్తున మాత్రమే ఉన్న మర్రిచెట్టుకు ఊడలు దిగడం చూస్తే విస్మయం కలుగుతుంది. మహా వృక్షాలకు ఇలా వామనరూపాన్నిచ్చే విధానమే 'బోన్సాయ్'! ఈ బోన్సాయ్ పెంపకం ఈనాడు ఒక హాబీగా ప్రపంచంలోని అన్నిదేశాలకు వ్యాపిస్తోంది.

'బోన్సాయ్' అనేది జపాను భాషాపదం. 'లోతులేని పాత్రలో పెంచేమొక్క' (Bon-shallow container; Sai-Plant) అని దీని అర్థం. ఇలా వామన వృక్షాలను పెంచే విలక్షణ విధానానికి జపాను దేశస్థులు చేసిన దోహదం, కృషి చూస్తే దీని జన్మస్థానం జపానేనేమో అనిపిస్తుంది. కాని పాత్రలో మొక్కలను పెంచడం అనే పద్ధతిని తొలుతగా ప్రారంభించినవారు చైనీయులు. దీన్నే చైనా భాషలో 'పున్సాయ్' లేక 'పెన్సాయ్' (పెన్ - పాత్ర; సాయ్ - మొక్క) అంటారు.

భారతదేశంలాగే ఉన్నతమైన సంస్కృతీ సంప్రదాయాలకు, ఆచార వ్యవహారాలకు పేరెన్నికగన్న దేశం చైనా! మనం విజయ దశమికి జమ్మిపూజ చేస్తాం! వినాయక చతుర్థిరోజున ఎన్నోరకాల పత్రపుష్పాలతోను, ఫలాలతోను గణేశుని పూజిస్తాం! మామిడితోరణాలు శుభకార్యానికి సూచనగా భావిస్తాం. తులసిమొక్కను పవిత్రంగా ఎంచి పెరట్లో ప్రత్యేకంగా పెంచి పూజిస్తాం. అలాగే చైనీయులకు పండుగల సందర్భంలోను, ఉత్సవసమయాల్లోను పూలు, కొమ్మలు, రెమ్మలు లాటి వృక్షభాగాలనే కాక



నమూలంగా మొక్కనే తెచ్చి ఇంట్లో ప్రతిష్ఠించుకునే ఆచారం ఉండేది.

అందుకుగాను ఆయా సందర్భాలను బట్టి దేశంలోని సుదూర ప్రాంతాలనుండి కూడా మొక్కలను సేకరించి తీసుకురావలసి వచ్చేది. ఆ ప్రయాసకు పరిష్కారంగాను, సజీవంగా మొక్కలను తరలించడానికి వీలుగాను, 'పాత్రలో మొక్కలు పెంచడ' మన్నది చైనాలో ప్రప్రథమంగా మొదలయ్యింది. చైనాలో ఈ 'పెన్సాయ్' ఆరంభం కావడానికి మరో కారణం కూడా చెప్తుంటారు. పర్వతాల మీద మనోహరంగా పెరిగే జూనిపర్ వృక్షాల అపురూప సౌందర్యానికి ముగ్ధులైన రాజవంశీయులు ఆ అందాలనెలాగైనా తమ ముంగిట్లో నిలుపుకోవాలన్న తపనతో పాత్రల్లో మొక్కలను పెంచడం ప్రారంభించారని! కారణం ఏదైనా ఈనాడు అందరినీ ఇంతగా అలరిస్తున్న బోన్సాయ్‌కి అంకురార్పణ చేసిన ఘనత మాత్రం చైనీయులకే దక్కుతుంది.

చైనాలో 'పున్సాయ్' ఆరంభమైన రోజుల్లో పాశ్చాత్యదేశాల్లో 'టోపియరీ' విధానం ప్రాచుర్యంలో ఉండేది. ఉద్యానవనాలలోని మొక్కలను పక్షులు, జంతువులు, కట్టడాలు, శిల్పాలు మొదలైన రకరకాల ఆకృతులలో ఆకర్షణీయంగా కత్తిరించడం ఈ 'టోపియరీ' విధానపు ప్రత్యేకత. దీనికి ఆకర్షితులైన చైనీయులు 'టోపియరీ' విధానాన్ని ఒక్క ఉద్యానవనాలకే పరిమితం చేయకుండా తమకత్యంత ప్రీతి పాత్రమైన 'పెన్సాయ్'లను కూడా వివిధ ఆకారాల్లో తీర్చిదిద్దడం మొదలెట్టారు. క్రమంగా ఈ పెన్సాయ్ రకరకాల మార్పులు చేర్పులతో కేవలం ఒకమొక్కను తీర్చిదిద్దడంతో ఆగకుండా పెద్దపెద్ద ట్రేలలో గుట్టలు, మిట్టలు, చెట్లు, సెలయేళ్ళతో కూడిన సుందర ప్రకృతి దృశ్యాల (land scapes) రూప కల్పనకు కూడా దారితీసింది. దీన్ని చైనాలో 'పున్ -చింగ్' అంటారు.

అతిశయోక్తిగా అనిపించినా ఇక్కడో విషయం చెప్పక తప్పదు. 'బోన్సాయ్' విధానానికి ఏ మాత్రం పోలిక లేకపోయినప్పటికి ప్రాచీన కాలంలో భారతదేశంలో కూడా తొట్లలో మొక్కలను పెంచే విధానం వాడుకలో ఉన్నట్లు చెప్తుంటారు. వనమూలికలే ఔషధాలుగా వినియోగించే ఆయుర్వేద వైద్యానికి ప్రసిద్ధి మనదేశం. అందునిమిత్తమే అన్ని రకాల మూలికలూ అన్నివేళలా అందుబాటులో ఉండడం కోసం వైద్యులు పాత్రల్లో మొక్కలను పెంచుతుండేవారని ప్రతీతి.

పున్సాయ్‌గా చైనాలో ప్రారంభమైన ఈ విధానం పదవశతాబ్దానికల్లా వర్తకులు, బౌద్ధభిక్షువుల ద్వారా తైవాన్, థాయ్‌లాండ్, సింగపూర్, హాంకాంగ్, జపాను మొదలైన దేశాలకు వ్యాపించింది.



జపాను వారు బోన్సాయ్ విధానాన్ని అపారంగా విస్తృతపరచి అన్నిరంగాల్లోలాగే ఈ రంగంలోనూ తమ ప్రత్యేకతను నిలుపుకున్నారు. 'పున్సాయ్' చైనాలో ఒక హాబీగానే మిగిలిపోయింది. కాని జపాను దానికో పరిపూర్ణత్వాన్నిచ్చి ఒక కళగా రూపొందించింది. చైనా పద్ధతిలోలా జపాన్‌వారి బోన్సాయ్‌లలో కృతకము, కృత్రిమము అయిన ఆకారాలకు చోటు లేదు. ప్రకృతిలో సహజసిద్ధంగా పెరిగే వృక్షాలకు సూక్ష్మరూపాలే జపాన్‌వారి 'బోన్సాయ్' లు.

ఏ వస్తువైనా సూక్ష్మరూపంలో ఉన్నది సుకుమారంగాను, సుందరంగాను ఉంటుంది. అరుదైన కొద్దీ అమూల్యమౌతుంది. ఇంక అది సజీవరూపమైనప్పుడు అపురూపమే అవుతుంది. అందువల్లనే జాపనీయులు బోన్సాయ్‌ను అరుదైన, అమూల్యమైన, అపురూపమైన సజీవకళారూపాలుగా మలచారు. ప్రకృతికి దూరంగా భౌతిక జీవన వరవడిలో కొట్టుమిట్టాడుతున్న మానవాళికి అలౌకికమైన ఆనందాన్నిచ్చే ఒక కళగా బోన్సాయ్ పెంపకాన్ని రూపు దిద్ది అందించారు.

నిజానికి, కళలన్నీ కూడా కళాకారుడికి అలౌకికమైన ఆనందాన్నిచ్చేవే ! ఒక చిత్రకారుడు గాని, ఒక శిల్పిగాని తనశక్తియుక్తులన్నిటిని ఉపయోగించి అద్భుతమైన కళాఖండాన్ని సృష్టిస్తాడు. ఆ సృష్టి అతడిని పరమానంద భరితుడ్ని చేస్తుంది. కాని ఆ ఆనందం మరో సృష్టి జరిగే వరకే ! ఏ విధమైన మార్పూ, చైతన్యమూ లేని ఆ కళాసృష్టి కలుగచేసే ఆనందం అనంతంగా కొనసాగేది కాదు. మరో సృష్టి - మరోచిత్రం - మరో శిల్పం - మరో కళారూపం తిరిగి ఆవిర్భవించినప్పుడే మరల అతని కాతాదాత్మ్యత ! ఇందుకు భిన్నమైంది సజీవ కళా రూపమైన బోన్సాయ్ సృష్టి! దృశ్యాదృశ్యంగా మొలకలెత్తే అనలు, లేచివురులు, పూపిందెలు అనునిత్యం బోన్సాయ్ కళాకారుడిని అలరిస్తూనే ఉంటాయి. అనుక్షణం అతనికి అలౌకిక ఆనందాన్ని అందిస్తూనే ఉంటాయి.

అందుకే అమితమైన ఆధ్యాత్మిక చింతన గల జాపనీయులు బోన్సాయ్‌ని ఒక సజీవ కళారూపంగానే కాకుండా పవిత్రతకు ప్రతీకగా పరిగణించారు. ప్రకృతికీ మానవుడికి మధ్యగల అనుబంధమే ఆత్మపరమాత్మల సంయమనంగా భావించే వీరు భక్తివినమ్రులై పూవులతోపాటు బోన్సాయ్‌లను కూడా బుద్ధభగవానుని సన్నిధిలో ఉంచేవారు.

పుష్పాలంకరణ కూడా మానసికోల్లాసాన్ని, మధురమైన అనుభూతిని కలిగించే సజీవరూపాలతో కూడిన కళే ! అయినా దాని జీవితం అత్యల్పమైంది ! అలాగే దాన్నుండి లభించే ఆనందం కూడాను!

ఈనాడు ప్రపంచంలోని అన్నిదేశాల్లోను



మొక్కలను పెంచే అభిరుచి ఉన్న ప్రతివారికీ-అంధునా నగరవాసులకు బోన్సాయ్ పెంపకం ప్రీతిపాత్రమైపోయింది. ఈ వామన వృక్షాల పెంపకం ఇంతగా ప్రాచుర్యంలోకి రావడానికి కారణాలు చాలానే ఉన్నా ఇరుకు గదుల్లో ముడుచుకు బతుకుతున్న నేటి నాగరిక మానవుడు తనకు దూరమవుతున్న ప్రకృతిని ఎలాగోలా ముంగిట్లో నిలుపుకోవాలని పడే తపనా, తాపత్రయమే దీనికి ప్రధాన కారణం కావచ్చు.

ఇదంతా చదివిన తరువాత కూడా బోన్సాయ్ మొక్కలను ప్రత్యక్షంగా చూడని వాళ్ళకు శ్రీకృష్ణుడు తన చిన్ని నోట్లో భువన భాండాన్ని చూపినట్లు ''దోసిలంత మూకుట్లో ఊడలు దిగే మర్రి వృక్షాలు, ఆకాశాన్నంటే అడవి చెట్లు పెంచడం ఎలా సాధ్యం? '' అన్నది ఆశ్చర్యంగానే ఉంటుంది. పరిశీలనాదృష్టి ఉన్న వాళ్ళకు గోడల్లోనూ, గొట్టాల్లోనూ, పిడికెడు మట్టికూడా రాలని రాళ్ళల్లోను, రావి, వేప, మర్రి లాంటి చెట్లు పెరగడం కనిపిస్తూనే ఉంటుంది. తాటిమట్టల్లో మొలిచి ఆ చెట్టునే పెనవేసుకు పెరిగే కొన్ని వృక్షజాతులను కూడా మనం తరచు చూస్తుంటాం. రవ్వంత మట్టిని ఆధారంగా చేసుకుని పెరిగే ఈ మొక్కలు సహజసిద్ధంగా నేలలో పెరిగే వృక్షాల్లా విశాలంగా విస్తరించ లేక ''వామన రూపాన్ని'' ధరించడం సహజమే ! ఆ సూత్రమే బోన్సాయ్ పెంపకానికి కూడా వర్తిస్తుంది.

బోన్సాయ్ మొక్కలను గురించి మన కొక అపప్రథ ఉంది. దశాబ్దాలు గడిస్తే గాని బోన్సాయ్‌గా ఏమొక్కా రూపుదిద్దుకోలేదని ! అది వాస్తవం కాదు. ఒక మొక్క యొక్క పరిపూర్ణరూపం చూడడానికి అంత కాలం ఓపిక పట్టాలనడమూ సబబుకాదు. అత్యల్ప వ్యవధిలో కొన్ని ప్రత్యేకమైన విధానాల నవలంబించి తక్కువ వయసున్న చెట్టులో కూడా పరిపూర్ణత్వాన్ని చూపగలగడం ఆధునిక విధానపు ప్రత్యేకత. అలా అని అల్లాఉద్దీన్ అద్భుత దీపంతో సృష్టించినట్లు క్షణాల మీద బోన్సాయ్ మొక్కలను రూపొందించడమూ సాధ్యం కాదు- డబ్బుపోసి రెడీమేడ్ మొక్కలను కొనుక్కుంటే తప్పించి!

క్రొత్తగా బోన్సాయ్ పెంపకం పట్ల అభిరుచిని పెంపొందించుకున్న వ్యక్తికి తన కృషికి ఫలితాన్ని ఎంత త్వరగా చూడగలనా అన్న ఆతృత సహజం ! బోన్సాయ్ పెంపకందారులకు ఉండవలసిన మొట్టమొదటి లక్షణం ఓర్పు! ఓ వైపు ఓర్పుతో నిరీక్షిస్తూనే మరో వైపు ఎలాంటి నేర్పుని, టెక్నిక్‌ని ఉపయోగిస్తే తక్కువ కాలంలో సత్ఫలితాలను పొందగలము అనేది ఆలోచించాలి. చక్కటి అభిరుచికి తోడు మంచినేర్పు, ఓర్పు ఉన్న బోన్సాయ్ రూపశిల్పి అనంతమైన ప్రకృతినీ, అందులోని మహోన్నత వృక్షాలను మంత్రించినట్లు సూక్ష్మరూపాలుగా రూపొందించి తన అరచేతిలో నిలుపుకోగలడు!



# 2 - బోన్సాయ్‌కి అనువైన మొక్కల ఉత్పత్తి విధానాలు

## (Methods of Propagation)

సృష్టిలో రకరకాల పద్ధతులద్వారా వృక్షజాతులు అభివృద్ధి చెందుతుంటాయి. విత్తనంద్వారాను కొమ్మలద్వారాను, వేరుమొక్కలు తీసినాటడం ద్వారాను, అంటుకట్టడం ద్వారాను, దుంపలు నాటడం ద్వారాను క్రొత్త మొక్కలను ఉత్పత్తి చేస్తుంటాం !.

బోన్సాయ్ పెంపకానికి అనువైన మొక్కలకోసం వీటిలో ఏ ఒక్కపద్ధతినైనా అనుసరించవచ్చు. ఎటొచ్చీ కొన్ని మొక్కలను కేవలం విత్తనం ద్వారానే అభివృద్ధి పరచడం సాధ్యమైతే, కొన్ని కొమ్మవిరిచి నాటినా బ్రతుకుతాయి. మరికొన్ని అంటుగడితేగాని వేరూనవు. విత్తనంమీద మరీగట్టిపెంకు ఉన్న రేలలాటి రకాలకు విత్తనాలను నాటేముందు ప్రత్యేక ప్రక్రియ అవసరమవుతుంటుంది. కాబట్టి బోన్సాయ్ కనువైన మొక్కల ఉత్పత్తికి ఒక ప్రత్యేకమైన విధానమంటూ లేకపోయినా త్వరితంగా ఫలితాలను పొందడానికి మాత్రం ప్రత్యేకమైన పద్ధతులున్నాయి. బోన్సాయ్ మొక్కలను పెంచదలచుకున్నవాళ్ళు ఆ పద్ధతులను క్షుణ్ణంగా తెలుసుకున్నట్లైతే మనం కావాలనుకున్న శైలికి, మనం ఎంపిక చేసుకున్నమొక్కకు ఏ పద్ధతి అనువైనదనుకుంటే ఆ పద్ధతిలో మొక్కను పెంచుకోవచ్చు.

### విత్తనం నాటి మొక్కను పెంచడం :

విత్తనం నాటి మొక్కను పెంచడమన్నది సర్వసాధారణమైన పద్ధతి. ఈ పద్ధతిలో



మొక్కను ఎలా తయారుచేసుకోవాలో తెలును కున్న తరువాత ఇది ఏ విధంగా బోన్సాయ్ పెంపకానికి ఉపయోగకరంగా ఉంటుందీ అనే విషయం చర్చించుకుందాం!

మొలవబోయే మొక్క బోన్సాయ్ పెంపకం కోసమే అయినా విత్తనాన్ని మాత్రం నేరుగా బోన్సాయ్ కుండీలో నాటగూడదు. బోన్సాయ్ కుండీ పళ్ళెంలా మరీ చిన్నదిగా ఉంటుంది గనుక క్రొత్తగా మొలిచిన మొక్క అందులో ఏపుగా పెరిగే అవకాశాలు తక్కువ. మొలక దగ్గరనుండే మొక్కను శిక్షణలో పెడితే దానికి దృఢత్వంగాని, సంతృప్తికరమైన ఆకారం గాని రావు. అందువలన సాధారణంగా విత్తనం ద్వారా మొక్కను సిద్ధం చేసుకోవాలనుకున్నప్పుడు నేలలోగాని, చెక్కపెట్టెల్లోగాని, విత్తనాలు నాటడం కోసం లోతుతక్కువ, వెడల్పెక్కువ ఉండే ప్రత్యేకమైన కుండీల్లో (Seed Paus) గాని విత్తనాలను నాటుకోవచ్చు.

విత్తనం ద్వారా మొక్కను పొందదలచుకున్నప్పుడు మేలైన విత్తనాలను ఎంచుకోడం, వాటిని నాటడం, అందుకోసం కుండీని సిద్ధం చేసుకోడం లాటి విషయాల్లో కూడా మనం ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి.

వర్షాకాలం ముగుస్తుండగా గాని, వసంత కాలానికి ముందుగాగాని విత్తనాలు నాటుకుంటే మొలిచేమొక్కలు పెరగడానికి వాతావరణం అనుకూలంగా ఉంటుంది.

విత్తనం ఖచ్చితంగా మొలకెత్తాలంటేను, మొలిచినమొక్క బలంగా పెరగాలంటేను మామూలుగా కూడా మనం నాణ్యమైన విత్తనాలను ఎంచుకుంటాంగదా! అలాగే ఇప్పుడూను! విత్తనాలను ముందుగా నీళ్ళున్న ఒక పాత్రలో వెయ్యాలి. నీళ్ళలో మునిగిన విత్తనాలు మొలకెత్తేశక్తిగలవనీ, నీళ్ళల్లో తేలిన విత్తనాలు ఎందుకూ పనికిరానివనీ తెలిసిపోతుంది కదా! మంచివనుకున్న విత్తనాలను అలాగే నేలలో నాటినా మొలుస్తాయి. కాని త్వరగా మొలకెత్తడం కోసం విత్తనాలను ఒకటి రెండురోజులు నీళ్ళల్లో నానవేసి మొలకెత్తే సూచన కనిపించాక నాటడం మంచిపద్ధతి. రేల మొదలైన వాటివిత్తనాలకు పైన గట్టిపెంకు లాటి పొరఉంటుంది. వాటిని మామూలుగా నాటితే మొలవడం కష్టం! అందుకు ప్రత్యేకమైన ప్రక్రియ అవసరం. అలాటి వాటిని వేడినీటిలోగాని, వీలైతే సజల సల్ఫ్యూరికామ్లంలో గాని 10,15 నిముషాలు నానబెట్టి నాటితే త్వరగా మొలకెత్తుతాయి.

మంచి విత్తనాలను ఎంపిక చేసుకున్నాక ఆలోచించవలసింది నాటడానికి అనువైన స్థలం గురించి! లోతుతక్కువగా ఉండి విశాలంగా ఉండే కుండీల్లో (seed pans) గాని, నేలలో గాని విత్తనాలను నాటుకోవచ్చని ఇంతకు ముందే చెప్పుకున్నాంగదా! విత్తనాలను కుండీలో నాటాలనుకున్నప్పుడు కుండీ నెలా సిద్ధం చేసుకోవాలో ఇప్పుడు చూద్దాం!



మామూలుగా కుండీలన్నిటికీ- అవి మామూలు మొక్కలు పెట్టేకుండీలైనా, బోన్సాయ్ కుండీలైనా, సీడ్ పాన్లైనా-వాటికి ఎక్కువైన నీళ్ళు కారిపోవడానికి వీలుగా కుండీ అడుగున రంధ్రాలుంటాయి (drainage holes). ఇప్పుడు మనం విత్తనాలు నాటబోయేసీడ్ పాన్‌కున్న డ్రైనేజిరంధ్రాలను ప్లాస్టిక్‌మెష్‌తో కప్పేయాలి.(సన్నటి వలలాగ ఉండే ఈ మెష్‌ను ఈమధ్యదోమలు రాకుండా తలుపులకు, కిటికీలకు వాడుతున్నారు). ఈ మెష్‌లేనప్పుడు పెంకుముక్కలైనా రంధ్రాలకు అడ్డంగా పెట్టవచ్చు. అప్పుడుకుండీ అడుగున ఒక అంగుళం మందాన చిన్నచిన్న పెంకుముక్కలను ఒక పొరగా వేసి దానిపైన మరో అంగుళం మందాన ఇసుకపొయ్యాలి. ఇలా చెయ్యడం వలన తొట్టి అడుగున నీళ్ళు నిలవకుండా తేలిగ్గా క్రిందికి దిగిపోయి రంధ్రాలద్వారా బయటకు వెళ్ళిపోతాయి. ఇంకఇప్పుడు ఇసుకపొర మీద మెత్తటిమట్టి, ఇసుక, చీకిన ఎరువు సమపాళ్ళలో కలిపిన మిశ్రమాన్ని పొయ్యాలి. ఈ మట్టిని మరీ కుండీ అంచువరకూ పొయ్యకుండా సుమారు 3, 4 సెంటీమీటర్ల క్రిందికి ఉండేలా చూడాలి. ఆ పైన సుమారు ఒక సెంటీమీటరు మందంగా ఉండేలా సన్నగా జల్లించిన మెత్తటి మట్టిని పోసి దాన్నికొద్దిగా నొక్కాలి. ఈ మట్టిమీద విత్తనానికి విత్తనానికి మధ్య తగినంత దూరం ఉండేలా చూచి మరీ విత్తనాలను నాటాలి. ఇలా దూరం ఉంచడం వల్ల రేపు మొక్కలు మొలిచాక ఒకదానినొకటి నెట్టుకుంటూ పెరగవలసిన అవసరం ఉండదు.

అలా నాటిన విత్తనాలమీద జల్లించిన మట్టిని మరో పొరగా పలుచగా పోసి మృదువుగా వేళ్ళతో నొక్కాలి. ఇప్పుడు కుండీలో మట్టి అడుగువరకు తడిసేలా రోజ్‌కాన్‌తో సన్నని జల్లులా పడేలా నీళ్ళుపొయ్యాలి. అలాగాకుండా మామూలుగా నీళ్ళుపోస్తే విత్తనాలమీద ఉన్న మట్టి చెదిరిపోతుంది. మట్టి పూర్తిగా తడిసిన గుర్తుగా డ్రైనేజిరంధ్రాల్లోంచి నీళ్ళు బయటికొస్తాయి.

దీనికంటె ఉత్తమమైన పద్ధతి మరొకటుంది. పెద్దనీళ్ళతొట్టెలో విత్తనాలు నాటిన కుండీని ప్రక్కపేజీలోని రెండవ నంబరు పటంలో చూపినట్లుగా అంచులు మునగకుండా మట్టిపూర్తిగా తడిసేవరకు ఉంచడం! ఇలా చెయ్యడం కాస్తశ్రమతో కూడుకున్నపని.

కాని ఈ పద్ధతిలో నీరు డ్రైనేజి రంధ్రాలగుండా లోపలికి వెళ్ళడం వలన మట్టిపోసింది పోసినట్లుగా కుదురుగా ఉంటుంది.

నీళ్ళుపోసాక కుండీని గాజుపలకతో గాని, మైనపుకాగితంతోగాని మూసెయ్యాలి. ఇలాచేస్తే కుండీలో తేమ త్వరగా పొడారిపోకుండా ఉంటుంది. కుండీని ఎండలో ఉంచకుండా బాగా గాలి, వెలుతురూ సోకేలా నీడన పెట్టాలి. కుండీలో మట్టి పొడారి నట్లనిపించి



నప్పుడల్లా నీళ్ళు పోస్తుండాలి. కుండీ ఎంతనీ డన ఉన్నా వాతావరణంలోని వేడికి కుండీలో పోసిన నీరు కాస్తో కూస్తో ఆవి రౌతూనే ఉంటుంది. అది గాజుపలక అడుగున చెమటలా చేరుతుంటుంది. ఆ తడిని ఉదయం, సాయంత్రం తుడిచేస్తుండాలి.



పటము 2: డ్రైనేజి రంధ్రాల ద్వారా నీళ్ళు పెట్టడం

మొలకెత్తే విత్తనానికి నీరు, ఉష్ణోగ్రత ఎంత అవసరమో గాలి కూడా అంతే అవసరం! అందుకే విత్తనాలు మొలకెత్తడం మొదలయ్యాక కుండీ మీద కప్పిన గాజుపలకని రోజుకి కాసేపు చొప్పున తెరిచి ఉంచుతుండాలి. మొక్కలు పూర్తిగా మొలకెత్తి ఆకులు కూడా వచ్చాక ఇంకగాజు పలక అవసరం ఉండదు.

పెరిగే మొక్కకు ఎక్కువ ఆహారం అవసరం ! అది తయారవ్వాలంటే మొక్కకు ఎండతగలాలి గదా! ఎండ తగలకుండా నీడలో పెరిగిన మొక్క ఊరికే సాగిపోతుంది తప్ప బలంగా పెరగదు. మొక్కకు ఎండ అవసరం గదా అని అప్పటివరకు నీడనఉన్న దానిని ఒక్కసారిగా ఎండలో పెట్టామనుకోండి. లేత చిగుళ్ళు కాస్తా ఎండి కూర్చుంటాయి. అందుకే మొక్కలు పెరుగుతున్న కొద్దీ



కుండీ నీడలో నుండి రోజుకు కొంతసేపు చొప్పున క్రమక్రమంగా ఎండలోకి తరలించాలి. విత్తనాలు నాటిన కుండీలోనే మొక్కలను కొంతకాలం పెరగనిచ్చి వాటిలో బలంగాను, మనం బోన్సాయ్ పెంచదలచుకున్న శైలికి అను గుణంగాను ఉన్నవనుకున్న ఒకటి రెండుమొ క్కలను తీసి పెద్దకుండీల్లో విడివిడిగా నాటుకో వాలి.

ఈ పెద్ద కుండీలో పోసే మట్టి ఏపాళ్ళలో కలుపుకోవాలో, కుండీని ఎలానింపాలో ''కుండీలో మట్టి నెలానింపాలి'' అనే అధ్యాయంలో వివరంగా చర్చించబడింది.

కుండీలో మొక్క పెరిగిన కొద్దీ క్రొత్త క్రొత్త చివుళ్ళు, రెమ్మలు పుడుతుంటాయి. వాటిలో మనకవసర మనుకున్న వాటిని మాత్రం ఉంచి, మిగిలిన వాటిని ఎప్పటికప్పుడు తుంచేస్తుండాలి. ఇలామొక్కను ఒకటి రెండు సంవత్సరాలు ఆ కుండీలోనే పెరగనిచ్చి ఆ తరువాత దీన్ని బోన్సాయ్ కుండీలోకి మార్చుకోవాలి.

ఆ మొక్కను బోన్సాయ్ కుండీలోకి మార్చుకునే ముందు మొక్కకున్న తల్లివేరును కత్తిరించాలి. (తల్లివేరును కత్తిరించే విధానం కోసం ''బోన్సాయ్ రూపురేఖలను తీర్చిదిద్దడం'' అనే అధ్యాయం చూడండి). తల్లివేరును కత్తిరించడంవల్ల బోన్సాయ్‌లో ప్రత్యేక ఆకర్షణలైన ఉపరితలపు వేళ్ళు బలంపుంజుకుంటాయి.

## నేలలో విత్తనాలను నాటడం:

నేలలో విత్తనాలను నాటడం అన్నిరకాలుగాను మంచి పద్ధతే ! వేళ్ళు వ్యాపించడానికి కావలసినంతస్థలం, ఏపుగా పెరగడానికి తగినంత సారం లభించడం వలన నేలలో మొలిచిన మొక్క తక్కువ కాలంలోనే దృఢంగా పెరుగుతుంది.

కాని మనం నాటే విత్తనం బోన్సాయ్ మొక్క కోసం ! మొక్క దృఢంగా పెరగడం ఒక్కటే మన లక్ష్యం కాదుగదా! అది మనకవసరమైన రీతిలో కూడా పెరగాలి. అందుకోసం ఈ మొక్కను చాలాతరచుగా ప్రూన్ చేసుకుంటుండాలి. (ప్రూనింగ్ గురించి ''బోన్సాయ్ రూపురేఖలను తీర్చి దిద్దడం'' అనే అధ్యాయం చూడండి). అలా చెయ్యడంలో ఏ మాత్రం ఏమరుపాటు చూపినా కొమ్మముదిరి పోతుంది. ముదిరిన కొమ్మను తుంచినప్పుడు కాండం మీద మాయని మచ్చ ఏర్పడే ప్రమాదం తలెత్తుతుంది. అందుకే నేలలో పెరుగుతున్న మొక్కను అనునిత్యం గమనిస్తూ అనవసరమనుకున్న కొమ్మలను, ఆకులను సరైన సమ



యంలో త్రుంచి వేస్తుండాలి.

నేలలో బోన్సాయ్‌కి కావలసిన మొక్కను పెంచడం వలన మనకోసమస్య ఎదురౌతుంది. మొక్కకు స్వేచ్ఛ ఎక్కువ ఉండడంతో తల్లివేరు బలంగాను, లోతుగాను భూమిలోకి చొచ్చుకుపోతుంది. నేలలో ఒకసంవత్సరం పాటు పెరిగాక మొక్కను త్రవ్వితీసి నేరుగా బోన్సాయ్ కుండీలో గాక మరో సంవత్సరం పాటు మామూలు పెద్దకుండీలో పెంచాలి.

కుండీలో పెరుగుతున్న మొక్కను త్రవ్వి తీసినంతతేలిగ్గా నేలలో మొక్కను త్రవ్వి తియ్యలేము. పైగా ఏ కాలంలోబడితే ఆకాలంలో త్రవ్వి తీస్తే ఈ మొక్క దెబ్బతింటుంది. అదుకే పాటింగ్, రీపాటింగ్‌కి అనువైన అక్టోబరు, జనవరి నెలల మధ్యకాలంలోనే నేలలోని మొక్కను తీసివేరే కుండీలో పెట్టుకోడం అన్ని విధాలుగానూ మంచిది.

నేలనుండి మొక్కను త్రవ్వేటప్పుడు కాండానికి మరీదగ్గరగా గాకుండా వేళ్ళ చుట్టూ ఉన్న మట్టి (Root ball) విడిపోకుండా జాగ్రత్త పడాలి. అప్పుడు తల్లివేరుకు పై వరసన ఉన్న ప్రక్కవేళ్ళను, పీచువేళ్ళను మాత్రం ఉంచి రూట్‌బాల్ చెదరకుండా చిన్నరంపంతో తల్లి వేరును కత్తిరించాలి. రూట్‌బాల్‌లో మిగిలిన ఈ సన్నని వేళ్ళే మొక్కకుప్రాణాధారం! ఇలా వేళ్ళను కత్తిరించడం వల్ల కొంతకాలం పాటు మొక్కకు నీటి సరఫరా తగ్గుతుంది. అందుకే ఆ సమయంలో బాష్పోత్సేకాన్ని (ఆకుల ద్వారా నీరు ఆవిరికావడం) కూడా తగ్గించాలి గనుక వేళ్ళకు సమతుల్యత చేకూరేలా రెమ్మలను, ఆకులను అవసరమనుకున్న మేరకు తగ్గించెయ్యాలి.

నేలలోనుండి కుండీలోకి మారడమన్నది మొక్కకు పునర్జన్మలాంటిది. అందువలన మొక్క మళ్ళీకుదురుకుని అన్నివిధాలా పుంజుకునే వరకు వైరింగ్ లాటి మేజర్ ఆపరేషన్స్ చెయ్యగూడదు.

మొక్కను ఒక సంవత్సరం తరువాత మామూలు కుండీలోనుండి బోన్సాయ్ కుండీలోకి మార్చుకోవచ్చు.

మనం అనుకున్న శైలిలో బోన్సాయ్‌ని తయారుచేయ్యడమనేది సామాన్యమైన విషయమేమీకాదు. 'ఇలాచేస్తే బాగుంటుందేమో' నని గాని లేదా పొరబాటునగాని ఒకకొమ్మకు బదులు మరోకొమ్మను కత్తిరిస్తే ఇంక అదిపూడ్చలేని లోపైపోతుంది. చెట్టును మళ్ళీసరైన ఆకారంలోకి తేవడానికి గ్రాఫ్టింగ్ లాంటి ప్రత్యేక విధానాలున్నా అదెంతో అనుభవం ఉన్నవారికి మాత్రమే సాధ్యమౌతుంది. ఇలాటి విపత్కర పరిస్థితినుండి బయటపడడానికి - అందునా ఔత్సాహికులైన క్రొత్తవారికి విత్తనాలు



నాటి మొలిపించుకున్న మొక్కలు వరప్రసాదాల్లాటివి. ఒకోరకానికి 4, 5 మొక్కల చొప్పున పెరగనిస్తూ - వాటిని షేప్ చేస్తూ వస్తుంటే ఒక మొక్కపాడైనా మరోమొక్కైనా మనం కోరుకున్న ఆకారంలో చక్కటి బోన్సాయ్‌గా రూపొందే అవకాశముంటుంది.

ఫార్మల్ అప్‌రైట్ శైలిలో బోన్సాయ్‌ని పెంచదలచుకున్నప్పుడు కాండపుతీరు తెన్నుల విషయంలోగాని, కొమ్మల అమరిక విషయంలోగాని, కణుపుకు కణుపుకు మధ్య దూరాన్ని తగ్గించడంలోగాని విత్తనపు మొక్కను మలచినంత తేలిగ్గాను, పరిపూర్ణంగాను మరే ఇతరపద్ధతుల ద్వారా పెరిగిన మొక్కలోనూ సాధ్యంగాదు. ఆ మాటకొస్తే ఏ శైలిలో మొక్కను మలచాలన్నా కూడా విత్తనాలు నాటి పెంచుకున్న మొక్కలే ఉత్తమమైనవి. కాకపోతే ఈ పద్ధతిలో మంచి బోన్సాయ్ తయారు కావడానికి ఎంతోకాలం పడుతుంది గనుక ఈ పద్ధతిని అందరూ ఇష్టపడరు. కాని ఇంతకు ముందే చెప్పుకున్నట్లు కొంత నేర్పు, అనుభవం సంపాదించేవరకు ఔత్సాహికులు ఓర్పుతో ఈ పద్ధతిని అనుసరించడమే ఉత్తమం!.

## కొమ్మలునాటి క్రొత్త మొక్కలను పెంచడం:

క్రొత్తగా బోన్సాయ్ మొక్కలమీద అభిరుచికలిగిన వాళ్ళకు పుస్తకాల్లోను, ఎగ్జిబిషన్లలోను విరబూసిన కొమ్మలతోను, విరగగాసిన కాయలతోను సాక్షాత్కరించే బోన్సాయ్‌లు ఉత్సాహంకంటే నిరుత్సాహాన్నే ఎక్కువ కలిగిస్తాయి. అది సహజం కూడాను! ఎందుకంటే విత్తనం నాటి, అదిమొలకెత్తి, పెరిగి పెద్దదై - అదీ మనకు కావలసిన శైలిలో, చారెడంత బోన్సాయ్ కుండీలో ఎప్పటికి పూలుపూసేను! ఏనాటికి కాయలు కాసేను! అది మన జీవిత కాలంలో సాధ్యమా అనిపించడం కూడాకద్దు!

ప్రతి కష్టమైన పనికి కొన్ని సులభ మార్గాలుంటాయి. అలాగే బోన్సాయ్ మొక్కల పెంపకానికీను! కొమ్మలు నాటడం ద్వారా బోన్సాయ్‌కి అవసరమైన మొక్కలను తయారుచేసుకోడం కూడా అలాటిదే!

విత్తనం నుండి మొలకెత్తిన మొక్కకు తప్పనిసరిగా తల్లివేరుంటుంది - స్వభావరీత్యా ఆ మొక్క కుచ్చు వేళ్ళు కలిగి ఉండేదైతే



తప్పించి! తల్లివేరుని తొలగించడమన్నది బోన్సాయ్ మొక్కలను రూపుదిద్దుకోడంలో ప్రథమము, ప్రధానము అయిన ప్రక్రియ! ఎందు కంటే తల్లివేరును తొలగిస్తేగాని సన్నవేళ్ళు బలంపుంజుకోవు.

కొమ్మనాటడం ద్వారా పెరిగినమొక్కకు ఈ తల్లివేరు సమస్యే ఉండదు. కొమ్మను ఎంతమేర కత్తిరించుతామో అంత మేరా సన్నని వేళ్ళు కుచ్చుగా పుట్టుకొస్తాయి. అంటేమనం మొక్కను సిద్ధం చేసుకోడంలో ఒక అడుగు ముందుకు వేసినట్లేగదా!

అంతే గాకుండా కొమ్మను నాటుకునేటప్పుడు సాధ్యమైనంత నదరగాను, దృఢంగాను ఉండే కొమ్మనే ఎంచుకుంటాం గదా! అందువలన తప్పనిసరిగా విత్తనం ద్వారా వచ్చిన మొక్కకంటె ఈ మొక్క త్వరగా తీరైన ఆకారాన్ని దిద్దుకుంటుంది. ఏ శైలిలో మొక్కను పెంచదలచుకున్నామో మనకు సరైన అవగాహన గనుక ఉన్నట్లైతే మనం నాటుకునే కొమ్మకూడా దానికి తగినట్లుగా ఉండేలా ముందునుండే జాగ్రత్త పడతాం!

కొమ్మనుండి మొక్కను ఉత్పత్తి చెయ్యడం వలన వీటన్నింటినీ మించిన మరో ప్రయోజనముంది. విత్తనం ద్వారా వచ్చిన మొక్క అదెంత మేలిరకం విత్తనమైనా - అన్నిరకాలుగానూ తల్లి చెట్టును పోలిఉంటుందన్న గ్యారంటీ లేదు. అదే బాగా పూతా, కాపూ ఉన్న మంచి చెట్టు కొమ్మను నాటినప్పుడు ఇలాటి ప్రమాదాలు జరగవు.

నిజానికి పూలు, కాయలు ఉంటేనే మంచి బోన్సాయ్ క్రింద లెక్కేమీకాదు. అయినప్పటికి తన బుల్లి బోన్సాయ్ పూలు పూస్తేను, కాయలుకాస్తేను ఏ బోన్సాయ్ కళాకారుడికైనా ఏనుగెక్కినంత సంబరంగా ఉంటుంది!. ఆ ఆనందం మనకు దక్కాలంటే బాగా పెరిగి పెద్దవై పూలు పూస్తున్న, కాయలు కాస్తున్న చెట్లకొమ్మలను తెచ్చినాటుకోవాలి. అలా నాటిన మరునటి సంవత్సరమే కాకపోయినా కనీసం మూడునాలుగు సంవత్సరాలకైనా మన బోన్సాయ్ పూతపూయక, కాపుగాయక మానదు! ఈ అద్భుతానికి కారణం మనం ఏచెట్టునుండి కొమ్మను కత్తిరించి నాటతామో ఆ చెట్టువయసు కొమ్మనుండి వచ్చిన మన బోన్సాయ్ మొక్కకు సంక్రమించడమే!

అక్టోబరు, జనవరి నెలల మధ్యకాలంలో జోరున వానలు కురవడంగాని, మండిపోయే ఎండలు కాయడంగాని ఉండదు. వాతావరణంలో సరిపడినంత తేమ, చల్లదనం ఉండే ఈ కాలం మొక్కల పెరుగుదలకు అనువుగా ఉంటుంది. కాబట్టి కొమ్మలను కత్తిరించి నాటుకోడానికి కూడా ఈ సమయం అనుకూలమైనదే!

ఎలాటి చెట్లకొమ్మలు నాటడం ద్వారా మనకనువైన మొక్కను తయారుచేసుకోవచ్చు



- మనం కత్తిరించినాటుకునే కొమ్మకు ఉండవల సిన లక్షణాలేమిటి - కొమ్మను ఎలా కత్తిరిస్తే త్వరగా వేళ్ళురావడానికి అవకాశముంటుంది - ఇవన్నీ తెలుసుకునే ముందు వీటన్నింటి కంటే ముఖ్యమైన కొమ్మలు నాటడానికి కావల సిన కుండీ' ని గురించి తెలుసుకుందాం !

## కొమ్మలు నాటే కుండీ ఎలా ఉండాలి - కొమ్మలు ఎలా నాటాలి -

కొమ్మలను నాటుకోడానికి ఉపయో గించే కుండీకూడా విత్తనాలు నాటే కుండీలాగ మూతి వెడల్పుగాను, లోతుతక్కువగాను ఉంటే మంచిది. మనం నాటిన ప్రతికొమ్మా బీరుపోకుండా మొలుస్తుందన్న గ్యారంటీ ఉండదు గనుక ముందు జాగ్రత్తగా కనీసం నాలుగైదు కొమ్మలైనా నాటుకోవడం అన్నివి ధాల శ్రేయస్కరం. ఎలాగూ మనకు కావలసింది ఒక్కమొక్కేగదా - ఈ నాలుగైదు కొమ్మలను ఎలానాటినా ఫరవాలేదు అనుకోవడానికి వీల్లేదు. నాటిన కొమ్మలన్నీ బ్రతికి చివురిస్తే ఆ చివురులు పెరిగి రెమ్మలైనా, సన్నని కొమ్మలైనా కొమ్మా కొమ్మా తగలకుండా ఉండేలా జాగ్రత్తపడాలి. ఆ తరువాత వాటన్నింటి లోనూ దృఢంగా ఉన్న మొక్కని ఉంచేసి తక్కిన వాటిని పీకేసుకోవచ్చు.

ఇకపోతే కుండీని ఎలా సిద్ధంచేసుకోవాలో ''కుండీలో మట్టినెలానింపాలి'' అనే అధ్యా యంలో విపులంగా ఉంది.

ఏ ప్రక్రియ కోసం, ఏ సైజు కుండీని తయారుచేసుకున్నా గుర్తుపెట్టుకోవలసిన కొన్ని ముఖ్యవిషయాలు - కుండీ అడుగున ఉన్న రంధ్రాలలో నుండి మట్టి బయటకు పోకుండా వాటిని సన్నటి ప్లాస్టిక్ మెష్‌తోగాని, పెంకుముక్కతోగాని కప్పడం - ఎక్కువైన నీరు కుండీ అడుగున నిలవకుండా రంధ్రాలలో నుండి కారిపోవడానికి వీలుగా కుండీలో మొట్ట మొదటి పొరగా సన్నని పెంకు ముక్కలను వెయ్యడం.

కొమ్మలను నాటే కుండీలో మామూలు కుండీలోకంటే ఇసుకపాలు మరింత ఎక్కువగా ఉండాలి.

## ఎలాంటి కొమ్మలను ఎంపిక చేసుకోవాలి ?

చెట్లలో దారువు మెతకగా ఉండేవి (Soft Wood), ఓ మోస్తరు కఠినంగా ఉండేవి (Semi Hard Wood), బాగా కఠినంగా ఉండేవి (Hard Wood) అని మూడు రకాలున్నాయి.

దారువు మెతకగా ఉండే చెట్లకొమ్మలను బ్రతికించడం సులువు. ఫైకస్ జాతికి చెందిన రావి, మర్రి మొదలైన వాటిలో ఎంతలావు కొమ్మలు నాటినా తేలికగా వేరూనతాయి. కోస్తే పాలుగారే స్వభావమున్న మొక్కఏదైనా తేలికగానే చివురుతొడుగుతుందన్న విషయం మరచిపోగూడదు.



## *మెతక దారువుగలవి, ఓ మోస్తరు కఠినమైన దారువు గల చెట్ల కొమ్మలు (Soft Wood And Semi Hard Wood Cuttings)*

తేలికగాను, నూటికి నూరుపాళ్ళు ఖచ్చితంగాను చివురు తొడుగు తాయనుకునే మెతకదారువుగల చెట్ల కొమ్మల గురించి, ఓ మోస్తరు కఠినమైన దారువు గల చెట్ల కొమ్మల గురించి ముందు తెలుసుకుందాం!

కొమ్మలు నాటడానికి అనువైన సీజన్ ఉన్నట్లే చెట్టునుండి కొమ్మను కత్తిరించడానికి కూడా ఒక సీజన్ ఉంది. అదేమిటంటే - చెట్టు పూలు పూచే తరుణం గాకుండా చెట్టుపెరిగే తరుణం చూచి కొమ్మను కత్తిరించడం ! సాధారణంగా చెట్టు క్రొత్త అనలు వెయ్యడం ఆపాక గాని పూలుపూయడం ప్రారంభించదు. అంటే చెట్టు పూతకొచ్చిందీ అంటే అది తనశక్తినంతా పూత, పిందె, కాయ తొడగడానికే ఉపయోగిస్తుందిగాని పెరగడానికి కాదు. చెట్టుఏపుగా పెరిగే తరుణంలో మాత్రమే గదా క్రొత్తచిగుళ్ళు వచ్చేది ! అందుకే పూలు పూచే సమయంలో గాకుండా చెట్టు ఏపుగా పెరిగే కాలంలోనే ఆ చెట్టు కొమ్మను నాటడానికి ఉపయోగించాలి. ఈ సమయం అన్ని చెట్లకు ఒకేలా ఉండకపోవచ్చు. కాస్తో కూస్తో పరిశీలనానక్తి ఉన్నవాళ్ళకి ఏ చెట్టుకొమ్మ ఏ సమయంలో నాటితే బాగుంటుందన్నది ఇట్టే తెలిసిపోతుంది.

మనం చెట్టులోని ఏ భాగం నుండి కొమ్మను కత్తిరించుకుంటున్నామో ఆ భాగం అన్నివిధాలా ఆరోగ్యంగాను, ఏపుగాను పెరుగుతుండి ఉండాలి. మొక్క పెరగడానికి అతి ముఖ్యమైన సూర్యరశ్మిసోకేదిగా ఉండాలి. అప్పుడేనాటిన కొమ్మలో మనం మిగిల్చే రెండు రెమ్మలు కొమ్మ తిరిగి జీవం పోసుకునే వరకూ దానికి కావలసిన శక్తినందించగలుగుతాయి.

ఇకపోతే కొమ్మ ఎంత లావుండాలి? ఎంత పొడవుండాలి - అన్నది.

ప్రత్యేకంగా చెప్పుకోదగిన ఫైకస్ జాతికి చెందిన చెట్లను వదిలేస్తె మామూలుగా కొమ్మను వంచితే విరక్కుండా వంగే పాటి మెతకదనం కలిగి ఉండాలి. అలాఉన్న కొమ్మలు త్వరగా వేరూనుతాయి.

కణుపుకూ కణుపుకూ ఉండే దూరాన్ని బట్టి కొమ్మపొడవు 5, 6 నుండి 10, 12 సెంటీమీటర్ల పొడవుండాలి. అంటే మనం కత్తిరించే కొమ్మకు ఒకటి రెండు కణుపులైనా ఉండాలన్నమాట !

కొమ్మను కత్తిరించేటప్పుడు అడ్డంగా గాకుండా ఏటవాలుగా కొయ్యాలి. ఇలా కొయ్యడం వలన బాగా వేళ్ళూనడానికి అవకాశం ఎక్కువుంటుంది.





పటం 3 : కొమ్మను ఏటవాలుగా కత్తిరించాలి

అదీ చాలదనుకుంటే వాలు ఒక వైపుకే ఉండే బదులు రెండువైపులా ఉండేలా బొమ్మలో చూపినట్లు కత్తిరించుకోవచ్చు.

కత్తిరించిన కొమ్మలను సాధ్యమైనంత త్వరగా నాటాలి. ముందుగా కుండీని సిద్ధం చేసుకున్న తరువాతనే కట్టింగ్స్ తెచ్చుకోడం మంచిది. ఏ కారణం చేతనైనా కొమ్మలను వెంటనే నాటలేమనుకున్నప్పుడు కత్తిరించిన కొమ్మకొనను నాటే వరకు నీళ్ళలో ముంచి ఉంచాలి. లేదా తడిగుడ్డ చుట్టి ప్లాస్టిక్ సంచిలో నైనా పెట్టాలి.

కొమ్మలను ఎప్పుడూ ఉదయంపూటే కత్తిరించి నాటుకోడం మంచిది.

కొమ్మను కుండీలో గుచ్చే ముందు క్రింది కణుపుదగ్గర మట్టికి తగిలేలా ఉన్న ఆకులను పూర్తిగా తీసివెయ్యాలి. లేకపోతే ఈ ఆకులు మట్టిలో కూరుకుపోయి మొక్కకు తెగులుసోకవచ్చు. కొమ్మపైభాగంలో కూడా ఆకులు ఎక్కువగా ఉండగూడదు. పొరబాటున ఆకులు ఎక్కువ ఉంచినట్లైతే బాష్పోత్సేకం వలన కొమ్మలో ఉన్న తేమ ఆకుల ద్వారా ఆవిరైపోతుంది. ఆకులసంఖ్య కొద్దిగా ఉండి వాటిసైజు పెద్దగా ఉన్నా ఇదే సమస్య తలెత్తుతుంది. కనుక ఆకులు పెద్దవిగా ఉన్నప్పుడు వాటిని కత్తిరించి సైజు చిన్నవి చేసుకోవడమే।



కొమ్మలు త్వరగా బ్రతకడానికి పూర్వం చైనా వారు ఒక చిట్కా పద్ధతి నవలంబించేవారట ! అదేమి టంటే కప్పు నీళ్ళల్లో రెండు స్పూనుల చక్కెరను కరిగించి ఆ ద్రావణంలో కొమ్మ కత్తిరించిన భాగాన్ని ముంచి నాటే వారు. నాకైనేనెప్పుడూ ప్రయత్నించి చూడలేదుగాని ఆసక్తిగలవారు చేసి చూడవచ్చు. గులాబి, మందార మొదలైన వాటి కొమ్మలేవైనా నాటినప్పుడు పైకొన మొంటిలా ఉంటే దానికి పేడ ముద్దలాపెట్టడం మనమూ చేస్తుంటాం ! అలా చేస్తే కొమ్మలో జీవం ఎక్కువరోజులుంటుందని మన నమ్మకం ! అయితే ఈ రోజుల్లో కేవలం నమ్మకాల మీద ఆధారపడవలసిన పనికూడాలేదు.



పటం 4 : కొమ్మలను ఏటవాలుగాను, దూర దూరంగాను నాటాలి



సైన్సుబాగా అభివృద్ధి చెంది ఎలాటి కొమ్మకయినా వేళ్ళు తొడిగే రకరకాల రూట్ ఫామింగ్ పౌడర్లు (Root forming Powders) మార్కెట్లో దొరుకుతున్నాయి. ఈ పౌడర్లు సాఫ్ట్‌ఉడ్ కి, హార్డ్‌ఉడ్ కి వేరు వేరుగా ఉంటాయి. కొమ్మకత్తిరించిన భాగాన్ని పౌడర్లో అద్ది, కొమ్మ గుచ్చడానికి వీలుగా మట్టిలో వేరే కడ్డీతో గాని, పుల్లతోగాని రంధ్రం చేసి ఆ రంధ్రంలో ఈ కొమ్మ ముక్కని ఏటవాలుగా గుచ్చాలి. గాలి చొరకుండా కొమ్మ చుట్టూమట్టిని నెమ్మదిగా వేళ్ళతో నొక్కాలి. ఆ తరువాత మట్టిపూర్తిగా తడిసేలా నీళ్ళు పొయ్యాలి. నీళ్ళు ఎలా పొయ్యాలనేది ఇంతకు ముందే చెప్పుకున్నాం గదా- పైనుంచి రోజ్ కాన్‌తోగాని, క్రిందినుండీ డ్రైనేజి రంధ్రాలద్వారాగాని నీళ్ళు పెట్టవచ్చు.

నాటిన కొమ్మలకు తగలకుండా ఉండేలా ఎత్తుగా కుండీలో నాలుగు కర్రపుల్లలు



పటం 5 : మట్టిలో తేమ త్వరగా ఆరిపోకుండా మైనపు కవరుతో ముయ్యాలి.



పాతి వాటి మీదనుండి ఒక ప్లాస్టిక్ కాగితాన్ని దించి కుండీ మూతిచుట్టూగాలి చొరకుండా గట్టిగా బిగించాలి. ఇలా చెయ్యడం వలన కుండీలో తేమ తగినంతగా ఉండి కొమ్మలు త్వరగా చిగిర్చే అవకాశముంటుంది. ఆ తరువాత కుండీని కొద్దిరోజులపాటు ఎండ తగలకుండా బాగాగాలీ వెలుతురు సోకేచోట నీడలో ఉంచాలి. కొమ్మలు చిపురు తొడగడం ప్రారంభించాక కుండీ మూతికికట్టిన ప్లాస్టిక్ కవరు తీసివేసి రోజ్ కాన్ తో మట్టిలో తేమ ఆరకుండా ఉండేలా నీళ్ళు పోస్తుండాలి. ఆ స్థితిలో వీలైనన్నిసార్లు ఆకులమీద నీళ్ళు చిలకరిస్తుండాలి. ఇక్కడొక్క విషయం గుర్తు పెట్టు కోవాలి. ఆకుల మీద నీళ్ళు చిలకరించినప్పుడల్లా మట్టి తడవగూడదు. మొక్క ఎదుగుదలకు నీరెంత అవసరమో గాలి కూడా అంతే! బొత్తిగాపొడార నివ్వకుండా పదేపదే మట్టి తడిసినట్లైతే చిత్తడిగా అయిపోయి వేళ్ళకు గాలి తగలదు. కాబట్టి చిలకరించే నీళ్ళు ఆకులకు మాత్రమే అందేలా జాగ్రత్తపడాలి.

## *దారువు కఠినంగా ఉండే చెట్ల కొమ్మలు :*

## *(Hard Wood Cuttings) :*

మెత్తని దారువుగల చెట్ల కొమ్మలను



పటం 6 : కొమ్మ నాటేచోట రెండుగా చీల్చి మధ్య రాయి పెడితే వేళ్ళు త్వరగా వస్తాయి - కాండపీఠం దృఢంగా ఉన్న భావన కలుగుతుంది



సాధారణ విధానం ద్వారానే తేలిగ్గా బ్రతికించవచ్చని పైన చెప్పుకున్నాంగదా! కఠినమైన దారువు గలకొమ్మలు తేలికగా వేళ్ళూనడానికి మామూలుగా కొమ్మలను నాటడానికి తీసుకోవలసిన జాగ్రత్తలతో బాటు కొన్ని ప్రత్యేకమైన పద్ధతులను కూడా అవలంబించాలి.

అందులో ఒకటి - మామూలుగా కొమ్మను ఏటవాలుగా కత్తిరించడం గాకుండా 6 వ నంబరు పటంలో చూపినట్లుగా కొమ్మ క్రిందిభాగాన్ని రెండుగా చీల్చి నాటడం! దీనివలన చీలికకు రెండు వైపుల నుండి వేళ్ళు పుట్టుకొస్తాయి.

మరోటి నాచ్ పద్ధతి. దీనిలో బొమ్మలో చూపినట్లుగా కత్తిరించిన కొమ్మ అడుగు భాగాన్ని రెండుగా చీల్చడమే గాకుండా కొమ్మను బాగావిచ్చదీసి, ఆ చీలిక కలుసుకోకుండా మధ్యన ఒక చిన్నరాయి పెట్టాలి. ఇలా చెయ్యడం వలన ముందు ముందు చక్కని టాపర్ (taper)తోకూడిన కాండం తయారవుతుంది.

కొమ్మ అడుగు భాగాన్ని రెండుగా చీల్చడానికి బదులు 4,5 చీలికలయ్యేలా బెరడుకు గాటు పెట్టడం మరో పద్ధతి. ఈ చీల్చిన బెరడు





పటం 7 : నాచ్ పద్ధతి – కొమ్మ నాటే చోట బెరడును ఎక్కువ చీలికలు చేస్తే వేళ్ళు కుచ్చుగా వస్తాయి



మూసుకుపోకుండా ఉండడానికి ఒక్కొక్క చీలిక క్రింద చిన్న చెక్క ముక్కను గాని, రాతి ముక్కనుగాని ఉంచాలి.

దారువు మరీ కఠినంగా ఉండే మొక్కల కొమ్మలను బ్రతికించడానికి మరో పద్ధతి ఉంది. దీనిని గర్డిలింగ్ (Girdling) విధానం అంటారు.

ఈ విధానంలో మనం ఏకొమ్మనైతే ముందు ముందు కటింగ్‌గా ఉపయోగించ దల చుకున్నామో ఆ కొమ్మలో కత్తిరించదలచు కున్న భాగం దగ్గర రాగి తీగతో గట్టిగా చుట్టి మెలి వెయ్యాలి. ఆ ఒత్తిడికి ఆహారం అక్కడే నిలబడిపోయి తీగ చుట్టిన దగ్గర లావుగా ఉబ్బు తుంది.



పటం 8 : గర్డ్లింగ్ విధానం – కొమ్మను కత్తిరించదలచుకున్న చోట కొన్ని నెలల ముందుగానే రాగితీగతో బలంగా చుడితే అక్కడ ఆహారం చేరడంతో వేళ్ళు త్వరగా పుడతాయి



మూడు నాలుగు నెలల తరువాత తీగను తీసివేసి కొమ్మను కత్తిరించి కుండీలో నాటుకోవాలి. నిలవ ఉన్న ఆహారం వల్ల కొమ్మలో ఎక్కువ కాలం జవ ఉంటుంది. ఆ జవ కఠినమైన దారువు గల కొమ్మను బ్రతికించడానికి ఉపకరిస్తుంది. అంతే గాకుండా ఉబ్బిన కాండపీఠం మొక్కకు చక్కటి ఆకారాన్నిస్తుంది.

ఈ కఠినమైన దారువుగల కొమ్మలను నాటేటప్పుడు మట్టిలో ఇసుకపాళ్ళు ఎక్కువగా కలపడంతోబాటు కాస్త చివికిన ఎరువును కూడా కలపడం మంచిది.

## వేళ్ళను కత్తిరించి నాటే పద్ధతి:

కొమ్మలను కత్తిరించి నాటినట్లే వేళ్ళను నాటడం ద్వారా కూడా క్రొత్తమొక్కలను ఉత్పత్తి చేయవచ్చు.

కొమ్మను నాటినప్పుడు అడుగుభాగం నుండి వేళ్లువచ్చి క్రొత్త మొక్క ఏర్పడుతుంది గదా! అదే వేరు నాటినప్పుడు చివురు తొడగడం ద్వారా మరోమొక్క తయారవుతుంది.

ఈ వేరు నాటడంలో రెండు పద్ధతులున్నాయి. ఒకటి వేరు నిలువుగా లోతుగా భూమిలో నాటడం. ఒకే కుదురునుండి మూడు, అయిదు లేక ఏడుకాండాలు రావలసిన క్లంప్ విధానానికి (Clump Style) ఇలా వేరు నిలువుగా నాటి పెంచిన మొక్కలు బాగా అనువుగా ఉంటాయి.

వేరును అడ్డంగా కుండీకి సమాంతరంగా నాటడం రెండోపద్ధతి. ఈ పద్ధతిలో పెంచినమొక్కలు ఒక్క తెప్పవిధానానికే (Raft Style) అనువుగా ఉంటాయి.

మనం నాటిన కొమ్మలకు ఒకోసారి వారం రోజుల్లోనే చిగుళ్ళు కనిపిస్తుంటాయి. కాని అవి పూర్తిగా నిలిచేవరకూ నమ్మడానికి వీల్లేదు. కొమ్మలు బాగా వేళ్ళూని, చిగుళ్ళు తొడిగి క్రొత్త మొక్కగా రూపుదిద్దుకోడానికి దాదాపు రెండు నెలలన్నా పడుతుంది.

మనం నాటిన ప్రతికొమ్మా చిగురించి బ్రతకక పోవచ్చు. బ్రతికిన మొక్కలన్నీ బోన్సాయ్ కనువుగానూ ఉండకపోవచ్చు. అందుకే మరిన్ని కొమ్మలను నాటుకుంటే వాటినుండి తయారైన మొక్కల్లో మనం పెంచ దలచుకున్న శైలికనువైన మొక్కలను బోన్సాయ్ కుండీల్లోకి మార్చుకోవచ్చు.

## కొమ్మలను కత్తిరించి నాటేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలు:

- *మరీ ముదురుగా ఉన్న కొమ్మ చివురించకపోవచ్చు.*
- *కొమ్మ వంచితే వంగేలా ఉండాలి.*
- *కొమ్మ ఏపుగా పెరుగుతున్నదై ఉండాలి.*
- *కొమ్మలో కనీసం రెండు కణువులుండాలి.*
- *కొమ్మను కణువు క్రిందుగాను, ఏటవాలుగాను కత్తిరించాలి.*



— కొమ్మ క్రింది వరున ఆకులన్నీ పూర్తిగా తీసేయాలి. మిగిలిన ఆకుల సంఖ్య బాగా తగ్గించాలి. అవసరాన్ని బట్టి సైజు కూడా!
— కొమ్మను ఉదయం పూటే కత్తిరించాలి.
— కత్తిరించిన వెంటనే కుండీలో నాటాలి.
— కుండీలో తేమ ఆరకుండా ఉండేందుకు కొమ్మకు తగలకుండా జాగ్రత్తగా ప్లాస్టిక్ కవర్‌తో కుండీని ముయ్యాలి.
— కుండీని ఎండలో గాకుండా బాగా గాలీ వెలుతురు సోకేలా నీడలో పెట్టాలి.
— కొమ్మ వేళ్ళూనిందన్న నమ్మకం కలిగాక కుండీకి కట్టిన ప్లాస్టిక్ సంచీ తీసేసి సాధ్యమైనంత తేమ ఉండేటందుకు తరచు నీళ్ళు చిలకరిస్తుండాలి.

## అంటుగట్టి మొక్కను పెంచడం (Layering)

విత్తనం నాటడం ద్వారాను, కొమ్మలను నాటడం ద్వారాను పెంచిన మొక్కల కంటే అంటుగట్టి తయారు చేసుకున్న మొక్కను బోన్సాయ్‌గా రూపొందించడం అన్నిరకాలుగాను ఉత్తమమైన పద్ధతి. ఎందువల్లనంటే మొదటి రెండు విధానాల్లోను ఎదురయ్యే సమస్యలు ఈ ''అంటు'' పద్ధతిలో ఉండవు. అంటు కట్టడం వలన వేళ్ళూనే మొక్కలను మాత్రమే ఇందుకు ఎన్నుకుంటాంగనుక మనం ఆశించినట్లుగా మొక్క తయారవుతుందా లేదా అన్న సమస్యే ఉండదు. కొమ్మను నాటగా వచ్చే క్రొత్తమొక్కకు యధాతధంగా సంక్రమిస్తాయనుకునే తల్లిమొక్కలక్షణాలు ఈ అంటుపద్ధతిలో కూడా నూటికి నూరుపాళ్ళూవస్తాయి. కొమ్మకంటే అంటు ద్వారా తయారైన మొక్క మరింత దృఢంగా ఉండి ఎక్కువ వయసును స్ఫురింప జేస్తుంది. అంతేగాకుండా మనం కావాలనుకున్న శైలికి అమరైన కొమ్మను ఎంపికచేసుకోడం వలన తక్కువ శ్రమతో అతి తక్కువకాలంలో ఎక్కువ ఫలితాన్ని పొందగలుగుతాం. అందువల్లనే అంటుపద్ధతి శ్రేష్ఠమైనదిగా భావిస్తాం.

ఇంక అంటు కట్టడం ఎలాగో చూద్దాం. 'అంటు' రెండు విధాలుగా కట్టవచ్చు.

ఒకటి నేలంటు

రెండు గాలి అంటు.

గాలి అంటు విధానాన్నే 'కొమ్మంటు' లేక 'గూటింగ్' అని కూడా అంటారు.

## నేలంటు

ముందుగా మనం అంటు కట్టదలచుకున్న మొక్కలో నేలకు దగ్గరగా ఉన్న ఒక మంచి కొమ్మను ఎన్నుకోవాలి. ఈ కొమ్మ మరీ ముదరిపోయి వంచగానే విరిగేలా పెళుసుగా ఉండగూడదు. ఆ తరువాత మనం ఎంచుకున్న కొమ్మను నెమ్మదిగా నేలతాకే వరకూ



వంచాలి. అలా వంచినప్పుడు కొమ్మ నేలను తాకినచోట కాస్త లోతుగా తవ్వి మట్టి తియ్యాలి. మనం అంటుగట్టదలచుకున్న కొమ్మ ఈ గోతిలోపలికి బొమ్మలోలా దిగాలి.

అలావంచి చూసుకున్న తరువాత కొమ్మ భూమిలోకి వెళ్ళేచోట కణుపుక్రింద పదునైన కత్తితో గాటు పెట్టాలి. మన దగ్గర రూట్ ఫామింగ్ పౌడర్ (Root forming powder) ఉంటే వేళ్ళు త్వరగా రావడానికి కొమ్మకు గాటు పెట్టినచోట తడి ఆరకముందే అద్దాలి. మనం గాటుపెట్టిన కణుపుదగ్గరే గాకుండా దానికి అటూ ఇటూ కూడా నేలను తాకుతాయనిపించిన ఆకులను తుంచెయ్యాలి. లేకపోతే ఆ ఆకులు తడిమట్టిలో నానడం వలన కుళ్ళి పురుగుపట్టవచ్చు. ఇప్పుడు కొమ్మను వంచి పెట్టిన గోతిలో ఇసుకపాలు ఎక్కువగా ఉన్న మట్టిలో కాస్త ఎరువుగలిపి దానితో గోతిని నింపాలి. బలవంతంగా వంచడం వలన కొమ్మ పైకి లేచిపోయే ప్రమాదం ఉంది. అలా లేవ కుండా ఉండడానికి మట్టిమీద ఒక రాతిని పెట్టవచ్చు. లేదా ఒక ఒగ్గిని కొమ్మ వంచిన చోట నొక్కిపెట్టి నేలలోకి గుచ్చవచ్చు.

తల్లి చెట్టుతోబాటు అంటుగట్టినచోట కూడా రోజూ నీళ్ళు పొయ్యాలన్నది ప్రత్యే కంగా చెప్పనవసరం లేదు గదా!



**పటం 9 : నేలంటు విధానం – కొమ్మలేచి రాకుండా వంచిన చోట ఒగ్గితో నొక్కిపెట్టాలి.**



'అంటు' లో ప్రత్యేకతేమిటంటే ముందుముందు మొక్కగా రూపుదిద్దుకో బోయే కొమ్మ బ్రతుకుతుందా లేదా అన్న భయమే లేదు. ఇందుకు కారణం మనం అంటు గట్టిన కొమ్మను తల్లిమొక్కనుండి వేరు చేయక పోవడమే! తల్లినుండి కొమ్మ కవసరమైన ఆహారం, నీరు అందుతూనే ఉంటాయి. కాక పోతే మొక్క స్వభావాన్ని బట్టి కొన్ని కొమ్మలు 3, 4 వారాల్లోనే వేళ్లూనితే కొన్నిటికి 5, 6 వారాలు పట్టవచ్చు. దారువు కఠినంగా ఉన్న చెట్ల కొమ్మలైతే 3, 4 నెలలు కూడా పట్టవచ్చు. మనం గంటుపెట్టిన కణుపుభాగంలో బాగా వేళ్ళు వచ్చాయో లేదో నిర్ధారణ చేసుకున్న తరువాతనే కొమ్మను తల్లిమొక్క నుండి వేరు చెయ్యాలి. అలా నిర్ధారించుకోడానికి కొమ్మను భూమిలోకి నొక్కిపెట్టిన భాగంలో కాస్తమేర సున్నితంగా మట్టిని తొలగించి చూచుకోవాలి. కణుపు దగ్గర బాగా కుచ్చుగా వేళ్ళు వచ్చా యని నమ్మకం కలిగితే గుంటమీద మట్టిని మళ్ళీ యథాప్రకారం కప్పెయ్యాలి. వేళ్ళొ చ్చాయి గదా అని కొమ్మను ఒక్కసారిగా తల్లి చెట్టు నుండి వేరు చెయ్యగూడదు. ఈ వేరు చెయ్యడమన్నది క్రమక్రమంగా చెయ్యాలి. అంటే మొదటిసారి కత్తిరించేటప్పుడు కొమ్మలో నాలుగోవంతు, ఒక వారం పోయాక ఇంకాస్తలోతువరకు, మరోవారం పోయాక పూర్తిగాను - అలా దఫాలవారీగా కత్తిరించు కోవాలి. ఇలా చేయడం వలన ఇప్పటివరకు తల్లిమొక్కమీద ఆధారపడిన అంటు క్రమక్ర మంగా స్వతంత్రంగా బ్రతకడానికి అలవాటు పడుతుంది. అలా అంటును పూర్తిగా వేరుచే సాక సున్నితమైన కుచ్చువేళ్ళు తెగకుండా జాగ్రత్తగా తవ్వితీసి మామూలు మట్టికుండీలో పెట్టుకోవాలి. మొక్కను కుండీలో ఎలాపెట్టా లన్నది 'పాటింగ్ - రీపాటింగ్' అనే అధ్యాయం చదివితే వివరంగా తెలుస్తుంది.

నేలలో నుండి తయారైన అంటును జాగ్రత్తగా తీసి కుండీలో పెట్టడం రిస్కుతోను, శ్రమతోను కూడుకున్నదనిపిస్తే ఏకంగా కుండీ లోనే అంటుతొక్కు కోవచ్చు. కుండీ ఎత్తు ఎక్కువయ్యిందనుకుంటే కావలసిన మేరకు నేలలో గొయ్యితీసి కుండీని నేలలోకి దింపుకో వచ్చు.

అలాగే అంటుతొక్క దలచుకున్న కొమ్మకాస్త ఎత్తుగా ఉంటే 10 వ నంబరు పటంలో చూపినట్లుగా కుండీని స్టాండుమీద గాని, పీటమీదగాని పెట్టి కొమ్మ అందేలా ఎత్తులేపుకోవచ్చు.

బోన్సాయ్‌గా పెంచ దలచుకున్న మొక్కలను రకరకాల విధానాలతో ఉత్పత్తి చేసుకోవచ్చని చూస్తూనే ఉన్నాంగదా ! కాని ఒకో శైలిలో మొక్కను మలచాలనుకున్నప్పుడు కొన్ని ప్రత్యేకమైన పద్ధతుల్లో తయారైన మొక్కలే అనువుగా ఉంటాయి. ఉదాహరణకు



పటం 10 : ఒకేసారి కుండీలో అంటుగట్టుకుంటే మంచిది





పటం 11 : తెప్పవిధానానికి అనువుగా నేలంటు కట్టే పద్ధతి



తెప్పవిధానంలో (Raft Style) బోన్సాయ్‌ని రూపొందించాలంటే దానికి అనువైన మొక్కను ఒక్క నేలంటు విధానంతోనే తయారు చేసుకో గలం!

తెప్ప విధానం గురించి ''బోన్సాయ్ శైలీ విన్యాసాలు'' అనే అధ్యాయంలో విపులంగా చెప్పబడింది.

## గాలి అంటు లేక గూటింగ్

సాధారణంగా చెట్టు ఎదిగిన కొద్దీ కాండం మొదట్లో కొమ్మలుండవు. అలాట ప్పుడు నేలంటు కట్టడం సాధ్యం కాదు గనుక 'గాలి అంటు' విధానం ఒక్కటే శరణ్యం!





పటం 12 : గాలి అంటు విధానం - అనువైన కొమ్మను ఎంచుకొని బెరడులేపి తడిమట్టిమట్టి మైనపు కాగితంతో మూసి కట్టెయ్యాలి



నేలతో సంబంధం లేకుండా గాలిలో ఉన్న కొమ్మభాగానికి అంటుకడతాం గనుక దీనిని 'గాలిఅంటు' అంటారు. దీన్నే 'గూటింగ్' అని కూడా అంటుంటారు. ఈ పద్ధతిలో చెట్టుమీద ఎంత ఎత్తున ఉన్న కొమ్మకైనా అంటుగట్టుకోవచ్చు.

బోన్సాయ్ కనువైన చక్కని తీరూ తెన్నూ ఉన్న కొమ్మను ఎంపిక చేసుకోవాలి. కొమ్మలో మనం కావాలనుకున్న భాగానికి ఒక కణుపు క్రిందుగా పదునైన కత్తితో కొమ్మ చుట్టూ రింగులా గాటుబెట్టి తాటతీసెయ్యాలి. గాటుపెట్టిన చోట తేమ ఆరక ముందే రూట్ ఫామింగ్ పౌడరు అద్ది ఇసుక కలిపిన ఎరువు మట్టిని తడిపి ముద్దగా చేసి కొమ్మచుట్టూ గాటుమీద ఆ మట్టి ముద్దను అదిమిపట్టి దాని పైన మైనపు కాగితంతోగాని, గోనెపట్టాముక్కతోగాని, కొబ్బరి పీచుతోగాని చుట్టి పైనా, క్రిందా గట్టిగా బిగించి కట్టాలి. ఎటొచ్చీ గోనె ముక్కను, కొబ్బరి పీచును ఉపయోగిస్తే తేమ నిలవదు గనుక మట్టిని పదే పదే తడపవలసి వస్తుంది. అదే మైనపు కాగితం అయితే లోపలికి గాలి చొరదు గనుక ఆ ఇబ్బంది ఉండదు.

తల్లి మొక్కనుండి ఆహారం, నీరు అందుతూనే ఉంటాయి గనుక కొమ్మ యథాలాపంగా పెరుగుతూనే ఉంటుంది. చెట్టుతీరును బట్టి కొన్ని వారాల్లో గాటుపెట్టిన దగ్గర కుచ్చు వేళ్ళు పుట్టుకొస్తాయి. ఈ వేళ్లు మైనపు కాగితంలోంచి మనకు కనిపిస్తుంటాయి. వేళ్ళు బాగా వచ్చాక నేలంటును కత్తిరించినట్లే దఫాల వారీగా అంటును తల్లిమొక్కనుండి వేరుచేసి కుండీలో నాటుకోవాలి.

బాగా ఎదిగిన కొమ్మలను, అన్నివిధాల మనశైలికి తగినట్లున్నాయనుకున్న కొమ్మలను ఎన్నుకోడానికి మనకెంతో స్వేచ్ఛ ఉన్న ఈ గూటింగ్ విధానంలో మరో సులువు కూడా ఉంది. అంటును చెట్టునుండి వేరు చేయక ముందే - ఆమాటకొస్తే అంటుకట్టక ముందే - కావాలనుకున్న కొమ్మను కావాలనుకున్న రీతిలో మలచుకోవచ్చు - ప్రూన్ చేసుకోవచ్చు - ట్రిమ్ చేసుకోవచ్చు. మనం అంటు కట్టబోయే కొమ్మ తల్లిమొక్కలో భాగంగానే ఉంటుంది గనుక క్లిష్టమైన మన శిక్షణను అది తట్టుకో గలుగుతుంది. అలా ముందే కొమ్మను షేప్ చేసుకుని ఆ తరువాత అంటుకట్టుకోవచ్చు. దీనివలన అంటుతో పాటు అన్నిరకాలుగాను సిద్ధమైన బోన్సాయ్ మనకు లభిస్తుంది. మామూలుగా అయితే అంటు మొక్క కుండీలో నిలదొక్కుకున్నాక గాని - అంటే దాదాపు సంవత్సరం తరువాత గాని మొక్కను ఏ రకంగానూ కదిలించగూడదు గదా !

ఈ గాలి అంటునే రకరకాలుగా కడుతుంటారు.

13 వ నంబరు పటంలో చూపినట్లుగా బెరడును కోణాలుగా (Wedge Shape) కత్తి



**పటం 13 : దారువు కఠినంగా ఉండే చెట్లలో బెరడును కోణాలుగా కత్తిరిస్తే బాగా వేళ్ళు వస్తాయి**

**పటం 14 : రెండు అర్ధవృత్తాలుగా బెరడును కత్తిరిస్తే కొమ్మ తేలిగ్గా వేళ్ళూనుతుంది**







రించడం ఒక పద్ధతి. ఇలా చేయడం వలన బెరడు అన్నిప్రక్కలకూ చీలి కాండపీఠం దృఢంగాను క్రమేణా పైకిపోయిన కొద్దీ సన్నబడుతూ కనిపిస్తుంది. అలాగే వేళ్ళుకూడా అన్ని వైపుల నుండి పుట్టుకు రావడంతో రేపు బోన్సాయ్‌గా రూపుదిద్దుకున్నప్పుడు ఇవే చక్కటి టాపరింగ్ గల ఉపరితలపు వేళ్లుగా మారతాయి.

దారువులో మెతకదనం ఉన్న చెట్ల కొమ్మలకు వచ్చినంత తేలిగ్గాను, త్వరగాను దారువు కఠినంగా ఉన్న చెట్ల కొమ్మలకు వేళ్ళు రావు. అలాటి వాటికి 14 వ నంబరు పటంలో చూపిన పద్ధతి ఎంతో అనువుగా ఉంటుంది. ఇక్కడ బెరడును పూర్తిగా వలిచి వేయకుండా కాండానికి ఇరువైపుల అర్థచంద్రాకారంలో గాటులుబెట్టి బెరడును వలవాలి. రెండుఅర్ధవృత్తాలు కలిసిపోతే ఒకే వృత్తంగా ఏర్పడేలా గాకుండా గాట్లురెండూ కాస్త క్రింద మీదుగా ఉండేలా పెట్టాలి. ఇలా చెయ్యడం వల్ల కొమ్మపై భాగానికి, క్రింది భాగానికి సంబంధం పూర్తిగా



తెగిపోదు. ఆహారం, నీటి ప్రసరణలు నిరాటంకంగా కొనసాగుతుండడంతో మొక్క తన సాధారణ జీవన వ్యాపారాలను జరుపుకొంటూనే ఉంటుంది. అందువల్ల వేళ్ళురావడానికి ఎంత ఎక్కువ కాలం పట్టినా కొమ్మ ఎండిపోకుండా సజీవంగా ఉంటుంది. పైగా రెండు అర్ధ వృత్తాకారపు గాట్లలోనుండి పుట్టిన వేళ్ళు మొక్కకు ఇరువైపులా సమతూకాన్నిచ్చే శక్తిని కలిగి ఉంటాయి.

దారువు మరీ కఠినంగా ఉన్న చెట్లకు అంటుకట్టవలసి వచ్చినప్పుడు గూటింగ్‌తో బాటు గర్డిలింగ్ విధానాన్ని కూడా ఉపయోగిస్తుంటారు. గర్డిలింగ్ విధానం గురించి 'కొమ్మలనుండి బోన్సాయ్ మొక్కలను పెంచడం' అనే భాగంలో తెలుసుకున్నాం గదా! కొమ్మ చుట్టూ తీగలాగి కట్టిన చోట రెండు మూడు నెలలకు గర్డిల్ పైన కొమ్మ ఉబ్బి బలిష్టంగా తయారవుతుందిగదా! ఆ భాగంలో అంటు కట్టడం వలన ఎంత మొద్దు మొక్కకైనా వేళ్ళు తప్పకుండా వచ్చేస్తాయి.

గాలి అంటు కట్టే ప్రదేశంలో మట్టిముద్ద చుట్టూ మైనపు కాగితం చుట్టి గాలిచొరకుండా



పటం 15 : మైనపు కాగితంతో చుట్టాక పైమూతిని తెరచి ఉంచితే మధ్య మధ్యలో మట్టిని తడపవచ్చు. కాని ఇది మన వాతావరణానికి అనువైన పద్ధతి కాదు.



రెండువైపులా బిగించి కడతారనుకున్నాంగదా ! దీనికి భిన్నంగా 15 వ నంబరు పటంలో చూపినట్లుగా గాటుకి క్రిందివైపు మాత్రమే బిగించి కట్టి పైభాగం తెరిచి ఉంచుతారు కొందరు. అలా వదిలిన పైభాగంలో నుండి మధ్యమధ్యలో నీళ్లు పొయ్యవచ్చని వారి అభిప్రాయం! కాని తెరచి ఉంచిన ఆ భాగంలో నుండి గాలి ప్రవేశించడంతో మట్టి త్వరగా పొడారిపోతుంటుంది. ఎక్కువ వేడిగా ఉండే మనవాతావరణానికి ఇది ఏ మాత్రం అనుకూలమైన పద్ధతి కాదు.

బోన్సాయ్‌ని పెంచేటప్పుడు దాని పెరుగుదలను మనం ఎంతగా అరికడుతున్నా ఒకోసారి అదిమనకు కావలసిన సైజుకు మించి పెరిగిపోతుంటుంది. అలా మొక్క పొడవుగా ఎదిగిపోయినప్పుడు కాండం మొదట్లో క్రిందగా ఉండవలసిన మొదటి వరుస కొమ్మలు మొక్కతో పాటు పైకి వెళ్ళిపోయి బోన్సాయ్ ఆకారాన్ని పాడు చేస్తాయి. ఎంతో కాలంగా పెంచిన మొక్కను చూస్తూ చూస్తూ వదులుకోలేం గదా! అటువంటప్పుడు కాండం క్రింది భాగంలో ఎంత ఎత్తు తగ్గించుదామనుకుంటామో ఆ భాగంలో గూటింగ్ చేస్తే, వేళ్ళు వచ్చాక కత్తిరించి పై భాగాన్ని కుండీలో పెట్టుకోవచ్చు.

ఏ పద్ధతిలో గాలి అంటు కట్టినా అంటును ఒక్కసారిగా తల్లిమొక్కనుండి వేరు చెయ్యగూడదన్న విషయం మనం మరచిపోగూడదు.

## గ్రాఫ్టింగ్ ద్వారా క్రొత్త బోన్సాయ్‌ని తయారు చెయ్యడం

అసలు విత్తనాలనే ఉత్పత్తి చేయలేని మొక్కల్లోను, విత్తనాలున్నా వాటికి మొలకెత్తే శక్తి లేకపోతేను, మొలకెత్తినా తల్లిమొక్క లక్షణాలను పూర్తిగా ప్రదర్శించలేకపోతేను, అంటుకట్టడం ద్వారా కూడా క్రొత్త మొక్కలను తయారు చెయ్యలేనప్పుడు మనం గ్రాఫ్టింగ్ పద్ధతిని అనుసరించాల్సి ఉంటుంది.

బలంగాను, వేగంగాను పెరిగే శక్తిగల మొక్కకు అతి తక్కువకాలంలో మేలురకం ఫలపుష్పాలనివ్వగల మొక్కను అనుసంధించి క్రొత్తమొక్కను తయారుచేసే విధానాన్నే 'గ్రాఫ్టింగ్' అంటారు. ఇలా కలుపబడిన మొక్కలు రెండూ ఒకే కుటుంబానికి చెంది ఉండాలి. వీటిలో భూమిలో ఉన్న మొక్కని స్టాక్ అని, పైన కలిపిన మొక్కని సియాన్ అని అంటారు. స్టాక్‌కి సియాన్‌లా తక్కువకాలంలో ఫలపుష్పాలనిచ్చే శక్తి ఉండదు. అలాగే సియాన్ మొక్కకి స్టాక్ మొక్కలా వేగంగా, బలంగా పెరగగల శక్తీ ఉండదు. ఈ రెంటి కలయిక వలన ఏర్పడిన క్రొత్తమొక్కకి రెండు మొక్క ల్లోని ఉత్తమ లక్షణాలు వస్తాయన్న మాట!



## గ్రాఫ్టింగ్

**పటం 16 : స్టాక్ కొనను 'V' ఆకారంలో కత్తిరించి సియాన్‌ను కలుపవచ్చు.**

పటం 17 : స్టాక్ కొనను ఏటవాలుగా కూడా కత్తిరించవచ్చు.



ఎంతో శాస్త్రీయంగా రూపొందించిన ఈ పద్ధతివల్ల తక్కువకాలంలో ఎక్కువ దిగుబడి నిచ్చే మేలురకం వృక్షజాతులను తయారు చేయ్యగలుగుతున్నారు. వాస్తవానికి మన బోన్సాయ్‌కి కావలసింది కూడా అవే గదా! దృఢమైన పొట్టికాండం, చక్కటి ఆకారం, నేలమీద విస్తరించిన ఉపరితలపు వేళ్ళు, పూలు పూయడం, కాయలు కాయడం - ఈ లక్షణాలను ఎంత తక్కువ కాలంలో చూపగలిగితే బోన్సాయ్ పెంపకందారు అంత సమర్థుడన్న మాట! ఈ లక్షణాల నన్నింటిని గ్రాఫ్టింగ్ ద్వారా మనం పొందవచ్చు.

కాని మామూలు రైతు అనుసరించే సాధారణ గ్రాఫ్టింగ్ విధానం ఉన్నదున్నట్లుగా బోన్సాయ్ పెంపకంలో అనుసరించడానికి వీల్లేదు. ఇందుకు ముఖ్యంగా రెండు కారణాలున్నాయి. సాధారణ విధానంలో తయారైన మొక్కలో స్టాక్ భాగం ఆకులు, కొమ్మలు లేకుండా చాలా పొడవుగా ఉండి ఆ పైన సియాన్ భాగంలో మాత్రమే ఆకులు, కొమ్మలు ఉంటాయి. అంటే బోన్సాయ్ కావలసిన పొట్టి కాండం ఇక్కడ మనకు లభించదన్నమాటే గదా!

కొన్ని జాతుల మొక్కల్లో స్టాక్ సియాన్‌ని కలిసిన చోట ఆ అతుకు చాలా పెద్దగా కొట్టొచ్చినట్లు కనిపిస్తుంటుంది. ఆ అతుకు భాగం బోన్సాయ్ కాండపు అందాన్ని తగ్గించివేస్తుంది.

అలాగని గ్రాఫ్టింగ్ వలన ప్రయోజనం లేదని అనుకోగూడదు. క్రొత్తమొక్కను తయారుచేయడానికే గాక ఉన్న బోన్సాయ్ మొక్కలోని అవకరాలను సరిదిద్దుకోడానికి కూడా గ్రాఫ్టింగ్ ఎంతగానో తోడ్పడుతుంది.

గ్రాఫ్టింగ్ పద్ధతిలో బోన్సాయ్ మొక్క ఆకారాన్ని సరిదిద్దుకోడానికి చాలా నేర్పుగా వాలి. ఆ ప్రత్యేక విధానాల గురించి ''స్పెషల్ టెక్నిక్స్'' అనే భాగంలో ముచ్చటించుకుందాం. ఇప్పుడు గ్రాఫ్టింగ్ ద్వారా క్రొత్త మొక్కనెలా తయారు చేసుకోవచ్చో చూద్దాం!

స్టాక్‌లో భూమికి దగ్గరగా కాండాన్ని రెండు సెంటీమీటర్ల ఎత్తువరకు మాత్రం కాండాన్ని ఉంచి ఆ పై భాగాన్ని కత్తిరించెయ్యాలి. ఈ స్టాక్ కొనమధ్యలో 16 వ పటంలో చూపినట్లు 'V' ఆకారంలో చాకుతో కొయ్యాలి. లేదా స్టాక్ వెనుక భాగంలో 17 వపటంలో చూపినట్లుగా ఏటవాలుగా చెక్కాలి. స్టాక్‌లో కత్తిరించిన భాగంలో ఖచ్చితంగా కూర్చునేలా సియాన్ అడుగుభాగాన్ని స్టాక్‌కు పెట్టిన గాటు ఆకారాని కనుగుణంగా 'V' ఆకారంలో గాని, ఏటవాలుగా గాని కత్తిరించాలి. వెంటనే ఈ సియాన్ కొనని స్టాక్‌లోకి సరిగ్గా ఇమిడేలా అమర్చేయాలి. ఆ రెంటినీ కలిపి గమ్ టేప్‌తోగాని, ట్వైన్ దారంతో గాని బిగించి కట్టెయ్యాలి. మొక్కల కాండాల్లో స్రవించే రెసిన్ అనే జిగురు పదార్థం స్టాక్, సియాన్‌లు కలిసి పోయేందుకు తోడ్పడు



తుంది. (గ్రాఫ్ట్‌చేసిన తరువాత దాదాపుసంవత్స రానికి స్టాక్, సియాన్‌లు కలిసిపోయి పొట్టిగా ఉండే క్రొత్తమొక్క ఏర్పడుతుంది. దీన్ని అప్పుడు బోన్సాయ్ కుండీలోకి మార్చుకో వచ్చు.

## నర్సరీ నుండి బోన్సాయ్ మొక్కను సంపాదించడం

నర్సరీనుండి బోన్సాయ్‌మొక్కను సంపాదించడమంటే అందరికీ సాధ్యమయ్యే



పటం 18 : నర్సరీ మొక్కను తెచ్చి అనవసరమైన కొమ్మలను, వేళ్ళను కత్తిరించి బోన్సాయ్‌గా రూపొందించుకోడం



పని. తక్కువ కాలంలో, తక్కువ శ్రమతో ఓ పాటి బోన్సాయ్ లభ్యమవుతుంది. మొక్కలను కొనుక్కోడానికి మనందరం నర్సరీకి వెళ్తూనే ఉంటాం గదా! క్రొత్త మొక్కలు ఏమున్నాయో చూసేటప్పుడు అనుకోకుండా ముదురుగా ఉన్నకాండంతోనూ ముడతలు పడిన బెరడుతో బాగా వయసున్నట్లు కనిపిస్తూనో, పైకి ఉబికివచ్చిన ఉపరితలపు వేళ్ళతోనో ఉన్న మొక్క కనిపించవచ్చు. బోన్సాయ్‌ని పెంచడంలో అభిరుచి ఉన్న వాళ్ళ దృష్టినుండి ఇలాటి మొక్కలు సాధారణంగా తప్పించుకోలేవు. అలాటివి కనిపించినప్పుడు వాటిని కొని తెచ్చేసుకోవడమే! మొక్క ఆ కుండీలో ఉండగానే కొంతమేరకు కొమ్మలని షేప్ చేసుకుని ఆ తరువాత దాన్ని బోన్సాయ్ కుండీలోకి మార్చుకోవచ్చు.

అయితే ఈ మొక్కలను బోన్సాయ్ శైలిలోకి తీర్చిదిద్దడం మనం అనుకున్నంత తేలికగాదు. ఎందుకంటే అదుపులేని ఈ మొక్కలు ఎత్తుగా ఎదిగి ఉంటాయి.

ఎత్తు తగ్గించడానికి కత్తిరించాలంటే కత్తిరించిన దగ్గర పడినగాట్లు మొక్క అందాన్ని తగ్గిస్తాయని భయం! మొక్క ముదిరి ఉండడం వలన తీగచుట్టి కొమ్మలను షేప్ చెయ్యాలన్నా అవి పెళుసుబారి ఉండడాన విరిగిపోయే ప్రమాదమూ ఉంటుంది. ఇలాటి అదుపుతప్పిన మొక్కలను అందంగా ఎలా మలచుకోవాలన్నది టెక్నిక్స్‌లో విపులంగా చెప్పుకుందాం!

## మన చుట్టూ ఉన్న పరిసరాల నుండి మొక్కను సంపాదించడం

బోన్సాయ్‌లను పెంచాలనే అభిరుచి, అభిలాష కలిగాక ఎక్కడికి వెళ్ళినా మనకళ్ళు అందుకనువైన మొక్కలేవైనా దొరుకుతాయేమోనని వెతుకుతూనే ఉంటాయి. అలాటివి కంటబడ్డప్పుడు వాటిని తవ్వి తెచ్చుకోవడంతో ఎంతో జాగ్రత్త అవసరం అవుతుంది. ఆ మొక్క ఏ రోడ్డు ప్రక్కనో, గట్టు ప్రక్కనో కనిపించవచ్చు. తెలిసిన వారింటి పెరట్లో ఉండవచ్చు. వాళ్ళు దాన్ని మనకు ఇవ్వడానికి ఒప్పుకుంటే ఆ చెట్టును నేలనుండి త్రవ్వకముందే అనవసరమనుకున్న కొమ్మలను పూర్తిగా తీసివేయడమో, కొంతవరకు కత్తిరించడమో చేయవచ్చు. అయితే పెరిగిన మొక్కను తవ్వాలంటే అందుకు కొంత శ్రద్ధ వహించవలసి ఉంటుంది.

ముందుగా చెట్టుకు బాగా నీళ్ళుపొయ్యాలి. నేల బాగా మెత్తబడిందనుకున్నాక చెట్టుచుట్టూ బాగా వెడల్పుగా గొయ్యి తవ్వాలి. చెట్టుపైన కొమ్మల నిడివి ఎంత ఉంటుందో చెట్టుచుట్టూ తవ్వే గోతి వ్యాసం కూడా సుమారు అంత ఉంటే మంచిది. ఆ చెట్టు ఎక్కడికి పోదు అనే ధైర్యం గనక ఉంటే కొంతలోతు వరకు గొయ్యి తవ్వాక దాన్ని సారవంతమైన క్రొత్తమట్టితో పూడ్చి నీళ్ళు



పటం 19 : పరిసరాల్లో దొరికిన మొక్కను బోన్సాయ్‌గా రూపొందించుకోడం









పోస్తూ కొన్ని నెలల పాటు వేచి ఉంటే మంచిది. అలా చెయ్యడం వల్ల క్రొత్త పీచువేళ్ళు పుట్టుకొస్తాయి. కొన్ని నెలలు పోయాక చెట్టును త్రవ్విన ప్పుడు తల్లివేరును బాగా కత్తిరించినా ఈ క్రొత్తవేళ్ళు నీటిని పీల్చుకుంటుంటాయి గనుక తవ్విన మొక్క చనిపోయే అవకాశం తక్కువగా ఉంటుంది. ముందు ముందు లోతు తక్కువ కుండీలో పెరగవలసిన బోన్సాయ్‌కి అవసరమైన వేళ్ళు కూడా అవే గదా!

ఏ పిక్నిక్‌కి వెళ్ళినప్పుడో, ఏదో ఊరు నుండి వచ్చే దారిలోనో మనకు నచ్చిన పొట్టిగా, ముదురుగా ఉన్న చెట్టు కనిపిస్తే అప్పటిక ప్పుడు మొత్తం చెట్టును ఒక్కసారిగా తవ్వకు రాక తప్పదు. అలాటప్పుడు ఎంతశ్రమైనా కూడా బాగా వెడల్పుగా, లోతుగా తవ్వి ముఖ్యంగా పీచువేళ్ళు ఏ మాత్రం తెగకుండా, వేళ్ళ చుట్టూ సాధ్యమైనంత ఎక్కువ మట్టి ఉండేలా చెట్టును భూమి నుండి తియ్యాలి. దానిని బాగా తడిపి మైనపు కాగితంతో చుట్టి సాధ్యమైనంత త్వరగా ఇంటికి చేర్చాలి. మొక్క సైజుని బట్టి కుండీని సిద్ధం చేసుకోవాలి. మైనపు కాగితం తీసేసి పెద్దకొమ్మలు గాని, ఆకులుగాని ఉంటే కత్తిరించేయాలి. అలా చేయకపోతే మొక్క పీల్చిన నీరుకాస్తా ఆకుల ద్వారా ఆవిరై పోతుంది. మొక్కని జాగ్రత్తగా కుండీలో నాటి దానిని కొంత కాలం పాటు ఎండ తగలకుండా బాగా వెలుతురు సోకే నీడ ప్రదేశంలో పెట్టాలి. కాండం కాస్త బలంగా ఉంటుంది గనుక గాలి తాకిడికి కదిలిపోకుండా అది బాగా కుదురుకునే వరకు కుండీలోనే ఒక కర్రపాతి కాండాన్ని దానికి కలిపి కట్టడం మంచిది. అలా మామూలు కుండీలో ఒక సంవత్సరం పాటు పెరగనిచ్చిన తరువాత తల్లివేరును బాగా అంట కత్తిరించి బోన్సాయ్ కుండీలో నాటుకోవాలి. మొక్క నిలదొక్కుకొని జీవం పోసుకున్నాక క్రమేణా కొమ్మలను మలచుకుంటూ రావాలి.

ఈ విధంగా తక్కువ కాలంలోనే దృఢ మైన కాండంతో కూడిన బోన్సాయ్ మనకి సిద్ధమవుతుంది. అయితే దృఢమైన కాండం వున్నంత మాత్రాన అది మంచి బోన్సాయ్ అనిపించుకోదు గదా! అలాటి కాండంతో పాటు చెట్టుకు చక్కటి ఆకారాన్నిచ్చే లక్షణమైన కొమ్మలు, తన్నుకుని భూమిమీదకు వచ్చిన ఉపరితలపు వేళ్ళు - ఇవన్నీ ఉంటేనే బోన్సాయ్‌కి అందం! అలా పెంచగలిగితేనే కష్టపడి తవ్వకు వచ్చినందుకు ప్రయోజనం సమకూరేది!



# 3 - బోన్సాయ్ రూపురేఖలు

పళ్ళెంలాటి లోతులేని చిన్న కుండీలో మనం పెంచే వామన వృక్షాలు విశాలవిశ్వంలో స్వేచ్ఛగా పెరిగే మహావృక్షాలకు సూక్ష్మరూపాలే అయినా మన కున్న అతితక్కువ పరిధిలో ఈ వామనవృక్షాలు మహావృక్షాలను తలపించేలా చెయ్యడానికి కొన్ని నియమ నిబంధనలను పాటించవలసి ఉంటుంది. వాటిని దృష్టిలో పెట్టుకుని పరిపూర్ణమైన బోన్సాయ్ రూపురేఖ లెలా ఉండాలో ఇప్పుడు చూద్దాం!

## ముఖభాగం

ఒక మొక్కను బోన్సాయ్‌గా తీర్చిదిద్దా లనుకున్నప్పుడు ముందుగా ఆ మొక్కకు 'ముందుభాగం' ఏదో నిశ్చయించుకోవాలి. ముందు భాగం అంటే 'ముఖం' అన్నమాట! 'మొక్కలకు ముందు వెనుకలు, ముఖాలు ఏమిటి?' అని మనకనిపించవచ్చు.

ప్రకృతిలో పెరిగే ఏచెట్టుకు ఇది ముందు భాగమని గాని, ఇది వెనుక భాగమని గాని ఉండక పోవచ్చు. కాని మనం పరిశీలించి చూచినట్లైతే ప్రతి చెట్టుకు ఒక అందమైన కోణం ఉంటుంది. అంటే ఈ కోణంలో నుండి చూచినప్పుడు చెట్టు మామూలుగా కనిపించే దాని కంటే ఇంకా ఎక్కువ అందంగా కన్పించు తుందన్నమాట! బోన్సాయ్ పరిభాషలో చెప్పా లంటే ఏ వైపునుండి అయితే చెట్టు అందంగా కనిపిస్తుందో అదే ఆ చెట్టు యొక్క ముఖం! అదే చూపరులను ఆకట్టుకునే ముఖ్యభాగం కూడాను! ఎటొచ్చీ భూమి మీదసహజ సిద్ధంగా పెరిగే మొక్కల ముఖాలను మనవైపు తిప్పుకో లేము - ఆ కోణం మార్చనూలేము! కాని మనం ఎంతో ప్రీతితోను, శ్రద్ధతోను పెంచుకునే అంద మైన బోన్సాయ్‌ల 'అందమైన ముఖాలు' మన వైపే ఉండేలా జాగ్రత్తపడాలి గదా!





పటం 20 : పరిపూర్ణమైన బోన్సాయ్ రూపం

బోన్సాయ్ మొక్కల పెంపకంలో మొక్కముందుభాగాన్ని నిర్ణయించడం ఎంత ముఖ్యమంటె మొక్కముఖ భాగమేదో తేల్చితే తప్ప బోన్సాయ్ రూప కల్పనకు అవసరమైన ఇతర ప్రక్రియలేవీ మొదలు పెట్టడానికి వీల్లేదు.

### కాండం:

చెట్టులో అతిప్రధానమైన భాగం కాండం! బోన్సాయ్ మొక్కకాండం ఆయాశైలు లను బట్టి - ఫార్మల్ అప్‌రైట్‌తోలాగా ఏవంపూ లేకుండా తీవిగా నిలబడవచ్చు - ఇన్‌ఫార్మల్‌లో లాగా వంపు సొంపులతో వయ్యారంగా ఉండ వచ్చు- జలపాతం (Cascade)లా జాలువార వచ్చు. శైలి ఏదైనాదానికో ప్రత్యేకమైన తీరు ఉండాలి. కాండం క్రిందినుండి పైవరకు ఒకే లావుతో మూసపోసినట్లుండకుండా కాండ పీఠం లావుగాను, దృఢంగాను ఉండి పోను పోను క్రమంగా సన్నబడుతూ చివరికి కొనదే లాలి (taper).



## కొమ్మలు:

కాండం తరువాత చెప్పుకోవలసింది కొమ్మలగురించి. చెట్టుకు చక్కటి ఆకారాన్ని, అందాన్ని ఇచ్చేది కొమ్మలే! బోన్సాయ్ మొక్కలో కొమ్మలు ఎట్టిపరిస్థితుల్లోను కాండానికి ముందు వైపున చూపరుల కంట్లోగుచ్చుకుంటున్నట్లుగా ఉండగూడదు. అంటే దీని అర్థం కాండానికి ఇరువైపుల, వెనుకభాగాన మాత్రమే కొమ్మలుండాలని వేరే చెప్పనవసరం లేదుగదా! అలా అని మూడువైపుల ఉండే మూడుకొమ్మలు కాండం చుట్టూ ఒకే ఎత్తులో గుండ్రంగా ఒక నున్నా చుట్టినట్లుండ గూడదు.

కాండం మీద ఉండే మొదటి కొమ్మ కాండానికి కుడివైపునగాని, ఎడమ వైపునగాని ఎటైనా ఉండవచ్చు. అయితే మొట్టమొదటి కొమ్మ ఎప్పుడూకూడా తక్కిన కొమ్మల కంటే దృఢంగాను, కాండ పీఠానికి దగ్గరగాను ఉండాలి. సిద్ధాంతం ప్రకారం చెప్పాలంటే కాండం నిడివిలో 1/3వ వంతు భాగాన మొదటి కొమ్మ ఏదో ఒక ప్రక్కగా ఉండాలి. మొదటి కొమ్మకు వ్యతిరేక దిశలోగాని, చెట్టుకు వెనుక భాగాన గాని రెండవ కొమ్మ ఉండాలి. ఈ రెండవ కొమ్మ మొదటి కొమ్మ కంటే కాండం మీద కాస్తపైగా బయల్దేరాలి. మూడవ కొమ్మ మూడువైపుల్లోను - కాండం ముందు భాగానగాకుండా - ఖాళీగా ఉన్నవైపు మొదటి రెండు కొమ్మల కంటే మరి కాస్త ఎత్తులో ఉండాలి. ఇంకా వివరంగా చెప్పాలంటే మొదటి రెండు కొమ్మలు చెట్టుకు అటూ ఇటూ గనుక ఉన్నట్లైతే మూడవ కొమ్మ వెనుక భాగంలో ఉండాలన్నమాట! అలా గాకుండా చెట్టుకు ఒక ప్రక్కన మొదటి కొమ్మ, వెనుక భాగాన రెండవ కొమ్మ ఉంటే చెట్టుకు మరో ప్రక్కన మూడవ కొమ్మ ఉంటుంది. ఈ మూడు కొమ్మల సముదాయాన్నే బోన్సాయ్ పరిభాషలో 'మూడు కొమ్మల వలయం' అంటారు.







పటం 21 : కొమ్మల వలయం ఉండవలసిన తీరు



కొమ్మలు కాండానికి ఏవైపున ఉండాలో, ఎంత ఎత్తున ఉండాలో తెలుసుకున్నాం గదా! ఇప్పుడు కొమ్మలసైజు ఎంత ఉండాలి, ఎలా ఉండాలి అనేది తెలుసుకుందాం!

మొదటి కొమ్మ తప్పని సరిగా తక్కిన రెండు కొమ్మల కంటే పొడవుగాను, దృఢంగాను ఉండి తీరాలి. రెండవ కొమ్మ మొదటి కొమ్మకంటే అన్ని రకాలుగాను చిన్నదిగా ఉండాలి - అంటే నిడివిలోను, లావులోనూ కూడా ! కాండానికి వెనుకవైపున ఉన్న కొమ్మ మాత్రం మొదటి రెండు కొమ్మల కంటే చిన్న దిగా ఉండాలి. ఈ వెనుక కొమ్మ ముందు నుండి కనిపించదు గదా- దానివలన ప్రయోజన మేమిటని మనమనుకోవచ్చు. కొమ్మ బయల్దే




పటం 22 : రెండు మూడు వలయాల కొమ్మలతో బోన్సాయ్



రడం కాండం వెనుకవైపే అయినా ఆకొమ్మ మనం ముందు నుండీచూస్తే కనిపించేలా రవ్వంత కుడికిగాని, ఎడమకు గాని వాలి ఉండాలి. ఈమొదటి వలయం పైన రెండో వలయపు కొమ్మలు - అంటే 4, 5, 6 కొమ్మలు ఏర్పడుతాయి. కొస్త కొస్త ఎత్తుల తేడాతో మొదటి వలయంలో లాగే అంటే ఒకటవ కొమ్మవైపున నాల్గవ కొమ్మ, రెండవ కొమ్మ వైపున అయిదవ కొమ్మ, మూడవ కొమ్మవైపున ఆరవకొమ్మ ఉండాలన్న మాట! పైకి వెళ్ళిన కొద్దీ కొమ్మల సైజు, కొమ్మకు కొమ్మకు మధ్య దూరమూ తగ్గుతూ పోవాలి. ఎట్టిపరిస్థితుల లోను కొమ్మలుకాండాన్ని దాటుకుంటూ ఇటు కొమ్మలు అటు, అటు కొమ్మలు ఇటు పోగూడదు. ఇలా వలయాల్లో అమరిన కొమ్మలు మొక్కకు చక్కటి 3 - D ఎఫెక్టు నిస్తాయి.

మొక్కలో కొమ్మలు ఎన్ని వలయాలు ఉండాలనేది కాండం నిడివి మీద ఆధారపడి ఉంటుంది. 15 సెం.మీలోపు ఉండే 'మేమ్‌బోన్సాయ్'లో ఒక్కవలయంతోనే శిఖరాగ్రం చేరు కుంటాం! అదే మామూలు బోన్సాయ్‌కి రెండు వలయాలు, బిగ్ బోన్సాయ్‌కి మూడు, నాలుగు కూడా ఉండవచ్చు.

కొమ్మలసైజు, ఆకారం గురించి చెప్పు కొటేటప్పుడు మనం మరో విషయం కూడా గుర్తుంచుకోవాలి. సాధారణంగా ఏమొక్కలో నైనా కొమ్మలకొనలు మొదట్లో సూర్యరశ్మి కోసం పైకి చూస్తుంటాయి. రానురాను లేత కొమ్మలు మాత్రమే అలా ఉండి ముదురు కొమ్మల కొనలు భారంగా క్రిందికి వాలి ఉంటాయి. అలాగే శిఖరాగ్రం కూడా కొంచెం ముందుకు వాలి ఉంటుంది. ఇలా క్రిందికి వాలిన కొమ్మలు, శిఖరాగ్రము చెట్టు వయసును తెలి యజేస్తుంటాయి. అందుకే మనం పెంచే బోన్సాయ్‌లో కూడా క్రిందికొమ్మల కొనలు భూమి వైపుకు, శిఖరాగ్రం చూపరుల వైపుకు వాలి ఉండేలా రాగి తీగతో మలచుకోవాలి. ఇలా వాలడం వలన మొక్క అసలు వయసు కంటే ఎక్కువ వయసు ఉన్నట్లు భ్రమింపజేయడమే గాక చెట్టు ఎత్తు తక్కువగా కనిపిస్తుంది కూడా!

## ఆకులు:

ఇకపోతే కొమ్మల కుండే ఆకులు! కొమ్మలూ అవీ అడ్డుపడి కాండం అందం మరుగున పడి పోకుండా ఎలా జాగ్రత్తపడుతుం టామో అలాగే ఇక్కడ కొమ్మల అందాన్ని ఆకులు కప్పేయకుండా శ్రద్ధవహించాలి. కొమ్మ కాండంలో నుండి బయలుదేరిన చోట ఉన్న ఆకులను తుంచెయ్యాలి. అలాగే కొమ్మ తీరూ తెన్నూ స్పష్టంగా కన్పించడానికి వీలుగా కొమ్మలకు అడుగుభాగాన ఉన్న రెమ్మలను కూడా ఎప్పటి కప్పుడు తొలగించేస్తుండాలి.



## పటం 23 :ముదిరిన కొమ్మ అడుగున ఆకులుండ గూడదు



దృఢమైన కాండపీఠం, పోను పోను సన్నబడి కొనతేలిన కాండం, మొదటి వలయపు కొమ్మలు బలంగాను, విశాలంగాను ఉండి ముందుకు పోయినకొద్దీ నిడివి తగ్గి సన్నబడిన కొమ్మలతో రూపొందిన బోన్సాయ్‌లో ఒక త్రిభుజాకారం మనకు కనిపిస్తుంది. ఈ త్రిభుజం సమబాహుత్రిభుజం గాకుండా ఉంటే బాగుంటుంది.

### *ఉపరితలపువేళ్ళు):*

బోన్సాయ్ మొక్కల పెంపకంలో కాండం తరువాత చూపరులను ఆకట్టుకునేవి ఉపరితలపు వేళ్ళు. కొమ్మలు కాండ ముఖభాగం వైపు లేకుండా ప్రక్కలకు, వెనుకకు మాత్రమే ఉండేలా ఎలా జాగ్రత్తపడతామో అలాగే ఉపరితలపు వేళ్ళు కూడా చూపరుల వైపు ముందుకు పెరగకుండా మిగిలిన మూడువైపులకు విస్తరించేలా జాగ్రత్తపడాలి.

వృక్ష జాతులకు సాధారణంగా కుచ్చువేళ్ళుగాక భూమిలోకి బలంగా చొచ్చుకుపోయి పెరిగే తల్లివేరు ఉంటుంది. ఈతల్లి వేరును కత్తిరించాక (తల్లివేరునెలా కత్తిరించాలో స్పెషల్ టెక్నిక్స్‌లో విపులంగా ఉంది) పై వరుసలోని ప్రక్కవేళ్ళను నేలమీద అన్నివైపులా (ముఖ భాగం వైపు లేకుండా) వ్యాపించేలా మలచుకోవాలి. తల్లివేరును కత్తిరిస్తాం గనుక దానికి చేరవలసిన ఆహారం ఈ ఉపరితలపు వేళ్ళకు జేరి రానురాను దృఢంగా తయారవు



తాయి. వేళ్ళమొదళ్ళు బలిష్టంగా ఉండి క్రమేపీ సన్న బడుతూ (taper) కొసలు భూమిలోకి చొచ్చుకు పోయి పెరుగుతాయి.

అలా బలంగా పెరిగి భూమి ఉపరితలం మీద వ్యాపించిన వేళ్ళు లోతు తక్కువైన బోన్సాయ్ కుండీలో చెట్టు స్థిరంగా నిలబడేందుకు తగిన ఆధారాన్నిస్తాయి.

ఈ ఉపరితలపు వేళ్ళు బోన్సాయ్ అందాన్ని ద్విగుణీకృతం చెయ్యడమే గాక, సహజవాతావరణంలో ఒక మహావృక్షాన్ని చూస్తున్న భావనను కలిగిస్తాయి.









**పటం 24: ఉపరితలపు వేళ్ళు ఎలా ఉండాలి?**



# 4 – కుండీలో పోసే మట్టి ఎలా ఉండాలి?

నేలలో పెరిగే చెట్లవేళ్ళు యధేచ్ఛగా భూమిలోకి చొచ్చుకుపోయి భూమిపొరల్లోని నీటిని, పోషకాలను గ్రహిస్తుంటాయి. కాని కుండీలో పెరిగే మొక్కకు ఆ స్వేచ్ఛ ఉండదు గదా! అందుకే కుండీలో మొక్కను పెంచదల చుకున్నప్పుడు భూమిలోపలి మట్టిపొరలను పోలినట్లు రకరకాల మిశ్రమాల్లో మట్టిని కలిపి కుండీని నింపుకోవాలి. మట్టిని సరైన పాళ్ళలో కలిపినప్పుడే అందులో పెరిగే మొక్క ఆరోగ్యంగా ఉంటుంది. లేని పక్షంలో అడుగున నీరు నిలవఉండిపోయి మట్టి సుద్దకట్టి, వేళ్ళకు గాలాడక మొక్క చనిపోయే పరిస్థితి వస్తుంది.

అందుకే కుండీలో పెరిగే మన వామన వృక్షం ఆరోగ్యంగా పెరగాలంటే అందులో నింపవలసిన మట్టిలో ఏమేం కలపాలి? అవి ఏపాళ్ళలో ఉండాలి? మొక్క నాటడానికి కుండీని ఎలా సిద్ధం చేసుకోవాలి అనే అంశాలను గురించి తెలుసుకుందాం!

మంచి మట్టి, ఎరువు, ఇసుకల మిశ్రమమే కుండీలో పోసే మట్టి!

ఒక ప్రాంతంలో నల్లమట్టి ఉండవచ్చు. మరో ప్రాంతంలో ఎర్రమట్టి ఉండవచ్చు. మట్టి ఎలా ఉన్నా కుండీలో కలపడానికి ఉపయోగించే మట్టి బంకగా మాత్రం ఉండకూడదు. ఉన్నంతలో సారవంతంగా ఉండాలి.

మొక్కలను పెంచే అభిరుచి ఉన్నవాళ్ళకు వాళ్లు పెంచుతున్న మొక్కల కోసం దొడ్లో ఒక మూల ఎరువు గుట్ట ఉంటుంది. చివికిన ఆకులు, అలం, గడ్డి, పేడ కలిసి ఈ ఎరువు తయారవుతుంది. మట్టిలో కలపడానికి సిద్ధంగా ఉన్న ఎరువు ముదురు గోధుమ రంగులోనో, నల్లగానో ఉండి చూడడానికి మట్టిలాగే



అనిపిస్తుంది. కుండీలో పెరిగే మొక్కకు బలా న్నందించడానికి మట్టిలో ఈ ఎరువును కల పాలి.

ఇంక మూడవది ఇసుక. వేళ్ళు తేలిగ్గా చొచ్చుకుంటూ పోవాలన్నా, వాటికి బాగా గాలి ఆడాలన్నా కుండీలో మట్టి గుల్లగా ఉండాలి. అందుకే ఆ మట్టిలో ఇసుక తప్పకుండా కల పాలి. ఇసుక ఎంత గండ్రగా ఉంటే అంత మంచిది. దీని మూలంగా కుండీలో ఎక్కువైన నీరు తేలిగ్గా క్రిందికి జారిపోతుంది.

మొత్తంమీద కుండీలో పోసే మట్టిమి శ్రమం మెత్తగా సుద్దకట్టిపోయేలా కాకుండా నీరు తేలిగ్గా బయటకు పోయేందుకు, వేళ్ళకు గాలి ఆడేందుకు వీలుగా బరకగా ఉండాలన్నమాట! అలాగని అది ఎప్పటికప్పుడు పూర్తిగా పొడారి పోకుండా, ఎండగా ఉండే పగటిపూట కూడా కాస్తోకూస్తో తేమను నిలుపుకో గలిగేలా ఉండాలి. కుండీ అడుగున నీరు నిలవ ఉంటే నీటిని పీల్చేశక్తి ఉన్న పీచు వేళ్ళు కాస్తా కుళ్ళి పోయి మొక్క చని. పోతుంది గదా! అందుకే మట్టి మిశ్రమాన్ని ఎంతో జాగ్రత్తగా తయారు చేసుకోవాలి.

మిశ్రమాన్ని కలిపే ముందు మట్టిగాని, ఎరువు గాని గడ్డలు గడ్డలుగా ఉంటే వాటిని



పటం 25 : కుండీలో మట్టి ఇలా ఉండాలి



మెత్తగా చితగ్గొట్టి ఏమాత్రం తడిలేకుండా ఎండ బెట్టాలి. అప్పుడు ఒక బొచ్చెడుమట్టి, ఒక బొచ్చెడు ఎరువు, బొచ్చెకు కొస్త వెలితిగా ఇసుకఒక కుప్పలా పోసి అన్నిటినీ బాగా కల పాలి. అలా కలిపేటప్పుడు ఆకులు, అలం, రాళ్ళులాటివి ఏరేయవచ్చు.

ఇప్పుడు ఈ మిశ్రమాన్ని అంగుళానికి రెండు మూడు గళ్ళున్న ఇనప జల్లెడలో పోసి జల్లిస్తే రాయి, రప్పపైన మిగిలిపోయి, మిగిలిం ధంతా క్రిందికి దిగిపోతుంది. పైన మిగిలిన దాన్ని తీసి పారెయ్యాలి. అడుగుకు దిగినది మనకు పనికి వచ్చే మట్టన్నమాట! ఇప్పుడు ఈమట్టిని అంగుళానికి నాలుగైదు గళ్ళున్న జల్లెడతో జల్లించాలి. పైన మిగిలిన చిన్నిచిన్ని గడ్డలలాటి మట్టిని ఒక ప్రక్కన కుప్పగా పొయ్యాలి.

అడుగుకు దిగిన మట్టిని పిండి జల్లెడ లాటి జల్లెడలో జల్లిస్తే మరీ మెత్తగా ఉన్న ధూళి క్రిందికి దిగుతుంది. ఈ ధూళిని మనం ఎట్టిపరి స్థితుల్లోను ఉపయోగించగూడదు. దీన్ని ఉప యోగిస్తే నీళ్ళు పడగానే ఇది సుద్ద గట్టిపోయి వేళ్ళకు ఊపిరాడకుండా చేస్తుంది. ఇది డ్రైనేజి రంధ్రాలకు అడ్డంపడి ఎక్కువైన నీరు క్రిందికి పోకుండా ఆపేస్తుంది. కాబట్టి ఈ ధూళిని పడబోసెయ్యాలి.

జల్లెడపైన మిగిలిన మిశ్రమాన్ని అంగు ళానికి సుమారు 16 గళ్ళున్న జల్లెడలో జల్లిం చాలి. పైన మిగిలిన మట్టిని ఒక కుప్పగాను, క్రిందికి దిగిన మట్టిని ఒక కుప్పగాను పొయ్యాలి. జల్లించడం నాలుగు సార్లు అయిన ప్పటికి రాళ్ళను, ధూళిని తీసేస్తే ఇప్పుడు మన దగ్గర మూడురకాల మట్టి మాత్రమే ఉంది - మొదటి కుప్పలో చిన్ని చిన్ని గడ్డలలాటిమట్టి, రెండవ కుప్పలో బరకమట్టి, మూడవకుప్పలో మెత్తటి మట్టిఉన్నాయి.

ఇప్పుడు వీటితో కుండీ నెలా సిద్ధం చేసుకోవాలో చూద్దాం!

ప్రతి కుండీకి అడుగున డ్రైనేజి రంధ్రా లుంటాయి గదా! ఆరంధ్రాలనలాగే తెరిచి ఉంచి మట్టిపోస్తే ఎక్కువైన నీళ్లతోపాటు వాటి ద్వారా మట్టికూడా క్రిందికి జారిపోతుం టుంది. అందుకని రంధ్రాల మీద ప్లాస్టిక్ మెష్ ముక్కను పరవాలి.

ఇంట్లోకి దోమలురాకుండా ఇనపమెష్ లను గాక ఇప్పుడు సన్నని ప్లాస్టిక్ మెష్‌లను కిటికీలకు వాడుతున్నారు. ఇది నట్టులు, బోల్టులు, తలుపుల గడలు లాటివి అమ్మే హార్డ్ వేర్ షాపుల్లో దొరుకుతుంది. ఆమెష్‌ను ఒక మీటరు కొని ఉంచుకుని అవసరమైనప్పుడల్లా వాడుకోవచ్చు.

కుండీ అడుగునంతా - ఈమెష్‌తో ముయ్యవలసిన పని లేదు. డ్రైనేజి రంధ్రంమీద



మాత్రం కప్పితే చాలు. ఈ మెష్ ముక్క కదిలి పోకుండా ఒకరాగి తీగతో బొమ్మలో చూపిన ట్లుగా బిగించి ఉంచుకోవాలి. అపుడు దానిమీద మొదటి కుప్పలోని గడ్డల మట్టిని, ఆపైన బరక మట్టిని పొయ్యాలి. కుండీలో మొక్క పెట్టదల చుకున్నచోట ఈ బరక మట్టిని కొస్త ఎత్తుగా ఒక కుప్పలాపోసి ఆ కుప్పమీద మొక్కను పెట్టాలి. మొక్కను మెల్లగా అదిమి ప్లాస్టిక్ మెష్నుండి పైకి లాగిఉంచిన రాగి తీగతో మొక్క కదలకుండా కట్టాలి. అప్పుడు ఒక పుల్లతో కూరుతూ మెత్తటి మట్టిని పొయ్యాలి.

రెండవ పొరగా పోసిన బరక మట్టి గుల్లగా ఉండడంతో దానిలో వేళ్ళు తేలిగ్గా చొచ్చుకు పెరగగలుగుతాయి. గాలికూడా సులభంగా చొరబడుతుంది.

ఇంకా అడుగున ఉన్న గడ్డల మధ్య ఖాళీ ఎక్కువగా ఉండడంతో ఎక్కువైన నీరు తేలిగ్గా క్రిందికి జారిపోయి డ్రైనేజి రంధ్రాల్లోంచి బయటకు పోతుంది.

కొందరు ఇసుకకుబదులు ఇటుక రాతి పొడిని ఉపయోగిస్తారు. ఇది గాలి, నీరు తేలిగ్గా ప్రసరించేందుకు తోడ్పడడమేగాక, నీటిని పీల్చుకుని ఎక్కువసేపు తేమ నిలిచేలా చేస్తుంది.

ఇసుకలో మెత్తటి ధూళికూడా కలసి ఉంటుంది కదా! అలా ఉన్నమెత్తటి ఇసుకను కుండీలోపోసే మట్టిలో కలిపితే ఆ ధూళి నీళ్ళతోపాటు కిందికి దిగి డ్రైనేజి రంధ్రాలను మూసి వేసే అవకాశం ఉంది. అందువలన కొందరు ఇసుకను కడిగి ధూళిపోగా మిగిలిన బరక ఇసుకను మట్టిలో కలుపుతుంటారు.

మట్టిపాళ్ళు కొస్త అటూ ఇటూ అయ్యి కుండీ అడుగున నీళ్ళు నిలవకుండా ఉండేం దుకు కొందరు ప్లాస్టిక్ మెష్ మీద ముందే మట్టిని పొయ్యకుండా ఇటుక రాతి ముక్కలను గాని, ఇసుకనుగాని ఒక పొరగా పోసి పైన మూడు పొరలుగా మట్టిని పోస్తారు.

మొక్కతీరును బట్టి, అవసరాన్ని బట్టి ఇసుక, ఎరువుల పాళ్ళను మార్చుకుంటుండ వచ్చు. మట్టి మిశ్రమాన్ని తయారు చెయ్యడం లోను, కుండీని సిద్ధం చేసుకోడంలోను మని షికి, మనిషికి మార్పు ఉంటుంది. పద్ధతి ఏదైనా మొక్క ఆరోగ్యంగా పెరగడం ముఖ్యంగనుక ఎలా అనుకూలంగా ఉంటే అలా చెయ్యవచ్చు.

పూలు, కాయలు పూసికాసే ముందు మొక్కను రీపాట్ చేసే సమయంలో మట్టిలో ఎరువు పాలు కొస్త పెంచి కలుపుకుంటే మంచిది.

సరైన పాళ్ళలో కలిపిన మట్టితో నింపిన కుండీలోని మొక్క మధ్యలో ఏఎరువుల అవస రంలేకుండా సాధారణంగా సంవత్సరం పాటు బలంగాను, ఆరోగ్యంగాను పెరుగుతుంది.





# 5 : పాటింగ్-రీ పాటింగ్

## (Potting - Repotting)

నేలమీద స్వేచ్ఛగా పెరిగే మొక్కను కుండీలో పెంచాలంటే అందుకు కొంత ప్రత్యేక శ్రద్ధ అవసరం. నేలమీద పెరిగే మొక్కకు ఆహారాన్ని, నీటిని వెదుక్కుంటూ వేళ్ళు ఎంత దూరమైనా వ్యాపించే అవకాశముంది. ఈ అవసరం, అవకాశమూ కుండీలో పెరిగే మొక్కలకు ఉండదు.ఎందుకంటే కుండీలో మొక్కకు కావలసిన నీరు, ఆహారం అన్నీ మనమే అందిస్తాం కనుక! ఎటొచ్చీ కుండీలో మొక్కకు నేలలో లాగా వేళ్ళు అనంతంగా వ్యాపించడానికి వీలుండదు.మనం పాతిన మొక్క స్వభావాన్ని బట్టి, కుండీ సైజును బట్టి, మొక్క పెరుగుదలను బట్టీ రెండు మూడేళ్ళలో ఎంత పెద్ద కుండీ అయినా పూర్తిగా వేళ్ళతో నిండిపోతుంది. అలాటప్పుడు వేళ్ళకు సరిగా గాలి అందక ఉక్కిరిబిక్కిరయి ఊపిరాడక మొక్క చనిపోయే ప్రమాదముంది. ఈ ప్రమాదాన్నుండి కాపాడాలంటే దానిని కుండీలో నుండి మార్చాలి. ఆ మార్చడం అంతకు ముందు కంటే పెద్ద కుండీలోకి అయినప్పుడు మనకే సమస్యా ఉండదు. ఎటొచ్చీ అదే సైజు కుండీగాని, బోన్సాయి కుండీ గాని అయినప్పుడే సమస్య అంతాను!

మొక్కను కుండీలోనుండి మార్చవలసిన ఆవశ్యకత గురించి చర్చించే ముందు వేళ్ళు మొక్కకు ఏ రకంగా ఉపయోగిస్తాయో తెలుసుకుందాం.

మొక్క భూమి మీద స్థిరంగా నిలబడడానికి, మొక్కకు అవసరమైన పోషక జలాన్ని అందించడానికి వేళ్ళు ఉపయోగపడతాయని



మనం చిన్నప్పుడే సైన్సు పుస్తకాల్లో చదువుకున్నాం! చిత్రమేమిటంటే మనకెంతో దృఢంగాను, అత్యవసరంగాను కనిపించే తల్లివేరు, పెద్దవేళ్ళు కూడా కేవలం మొక్కను లంగరు వేసినట్లు భూమికి అంటిపెట్టి ఉంచడానికి తప్పించి ఆహార సంపాదనలో ఏ మాత్రం తోడ్పడవు. మొక్క కెంతో అవసరమయిన పోషక జలాన్ని అందించే పనిని ఉండీ ఉండనట్లుగా కనిపించే నూగువేళ్ళు చేస్తాయి. తక్కిన పెద్దవేళ్ళు ఈ నూగువేళ్ళు పీల్చిన నీటిని మొక్కకు అందించే వాహకాలుగా మాత్రమే ఉపయోగపడతాయి. దీనిని బట్టి మొక్క ఆరోగ్యంగాను, దృఢంగాను ఉండడానికే కాకుండా మొక్క సజీవంగా ఉండాలన్నా కూడా ఈ నూగువేళ్ళు చాలా అవసరమన్నది మనకు తెలుస్తోంది.

ఇంతకు ముందు మనం చెప్పుకున్నట్లు నేల మీద పెరిగే చెట్లకు స్థలాభావం అనే సమస్య లేదు గనుక మొక్క పెరిగి మహావృక్షమైనా పెద్దవేళ్ళు వ్యాపిస్తూ వాటికి పిల్లవేళ్ళు, పిల్ల వేళ్ళ నుండి పీచువేళ్ళు - ఇలా అభివృద్ధి చెందుతూ మొక్కకు కావలసిన ఆహారాన్ని అందిస్తూ ఉంటాయి.

కుండీలో పెరిగే మొక్కలకు ఈ స్వేచ్ఛా సదుపాయాలు ఉండవు. అదే బోన్సాయి తొట్టి అయినప్పుడు ఈ సమస్య మరింత జటిలంగా ఉంటుంది. కుండీ చిన్నదిగా ఉండడానికి తోడు ఈ మొక్కలకు లభించే ప్రత్యేక శ్రద్ధ వలన మామూలుగా నేల మీద పెరిగే మొక్కల కంటే కూడా వీటి పెరుగుదల బాగా ఉంటుంది. ఆ కారణంగా కుండీలోని మట్టి ఇట్టే వట్టి పోతుంది. అంటే మట్టి నిస్సారమైపోయి మొక్క పెరుగుదలకు ఏ మాత్రం పనికి రాకుండా పోతుందన్నమాట.

దీనికితోడు అన్ని రకాలగాను పరిస్థితులు అనుకూలంగా ఉండడంతో వేళ్ళు చకచకా వ్యాపించి కుండీ నిండా అల్లుకుపోతాయి. వేళ్ళు త్వరగా వృద్ధి చెందడమన్నది ఆరోగ్య లక్షణమే అయినా తొట్టి నిండా సందు లేకుండా వేళ్ళు పెనవేసుకుపోవడం అన్నది మొక్కకు అన్నిరకాల గానూ ప్రమాదకరం.

ప్రతి కుండీకి అడుగు భాగాన ఎక్కువయిన నీరు బయటికి పోవడానికి వీలుగా డ్రైనేజి రంధ్రాలుంటాయి. విపరీతంగా పెరిగిపోయిన వేళ్ళు మరింత విస్తరించడానికి చోటు చాలక ఈ రంధ్రాలను మూసివేస్తూ బయటికి వచ్చే ప్రయత్నం చేస్తూంటాయి. అలా మూసుకు పోయిన రంధ్రాల వలన కుండీలోనుండి బయటకు వెళ్ళవలసిన నీరు అలా పోవడానికి వీలు గాక కుండీలోనే నిలిచి పోతుంది.

మొక్కకు నీరు ఎంత అవసరమో ఆరుదల కూడా అంతే అవసరం. ఆరుదలలేని మట్టి చిత్తడిగా తయారయి లోపలికి గాలి చొరనివ్వదు. అందుమూలంగా మట్టిలో ఉన్న వేళ్ళు



పీల్చుకోడానికి కావలసిన గాలి అందదన్న మాట. దీనివలన వెంటనే కాకపోయినా క్రమేణ మొక్క బలహీనపడి చచ్చిపోతుంది.

అంతే కాకుండా ఇలా కుండీనిండా సందులేకుండా వేళ్ళు అల్లుకుపోవడం వలన మొక్కకు ఎంతో అవసరమైన మూగు వేళ్ళే పుట్టడానికి స్థలం ఉండదు. మొక్కను సజీవంగా ఉంచేవి మూగువేళ్ళే గనుక ఇదీ మొక్కకు ప్రమాదకరమే!

ఈ పరిస్థితుల్లో మనం చేయగలిగిందేమిటంటే కుండీలోని మొక్కకు క్రొత్తగా వేళ్ళూనడానికి అవకాశం కలిపించడం! అంటే కుండీ నిండా వేళ్ళు అల్లుకు పోయాయని అనుమానం రాగానే కుండీలో నుండి మొక్కను బయటకు తీయాలి. ఆ తరువాత ముదురు వేళ్ళను కత్తిరించాలి. కొత్తమట్టిపోసి మళ్ళీ అదే కుండీలోగాని, వేరే కుండీలోగాని పెట్టాలి. ఇది అత్యవసరంగా చేయవలసిన పని.

ఇది ఒక్క బోన్సాయ్ మొక్కలకే కాకుండా మామూలుగా తొట్లలో పెంచే ఏ మొక్కకయినా అవసరమయిన ప్రక్రియే! ఎటొచ్చీ ఇక్కడ తొట్లు చిన్నవి గనుక ఈ అవసరం తరచు కలుగుతుంటుంది.

బోన్సాయ్ పెంపకం దార్లకు పాటింగ్ - రీపాటింగ్ (Potting-Repotting) గురించి - అంటే మొక్కను కుండీలో మొట్టమొదటిసారిగా పెట్టేటప్పుడు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి-పెద్ద కుండీలో నుండి బోన్సాయ్ కుండీలోకి ఎలామార్చాలి-ఎప్పుడు మార్చాలి-మళ్ళీ తిరిగి బోన్సాయ్ కుండీలో పెట్టవలసి వచ్చినప్పుడు (Repotting) ఎలాటి శ్రద్ధ వహించాలి-ఇవన్నీ క్షుణ్ణంగా తెలిసి ఉండాలి.

బోన్సాయ్ కోసం పెంచదలచుకున్న మొక్కను ఎప్పుడూ నేరుగా బోన్సాయ్ తొట్లో పెట్టం. మొక్క సాధ్యమయినంతా త్వరగా పెరిగి రూపుదిద్దుకోవాలని కదా మన ఆశ! అందుకోసం మొక్క బలంగాను, త్వరగాను పెరగడానికి ముందుగా నేలలో గాని, మామూలు తొట్లోగాని నాటుతుంటాం. రెండు, మూడు సంవత్సరాలు గడిచి ఆ మొక్క బాగా దృఢంగా పెరిగాక పెద్దకుండీ నుండి తీసి బోన్సాయ్ కుండీలోకి మారుస్తాం. ఇలా బోన్సాయ్ కుండీలో తొలిసారిగా మొక్కగా పెట్టడాన్ని పాటింగ్ (Potting) అంటాం.

ఇంతకు ముందు మనం చెప్పుకున్న పరిస్థితుల్లో-అంటే ఊపిరాడకుండాను, సందులేకుండాను వేళ్ళు అల్లుకుపోయిన పరిస్థితుల్లో మొక్కను బయటకు తీసి చేయవలసిన ప్రక్రియ అంతాచేసి మళ్ళీ బోన్సాయ్ తొట్టిలో నాటుతుంటాం. దీన్నే 'రీ పాటింగ్' అంటుంటాం.

ఈ 'రీపాటింగ్' మొక్క పెరుగుదలను బట్టి సంవత్సరానికి ఒకసారి అవసరమైతే రెండు సార్లు కూడా చేయవలసిరావచ్చు.

వేళ్ళకు వేరు పురుగుగాని, మరేదైనా



తెగులుగాని ఆశించి మొక్క అనారోగ్యంగా ఉందని అనుమానమొచ్చినప్పుడు కూడా 'రీపాటింగ్' అవసరమౌతుంది.

## వేళ్ళు ఎందుకు కత్తిరించాలి?

'పాటింగ్, రీపాటింగ్' చేయవలసి వచ్చినప్పుడు మొక్కకున్న ముదురు వేళ్ళను కత్తిరించడమన్నది నైపుణ్యంతో కూడుకున్న పని. నూగు వేళ్ళతో ఉన్న అవసరం మొక్కకు పెద్దవేళ్ళతో ఉండదని తెలుసుకున్నాం గదా! అందువలన స్థలాభావం ఏర్పడిన కుండీలో ముదురు వేళ్ళను, అనవసరమైన కుచ్చువేళ్ళను తొలగించడం ద్వారా క్రొత్తగా నూగు వేళ్ళు పుట్టడానికి స్థలం కలిపిస్తున్నామన్న మాట.

ఇప్పటి నూగువేళ్ళు కాలక్రమేణా పెద్ద వేళ్ళు అయిపోతాయి. అప్పుడు మళ్ళీ మనం ఇదే ప్రకారం బాగా బలంగా తయారయిన పెద్దవేళ్ళను తొలగించి మళ్ళీ నూగువేళ్ళు పుట్టడానికి స్థలం కవిపిస్తూ ఉంటాం.

ఇలా చెయ్యడం వల్ల మొక్కకు వయసు ముదురుతున్నా కూడా వేళ్ళు ఎప్పుడూ లేతగానే ఉండడంతో మొక్క ఆరోగ్యంగా పెరుగుతుంటుంది. అయితే ఇక్కడ మనం గుర్తుపెట్టుకోవలసిన ముఖ్య విషయమేమిటంటే వేళ్ళను కత్తిరించినప్పుడల్లా ఆ నిష్పత్తిలో ఆకులను కూడా కత్తిరించాలని!

## వేళ్ళను ఎప్పుడు కత్తిరించాలి? కుండీని ఎప్పుడు మార్చాలి?

సాధారణంగా వసంత ఋతువులోను, వర్షఋతువులోను మొక్కలు ఏపుగా పెరుగుతుంటాయి. అందువలన ఆ ఋతువులు ప్రారంభం కావడానికి కొద్దిగా ముందు అంటే - మొక్క క్రొత్తచివుళ్ళు తొడగడం ప్రారంభించగానే కుండీ నుండి మొక్కను తీసి, అనవసరమైన వేళ్ళను కత్తిరించి మరో కుండీలో పెట్టుకోవాలి. అలా చేయడం వల్ల క్రొత్త చివుళ్ళు వచ్చే సమయానికి క్రొత్తవేళ్ళు కూడా పుట్టి మొక్క పెరుగుదలకు అవసరమైన పోషకజలాన్ని అందించడానికి సిద్ధంగా ఉంటాయి.

డెలోనిక్స్, టికోమా లాటి చెట్లు ఆకులు రాల్చాకగాని పూలుపూయవు. పూలు పూసే తరుణం ముగిసాకే మళ్ళీ చిగురిస్తాయి. అలాటి చెట్లను పూలుపూస్తే ముందుగాని, పూలుపూస్తున్న సమయంలో గాని కుండీ మార్చే ప్రయత్నం చెయ్యగూడదు. ఎందుకంటే మొక్కను ఒక కుండీలో నుండి తీసి మరో కుండీలో పెట్టడమనేది దానికి పునర్జన్మ లాంటిది. క్రొత్త చివుళ్ళు తొడిగే ముందు ఆ పని చేస్తేనే అది తేలిగ్గా తిప్పుకోగలుగుతుంది. అందుకే ఈ చెట్ల పూతకాలం ముగిసాక - మళ్ళీ క్రొత్త చివుళ్ళు తొడగబోయేముందు కుండీని మార్చడం అన్నిరకాలుగాను శ్రేయస్కరం!



## పటం 27 : క్రొత్త చివుళ్ళు తొడిగే సమయంలో రీపాట్ చెయ్యాలి







వేసవికాలంలో మొక్కను మరో కుండీ లోకి మార్చే ప్రయత్నం ఏమాత్రం మంచిది గాదు. ఈ కాలంలో మామూలుగానే వేళ్ళు పీల్చిన నీరు కాస్తా ఆకుల ద్వారా త్వర త్వరగా ఆవిరైపోతుంటుంది. కుండీని మార్చే టప్పుడు తగు మాత్రంగా వేళ్ళను కత్తిరించక తప్పదు గదా! అలా కత్తిరించగా మిగిలిన వేళ్ళు వేసవిలో మొక్క అవసరాలకు తగినంత నీటిని అందించ



లేవు. ఈ నీటి ఎద్దడిని తట్టుకోలేక రీపాట్ చేసిన మొక్క ఎండిపోయే ప్రమాదం వస్తుంది.

ఒక వేళ వేసవికాలమైనా మొక్కను మరోకుండీలోకి మార్చక తప్పని పరిస్థితి వస్తే బాష్పోత్సేకాన్ని అరికట్టడం కోసం ఆకులను పూర్తిగా తుంచెయ్యాలి. అలా ఆకులంటూ లేని మొక్క తన అవసరం కొద్దీ మళ్ళీ త్వరగా చివుళ్ళు తొడుగుతుంది. ఈ లోపు క్రొత్తవేళ్ళు పుట్టుకొస్తాయి.

## *విధానం :*

మొక్కను కుండీలోనుండి తీసి వేళ్ళను కత్తిరించడం (Root pruning), తిరిగి మరో కుండీలో నాటడం (Repotting) వ్యవధి లేకుండా చేయవలసిన పనులు. ఇలా ఎందుకు చేయవలసి వస్తుందన్నది ఇంతకు ముందే చెప్పుకున్నాం.

బోన్సాయ్ పెంపకం దారులకు పాటింగ్ చేసే విధానం ఎంతో క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. దానిని బట్టి 'రీపాటింగ్' ఎలాగో దానంతటదే తెలుస్తుంది.

స్వేచ్ఛగా పెరిగిన మొక్కను బోన్సాయ్ కుండీలోకి మార్చాలంటే చాల రిస్కుతో కూడిన ఆపరేషన్స్ చేయవలసి ఉంటుంది. అందుకే బోన్సాయ్ కుండీలోకి మొక్కను మార్చుకునే ముందు ఆ మొక్క పరిపూర్ణమైన ఆరోగ్యంతో ఉండి, అన్ని రకాలగాను మనం చేయబోయే ఆపరేషన్స్‌కు తట్టుకుంటుందా లేదా అన్నది నిర్ధారించుకోవాలి.

ఎప్పుడూ మట్టితో కప్పబడి ఉండే వేళ్ళు ఎక్కువ సేపు బయటి వాతావరణాన్ని తట్టుకోలేవు. అందుకనే కుండీ నుండి మొక్కను తియ్యడం, వేళ్ళు కత్తిరించడం, తిరిగి మరో కుండీలో నాటేయడం - ఈ పనులన్నీ చకచకా జరిగి పోవాలి. అంతేగాక ఈ ప్రక్రియ జరుగుతున్నంత సేపూ, జరిగాక కూడా మొక్కకు ఎండతగులకుండా జాగ్రత్తపడాలి.

అందువల్లనే ఈ ఆపరేషన్‌కు అవసరమైన ఈక్రింది వస్తువులన్నీ అందుబాటులో ఉంచుకున్న తరువాతనే అసలు కార్యక్రమానికి ఉపక్రమించాలి.

— తగు పాళ్ళలో కలిపిన మట్టి
— అవసరాన్ని బట్టి తగినదాన్ని ఎన్నుకోడానికి వీలుగా కనీసం రెండు మూడు సైజుల కుండీలు
— ప్లాస్టిక్ మెష్
— సన్నని రాగి తీగ, లేదా ట్వైన్ దారం
— కత్తెర, హేక్సాబ్లేడు, చిన్నరంపం, మట్టి కూరడానికి ఒక పుల్ల, మొక్కనాటిన కుండీని ముంచి క్రింద నుండి నీళ్ళు పెట్టడానికి సిద్ధంగా పెద్ద బకెట్ నిండా నీళ్ళు, రోజ్‌కాన్
— ఏ కారణంగానైనా మధ్యలో ఆలస్యమైతే వేళ్ళను కప్పి ఉంచడానికి ఒక ప్లాస్టిక్ సంచి.



మొట్ట మొదటి సారిగా పెద్దకుండీలో నుండి బోన్సాయ్ కుండీలోకి మొక్కను మార్చుతున్నప్పుడు మొక్క సైజుకు అవసర మైన దానికంటే కాస్త పెద్ద బోన్సాయ్ కుండీని ఎన్నుకోవాలి. ఇది మొక్క వేళ్ళ మొత్తం పరి మాణం కంటే మూడురెట్లు పెద్దదిగా ఉంటే మంచిది. కుండీ పెద్దదైతే మొక్క కాస్త త్వరగా బలం పుంజుకోడానికి వీలుంటుంది. వేళ్ళను ప్రూన్ చెయ్యవలసిన అవసరం కూడా త్వరగా రాదు. ఆ మధ్యకాలంలో మొక్క బాగా కుదురు కుంటుంది.

బోన్సాయ్ కుండీలో పొయ్యబోయే మట్టి ఏ మాత్రం తేమ లేకుండా బాగా పొడిగా ఉండాలి.

ముందుగా కుండీలోని డ్రైనేజి రంధ్రా లను ప్లాస్టిక్ మెష్‌తో మూయ్యాలి. మెష్‌కుండీ అడుగున మొత్తం పరవకుండా రంధ్రాలమీద మాత్రం మూస్తే చాలు. మనం నాటబోయే మొక్క కుండీలో కుదురుగా నిలవడానికి, అవస రమైతే దాన్ని కుండీకేసి కట్టడానికి వీలుగా ముందుగానే ఒక రాగి తీగనో, బ్రైన్ దారాన్నో రంధ్రాల్లోంచి పైకిలాగి ఉంచుకో వాలి. కుండీలో మట్టి నింపడం ఎలాగో నాల్గవ అధ్యాయంలో తెలుసుకున్నాం గదా! ఈ ప్రకారం కుండీలో అడుగున ఇటుకరాళ్ళ ముక్కలను ఆ పైన బరక మట్టిని పొయ్యాలి. అంటే ఇప్పుడు మొక్క నాటడానికి కుండీ సిద్ధంగా ఉందన్నమాట!

ఏ కుండీలో నుండి మనం మొక్కను బయటకు తీద్దామనుకున్నామో ఆ కుండీలో మట్టి పొడిగా ఉండేందుకు రెండు రోజుల ముందు నుండీ నీరు కాస్త తగ్గించి పోస్తుండాలి. మట్టి పొడిగా ఉంటే మొక్కను బయటకు తీసాక రూట్‌బాల్‌లో అనవసరమైన మట్టిని తేలికగా తొలిగించవచ్చు.

కుండీలోనుండి మొక్కను బయటకు తీయడానికి ఒక ఇనుపకడ్డీని కుండీ అంచు ప్రక్కగా మట్టిలోకి దించి చుట్టూ తిప్పాలి. ఇప్పుడు కుండీని ప్రక్కకు వాల్చి మొక్కను మొదట్లో పట్టుకుని బయటకు లాగితే రూట్ బాల్‌తో సహా మొక్క బయటకు వస్తుంది.

ఆ తరువాత రూట్‌బాల్‌ని ఇనుపక డ్డీతో సున్నితంగా కదిపితే అనవసరమైన మట్టి రాలిపోయి ముదురు వేళ్ళు బయటికొస్తాయి.

మొక్కల్లో ఒకో రకం మొక్కకు ఒకో రకం వేళ్ళుంటాయి. కొన్నింటికి సన్నని కుచ్చు వేళ్ళుంటే, మరికొన్నింటికి పొడవుగా, మొద్దుగా పెరిగే లావుపాటి వేళ్ళుంటాయి. మనం వేళ్ళను కత్తిరించేటప్పుడు ఆ మొక్క వేళ్ళు ఎలాటివో గమనించాలి. కుచ్చువేళ్ళు ఉండే మొక్కలకు వేళ్ళు కుండీ నిండా అల్లుకు పోయి ముద్దలాగ ఉన్నప్పుడు రూట్‌బాల్‌లో క్రిందినుండి మూడోవంతు వరకు రంపంతో కోసి తీసేయవచ్చు.

సమస్యంతా రెండవరకం వేళ్ళతోనే!



## పటం 28 : పాటింగ్ - రీపాటింగ్

1

2

3

4

5

6

7



బాగా బండబారిపోయి మొక్కకు ముందు ముందు ఏ విధంగాను ఉపయోగపడవనుకొన్న - దాదాపు నిర్జీవమైపోయిన మొద్దువేళ్ళను కత్తిరించెయ్యాలి. వాటిని కత్తిరించేటప్పుడు మొక్కకు పోషక జలాన్నందించే సన్నని నూగు వేళ్ళు దెబ్బతినకుండా జాగ్రత్తపడాలి.

లావుపాటి వేళ్ళను కత్తిరించేటప్పుడు కొమ్మలను కత్తిరించినట్లుగానే ఏటవాలుగా కత్తిరించాలి. అలా చేస్తే క్రొత్త వేళ్ళు త్వరగా పుడతాయి.

మొక్కను కుండీలో తిరిగి నాటేటప్పుడు ఎలానాటాలి అనేది కూడా ముందే నిర్ణయించుకుంటే మంచిది. మనకు కావలసిన శైలిని బట్టి వేళ్ళను కత్తిరించుకోవచ్చు. ఉదాహరణకు మొక్కను ఏటవాలుగా నాటాలనుకుంటే - ఆవాలుకు వ్యతిరేక దిశలో ఉన్న పైవేరు కొంచెం పొడవుగా ఉండేలా కత్తిరించుకోవలసి ఉంటుంది.

'పొడవుగా ఉన్న వేళ్ళను మరీ ఎక్కువ కత్తిరించడ మెందుకు - మడిచి అడుగున పెట్టగూడదా?' అని మనకనిపించవచ్చు. ఎట్టి పరిస్థితుల్లోను అది కూడనిపనే! అలా మడిచి పెట్టిన వేళ్ళు మొక్కకు ఏ విధంగానూ తోడ్పడవు సరికదా వేరు ఒకదాని కొకటి నొక్కుకుని ఒరుసుకు పోయి కుళ్ళిపోవచ్చు. దాని మూలంగా మొక్కే చనిపోయే ప్రమాదం ఉంది.

వేళ్ళు తగిన మేరకు కత్తిరించాక అందుకు తగ్గట్టుగా కొమ్మలను, ఆకులను కత్తిరించి షేప్ చేసుకోవాలి. ఈ పనిని మొక్కను కుండీలో నాటకముందే చేయడం మంచిది. ఇప్పుడు మొక్కను ముందుగానే నిర్ణయించుకున్న విధంగా కుండీలో పెట్టి రంధ్రాల్లోంచి లాగి ఉంచిన రాగి తీగతో మొక్క కదిలిపోకుండా కట్టాలి. ఉత్తరోత్రా వేళ్ళు బాగా బలం పుంజుకుని లావైనప్పుడు ఒకోసారి ఈ రాగి తీగ బిగిసిపోయి వేళ్ళను కత్తిరించేసే ప్రమాదం ఉంది. అందుకని మొక్కను గట్టి దారంతో కడితే మంచిది. మొక్క కుదురుకునే సమయానికి ఈ దారం ఎటూ చివికిపోతుంది.

మొక్కను ఇలా స్థిరంగా నిలబెట్టాక మూడవ పొరగా ఉపయోగించవలసిన మట్టిని కుండీలో పొయ్యాలి. ఇలా పోసేటప్పుడు మధ్య మధ్య ఖాళీలు లేకుండా ఉండేందుకు ఒక పుల్లతో మట్టిని కూరుతుండాలి. ఈ మట్టిని మరీ కుండీ అంచువరకూ పొయ్యకుండా కాస్త ఖాళీ ఉంచి దాన్ని చేత్తో బాగా అదమాలి. ఇప్పుడు పై పొరలో పొయ్యవలసిన మట్టిని పొయ్యాలి. కుండీలోని మట్టిని నీళ్ళు పోసాక అదమ గూడదనే విషయాన్ని మనం గుర్తుపెట్టుకోవాలి.

ఇప్పుడు మొక్కకు నీళ్ళు పెట్టాలి. మామూలుగా మొక్కకు నీళ్ళు పోసినట్లు పైనుండి పొయ్యకుండా డ్రైనేజ్ రంధ్రాల ద్వారా క్రింది నుండి నీరుపెట్టే పద్ధతిని అవలం



బించితే మంచిది. ఇలా చెయ్యడం వలన మట్టీ, మొక్కా కూడా చెదరకుండానే కుండీలోకి నీరు బాగా ప్రవేశిస్తుంది. కుండీలో మొక్కను నాట గానే పెట్టే నీళ్ళలో విటమిన్ 'బి' టాబ్లెట్‌ని కరిగిస్తే మొక్క బలంగా పెరుగు తుందం టారు.

అలా మట్టంతా తడిసాక రోజ్ కాన్‌తో ఆకులమీద కూడా నీళ్ళు చిలకరించాలి.

ఆ తరువాత కూడా ఆకుల మీద తరచు నీళ్ళు చిలకరించడం అన్ని విధాలా మంచిది. క్రొత్తగా పెట్టిన మొక్కను కొద్దిరోజులపాటు ఎండతగులకుండా నీడనే ఉంచడం కూడా అవసరం.

బోన్సాయ్ కుండీలో మొక్కను నాటాక మొక్క చుట్టూ అందంగా మాస్ (Moss) పెడుతుంటాం. ఈ మాస్ మొక్క అందంగా కనిపించేలా చేయడమే కాక కుండీ లోని తేమ త్వరగా ఆరిపోకుండా కూడా కాపా డుతుంది. మనం పైనుండి నీళ్ళు పోసినప్పుడు మట్టి జారిపోకుండానూ ఆపుతుంది.

అలా రెండు మూడు వారాలు మొక్క నీడలో ఉన్న తరువాత క్రొత్త చివుళ్ళు తొడ గడం ప్రారంభిస్తుంది. అప్పుడు క్రమేణా మొక్కకు సూర్యరశ్మి తగిలేలా, రోజుకు రెండు మూడు గంటల చొప్పున ఉదయపు ఎండలో పెట్టవచ్చు. క్రమంగా సూర్యరశ్మి తగిలే సమ యాన్ని పెంచవచ్చు. ఏ బోన్సాయ్‌కయినా ఉదయం, సాయంత్రం తప్పించి మధ్యాహ్నం ఎండ తగల నివ్వగూడదు - ముఖ్యంగా 12-3 గంటల మధ్య కాలం!

## ఎంతకాలానికొకసారి కుండీ మార్చాలి ?

ఏ మొక్కైనా మాటిమాటికీ పీకి పెడ్తుంటే తిప్పుకోలేదు. మామూలుగా సంవ త్సరానికొకసారి మొక్కను తీసి మళ్ళీ నాటు కోవాలంటారు గాని మొక్క ఆరోగ్యంగా కని పిస్తూ పెరుగుదల ఏ మాత్రం కుంటుపడన ట్లుగా ఉంటే సంవత్సరమయినా, రెండు సంవ త్సరాలయినా దాన్నలా కదపకుండా ఉంచడమే మంచిది. మట్టి నిస్సారమయిందనుకుంటే కాస్తో కూస్తో ఎరువులు వాడవచ్చు.

కాని వేగంగా పెరిగే స్వభావం ఉండి బాగా పూలూ, కాయలు కాచే మొక్కలను మాత్రం ప్రతి సంవత్సరం కుండీలో నుంచి తీసి వేళ్ళు కత్తిరించి క్రొత్త మట్టిపోసి మళ్ళీ పెట్టవల సిందే!

వయసు ముదిరిన మొక్కల్లో పెరుగు దల లేతమొక్కల్లో ఉన్నంతగా ఉండదు. చెట్టు పైన మనకు కనిపించే పెరుగుదలకూ, లోపలి వేళ్ళకు అవినాభావ సంబంధముంటుంది కదా! అంటే వయసు ఎక్కువున్న మొక్కలో వేళ్ళలో కూడా పెరుగుదల మెల్లగానే జరుగుతుందన్న మాట! కాబట్టి ముదురు చెట్లను తరచు రీపా టింగ్ చేయడం, వేళ్ళు కత్తిరించడం అంత క్షేమం కాదు.



ఏదన్నా మొక్క అనారోగ్యంగా కనిపించినప్పుడు దాన్ని ఎలాగోలా బ్రతికించుకోవాలన్న ఉద్దేశంతో కుండీలోనుండి తీసి వేళ్ళను బ్రూవ్ చేసి మళ్ళీ నాటామనుకోండి! దానివల్ల ఒకోసారి మంచి జరగకపోగా చెడే ఎక్కువగా జరగవచ్చు. కొమ్మల్లో చివురు తొడిగే శక్తి లేనప్పుడు కుండీని మారిస్తే అనుకూలమైన పరిస్థితులవలన వేళ్ళు బాగా విస్తరించి పోషక జలాన్ని మొక్క పై భాగాలకు పంపుతాయి. కొమ్మలకు వాటిని వినియోగించుకునే శక్తి లేకపోవడంతో కాండం చుట్టూ పిలకలు పుట్టుకొస్తాయి. ఈ పిలకలు పెరిగాక సాధారణంగా తల్లిచెట్టు చచ్చిపోతుంది. అలాగాకుండా ఈ మార్పు క్రమేణా చేస్తే మొక్కకు కొంతవరకు తట్టుకొనే శక్తి ఉంటుంది.





# 6 - బోన్సాయ్ రూపురేఖలను తీర్చిదిద్దడం
# (Training Bonsai)

## ప్రూనింగ్, ట్రిమ్మింగ్
## (Pruning & Trimming):

స్వేచ్ఛగా పెరిగితే మహావృక్షాలు కా గల చెట్లు మన చేతుల్లో వామనవృక్షాలుగా రూపుదిద్దుకుంటున్నాయంటే అందుకు రెండు ప్రధాన కారణాలున్నాయి. అందులో ఒకటి - అతిచిన్న పాత్రలో పరిమితమైన ఆహారాన్ని మాత్రమే అందించడం. రెండవది - ఎప్పటికప్పుడు కాండంలోని కొమ్మలను, చిగుళ్ళను, ఆకులను, వేళ్ళను కత్తిరించుతుండడం! అలా కత్తిరించి మొక్కకు చక్కటి రూపురేఖలను దిద్దడాన్నే బోన్సాయ్ పరిభాషలో 'ప్రూనింగ్ అండ్ ట్రిమ్మింగ్' అంటారు.

నిజానికి ఈ ప్రూనింగు, ట్రిమ్మింగులు ఒక్క బోన్సాయ్ మొక్కలకే పరిమితం గాదు. ప్రకృతిలో ఇవి సహజ సిద్ధంగా జరిగే ప్రక్రియలే! ఆకుదూస్తేగాని మల్లె అంటు బాగా మొగ్గతొడగదని మనకు తెలుసు. అలాగే పూలు పూచి రాలాక గులాబీ తొడిమలను చిగురంటా కత్తిరిస్తుంటాం! ఎటొచ్చీ బోన్సాయ్ మొక్కల విషయంలో ఈ కత్తిరింపులు చాలా తరచుగా చేయవలసి వస్తుంటుంది. ఆ చేయడం కూడా ఊరికే పెరిగిన కొమ్మనల్లా కత్తిరించడం కాకుండా మనం ఏ శైలిలో మొక్కను పెంచదలచుకున్నామో ఆ శైలిని దృష్టిలో పెట్టుకుని అందుకు భిన్నంగా పెరుగుతున్న కొమ్మలను, రెమ్మలను, ఆకులను మాత్రమే ఎప్పటికప్పుడు తొల



గిస్తుంటాం! తరచు ఇలా చేయడం వలన మొక్క ఆకారమే కాకుండా సైజును కూడా అదుపుచేయగలుగుతాం!

ఆకులు మొక్కకు మించి మరీ దట్టంగా ఉన్నప్పుడు కూడా ఈ కత్తిరింపు చేయవలసి వస్తుంది. ఎందుకంటే ఆకులు ఎక్కువగా ఉన్నప్పుడు బాష్పీకరణం ఎక్కువగా ఉంటుంది. అంటే ఆకులద్వారా మొక్క పీల్చుకున్న నీరు ఆవిరైపోతుంటుందన్న మాట! బోన్సాయ్ మొక్కకుండే కొద్దిపాటి నూగువేళ్ళు దాని



పటం 29 : ప్రూనింగ్–అనవసరమైన కొమ్మలను, రెమ్మలను తొలగించాలి



కున్న ఆకులు సమతులంగా ఉండాలన్న విషయం మనం పదే పదే చెప్పుకుంటున్నదే! అంటే నూగువేళ్ళు అందించే నీటికి తగినంత తగా మాత్రమే ఆకులుండాలి. ఈ సమతులత్వం కోసం కూడా ఆకులను గిల్లి వేస్తూండడం అవసరం!

అంతే కాదు మట్టిలోని వేళ్ళకు గాలి తగలడమన్నది ఎంతముఖ్యమో ఆకులకు కూడా గాలీ, వెలుతురూ అంతే అవసరం! ఈ కారణంగా కూడా శైలికీ, అందానికీ ఏ రకంగానూ ఆటంకం లేకపోయినా ఆకులను తగ్గించవలసివస్తుంది.

మనం ఇంతకు ముందు చెప్పుకున్నట్లు తరచు ప్రూనింగు, ట్రిమ్మింగు చేయడం వలన కేవలం మొక్క సైజు తగ్గడమే కాకుండా కొమ్మల సైజు, ఆకులసైజు, కణుపుకు కణుపుకు మధ్య దూరం కూడా బాగా తగ్గిపోయి మొక్క మరింత అందంగా కనిపిస్తుంది.

అంతేకాకుండా మొక్క అందానికి గాని, ఆకారానికిగాని ఏ విధంగాను ఉపయోగపడని కొమ్మలు, రెమ్మలు తొలగించడం వలన మొక్కలోని మిగిలిన కొమ్మలు, కాండం, ఉపరి తలపువేళ్ళు మరింత బలం పుంజుకుంటాయి. అందువలన మన బోన్సాయ్ అతితక్కువ కాలంలో ఒక మహావృక్షంలా రూపొందే అవకాశ ముంటుంది.

## *కొమ్మలను కత్తిరించడం (Branch Pruning)*

బోన్సాయ్ మొక్కలను ప్రూన్ చేసేటప్పుడు మనం గుర్తుపెట్టుకోవలసిన ముఖ్యవిషయం ఏమిటంటే చెట్టుకాండం, కొమ్మలు అమరిక కూడా మనకు స్పష్టంగాను, పొందిగ్గాను కనిపించేలా చూచుకోడం! బోన్సాయ్‌ని పెంచేటప్పుడు మనం ప్రకృతిలోని వృక్షా తీరుతెన్నులను అనుకరిస్తున్నాం గద మామూలుగా చెట్లన్నీ గుబురుగా కనిపిస్త టాయి. మన బోన్సాయ్ మాత్రం అలా ఎం కుండగూడదు? అని మనకనిపించవచ్చు ప్రకృతిలో మనం ఆకాశాన్నంటే మహావృక్ష లను నేలమీద నిలబడి చూస్తుంటాం! అలాట ప్పుడు మనకు కాండం పై భాగం, కొమ్మలు, రెమ్మలు స్పష్టంగా కనిపించకుండా గుబురుగా కనిపించడం సహజం! కాని ఇక్కడ అడుగు, అడుగున్నరకు మించని ఈ వామన వృక్షాలను మహావృక్షాల్లా భ్రమింప చేయాలంటే మనం ఎన్నో పద్ధతుల నవలంబించవలసి ఉంటుంది.

బోన్సాయ్ కాండం మీద అడ్డదిడ్డంగా కొమ్మలను, రెమ్మలను పెరగనివ్వగూడదు. మొక్క ముఖభాగంలో కొమ్మలు ఉండగూడదు. ఒకే చోట నుండి రెండు, మూడు కొమ్మలను పెరగనివ్వగూడదు. మనం ''బోన్సాయ్ రూపురేఖల్లో'' చెప్పుకున్న



## పటం 30 : "మూడుకొమ్మల వలయానికి" అవసరమైన కొమ్మలనే ఉంచాలి



'మూడు కొమ్మల వలయాలు' స్పష్టంగా కనిపిస్తుండాలి. అందుకు విరుద్ధంగా ఉన్న కొమ్మలన్నిటినీ కత్తిరించేయాలి.

మనం చెట్లను ప్రూన్ చెయ్యబోయే ముందు చెట్లతీరును నిశితంగా గమనించాలి.చెట్లలో పూమొగ్గలనుండి పూలెలా వికసిస్తాయో అలాగే ఆకులు వచ్చే మొగ్గలు కూడా ఉంటాయి.అలాటి మొగ్గలు చాలా చెట్లలో కొమ్మ ముదురు భాగాలమీద మనకు కనిపించవు.అవి లేతగా ఉన్న కొనల భాగాల్లోను (శిఖరాగ్రం), ఆకు తొడిమకు, కాండానికి మధ్యనున్న కోణం (గ్రీవం) లోను ఉంటాయి.ఈ మొగ్గలున్నచోట కొమ్మలను కత్తిరిస్తే మళ్ళీ చిగుళ్ళొస్తాయి గాని ఆమొగ్గలు లేని



## పటం 31 : చిగురించే మొగ్గలున్న చోటే కత్తిరించాలి



ముదురు భాగం వరకు అంటకత్తిరేస్తే మాత్రం ఆ కొమ్మ చిగురించదు. అది గమనించుకొని కొమ్మలను ప్రూన్ చేసుకోవాలి.

కొమ్మను కత్తిరించేటప్పుడు 32 వ పటంలో చూపినట్లుగా కణుపు దగ్గర గ్రీవంలో ఉన్న మొగ్గకు రవ్వంతపైన కత్తిరించాలి తప్ప మరీ పైకి కత్తిరించ గూడదు. అలా కత్తిరిస్తే చిగురుకు పైన మిగిలిన ఆ మొంటి కుళ్ళి క్రొత్త కొమ్మగా పెరగవలసిన మొగ్గకూడా చిగురించ కుండా పోవచ్చు.

విత్తనం నాటి మొలిపించి మొక్క చిన్నప్పటి నుండి శిక్షణనిస్తూ పెంచే బోన్సాయ్‌లో ఈ కొమ్మలను తొలగించడం పెద్ద సమస్యగా ఉండదు. కాని కాస్త పెరిగిన మొక్కను బోన్సాయ్‌గా మలచుకోవలసి వచ్చినప్పుడే ఎంతో నేర్పు, ఓర్పు అవసరం అవుతాయి. మనం ఆ మొక్కను ఏ శైలిలోకి మలచుకోదలచుకున్నామో ఒక ఊహా చిత్రాన్ని ముందుగానే తయారు చేసుకోవాలి. ఆ ప్రకారం మనకవసరమైన కొమ్మలను, రెమ్మలను మాత్రం ఉంచుకొని మిగిలిన వాటిని తొలగించెయ్యాలన్న మాట!



పటం 32 : కణుపు దగ్గర గ్రీవంలో ఉన్న మొగ్గకు
రవ్వంతపైన కత్తిరించాలి తప్ప మరీ పైకి కత్తిరించగూడదు





పటం 33 : కత్తిరించిన దగ్గర మొంటె కనిపించకుండా జాగ్రత్తపడాలి



కొమ్మను కత్తిరించేటప్పుడు ఎంతో నేర్పు అవసరం అవుతుంది. కత్తిరించిన దగ్గర మొంటె కనిపించకుండా పుటాకారంగా కాండంలో కల్లా కత్తిరించుకోవాలి. అలా కత్తిరించగలిగినప్పుడే క్రమంగా ఆ భాగంలో క్రొత్తకణాలు, ఆ పైన బెరడు ఏర్పడి ఏ మాత్రం ఉబ్బెత్తుగా లేకుండా కాండంలో కలసిపోతుంది.

కొమ్మను కత్తిరించిన గాటు ఒక ప్రక్కకో, వెనకకో ఉండేలా జాగ్రత్తపడాలి. గాటు ఎదురుగుండా ఉంటే కాండం అందం తగ్గిపోతుంది.

**పటం 34 : కత్తిరించిన గాటు ఒక ప్రక్కకో, వెనక్కో ఉండాలి ఎదురుగా ఉంటే కాండం అందం తగ్గిపోతుంది**





## *చిగుళ్ళను కత్తిరించడం (Pruning Shoots)*

మొక్క ఎత్తు ఎదగకుండా పొందికగా ఉండేలా మలచుకోడం ప్రూనింగ్ ప్రధానోద్దేశమని చెప్పుకున్నాం గదా! కాండం కొసన ఉన్న చిగుళ్ళు చెట్టు పొడవును పెంచుతుంటాయి! అలాగే కాండం ప్రక్కగా కొమ్మల, ఆకుల గ్రీవాల్లో వచ్చిన చిగుళ్ళనుండి క్రొత్తకొమ్మలు, ఆకులు పుడుతుంటాయి. అందుకే మొక్క



పటం 35

శిఖరాగ్రాన్ని కత్తిరిస్తే చెట్టు పొడవు తగ్గి కొమ్మలు బలంగా పెరుగుతాయి.



కొమ్మలను కత్తిరిస్తే శిఖరాగ్రం పెరుగుతుంది



ఎత్తు తగ్గించాలంటే కాండపు కొన భాగాన్ని ఎప్పటికప్పుడు కత్తిరిస్తుండాలి. క్రొత్త కొమ్మ కావాలనుకున్న చోట ఆ ఒక్క చిగురును మాత్రమే ఉంచి ఎక్కువగా ఉన్న చిగుళ్ళను తుంచేస్తుండాలి. ఈ చిగుళ్ళను తుంచేటప్పుడు ఎలాబడితే అలా తుంచగూడదు. కాండపు కొనను కత్తిరించేటప్పుడు ఎంతవరకు కత్తిరించదలచుకున్నామో అక్కడ ఒక కణుపుకు రవ్వంత పైభాగాన కత్తిరించాలి. ఆ కణుపులో ఉన్న చిగురు ముందు ముందు కాండాగ్రంగా పెరుగుతుందన్న మాట! ఇలా కాండాగ్రాన్ని ఎప్పటికప్పుడు కత్తిరించకుండా అశ్రద్ధ చేసినట్లైతే చెట్టు చివరిభాగం అదుపుదప్పి మొక్క ఎత్తుగా ఎదిగిపోవడమే గాక, ఆభాగం



బలం పుంజుకుని క్రింది కొమ్మలు బలహీనపడి పోయే ప్రమాదం ఉంది.

అలాగే కొమ్మలను ట్రిమ్ చేసుకునేటప్పుడు ఏదైనా ఒక కొమ్మ ఉండవలసినంత బలంగా లేదు అనుకున్నప్పుడు కొంతకాలం పాటు ఆకొమ్మను ట్రిమ్ చెయ్యడం ఆపేసి మిగిలిన కొమ్మలని మాత్రమే ట్రిమ్ చేసుకుంటుండాలి. ఆ కొమ్మ తగినమేరకు బలంపుంజుకుందనిపించినప్పుడు ఆ కొమ్మను కూడా మిగిలిన కొమ్మలతో పాటు ట్రిమ్ చేసుకోవచ్చు.

అయితే ఈ ప్రూనింగు, ట్రిమ్మింగు ఎంత తరచుగా చెయ్యాలి, ఏ ఋతువులో చెయ్యాలి అన్నది చెట్టు ప్రకృతి మీద ఆధారపడి ఉంటాయి. కొన్ని చెట్లు వసంత ఋతువులో గాని చిగురించవు. కొన్ని వర్షాకాలంలో త్వరగా చివురిస్తుంటాయి. మరికొన్ని రకాలు సంవత్సరం పొడవునా చివురిస్తూనే ఉంటాయి. పూలు పూసే చెట్లను పూలు పూచే సమయంలో కత్తిరించకుండా ఆ సీజన్ అయిపోయాక ప్రూన్ చేసుకోవాలి.

## ఆకులను కత్తిరించడం
## (Leaf Pruning)

చెట్టు పొట్టిగా ఉండటం, కొమ్మలు పొందికగా ఉండడం ఎంత అవసరమో బోన్సాయ్‌లో ఆకులు చిన్నవిగా ఉండటం కూడా అంతే ముఖ్యం! చింత, సీమచింత లాంటి చెట్ల



**పటం 36 : పెద్ద ఆకులను పదే పదే త్రుంచుతుంటే చిన్న ఆకులు వస్తాయి**



ఆకులు సహజంగానే చిన్నవిగా ఉంటాయి. కాని మట్టి జాతి వృక్షాలు, మామిడి, పనస, కుంకుడు, గానుగ - ఇలాటి చెట్ల ఆకులు సాధారణంగా వెడల్పుగా ఉంటుంటాయి. బోన్సాయ్ అందంగా, పొందిగ్గా ఉండాలంటే ఆ ఆకుల సైజు తప్పనిసరిగా తగ్గితీరాలి గదా!

అయితే సన్న ఆకులు రావాలి గదా అని మరీ ఎక్కువగా ఆకులను తుంచేస్తుండగూడదు.ఎందుకంటే మొక్కకు ఆహారాన్ని, తద్వారా బలాన్ని ఇచ్చేది ఆకులేగదా! అందుకే పూర్తిగా ఆకులను తీసేస్తే ఒక్కోసారి మొదటికే మోసం రావచ్చు.చెట్టు చనిపోవచ్చు. అందువలన మొత్తం ఆకులన్నీ ఒక్కసారే దూసిపోసే బదులు తడవకు కొన్ని చొప్పున - అంటే కొన్ని కొమ్మల ఆకులు ఒకసారి, మరికొన్ని కొమ్మల ఆకులింకొకసారి గాను తీసివేయడం అన్ని రకాలుగాను క్షేమం!

ఆకులను తుంచేటప్పుడు తొడిమ ఉంచి తుంచడం మంచిది. ఆ తొడిమ గ్రీవం లోని మొగ్గకు రక్షణగా ఉంటుంది. మొగ్గ చిగిర్చే సమయానికి తొడిమ దానంతటదే రాలిపోతుంది.

ఆకులు తక్కువగా ఉన్నప్పుడు నీళ్ళు తక్కువగా పొయ్యాలన్నది మనం మరచి పోకూడదు. నీరు తక్కువైతే డీహైడ్రేషను వచ్చినట్లుగానే నీరెక్కువ అయినప్పుడు మొక్కకు



పటం 37 : ఆకులను తుంచేటప్పుడు తొడిమ ఉంచి తుంచడం మంచిది. ఆ తొడిమ గ్రీవంలోని మొగ్గకు రక్షణగా ఉంటుంది



హైపర్ టెన్షన్ వచ్చి చనిపోయే అవకాశం ఉంది. అంతేగాదు. ఆకులను తుంచినప్పుడు కాండా గ్రాన్ని కూడా తప్పనిసరిగా కత్తిరించడం మర చిపోగూడదు. అలా చెయ్యకపోతే ఉన్న బల మంతా ఆ భాగానికి చేరి చెట్టు పొడవుగా సాగిపోయే ప్రమాదం ఉంది.

లేత చిగుళ్ళను, ఆకులను ఎప్పుడంటే అప్పుడు కత్తిరించినా ముదురు కొమ్మలను మాత్రం చిగుళ్ళు తొడిగే కాలంలోనే కత్తిరించాలి.

ఆకులను తుంచినప్పుడు మొక్కను తప్పనిసరిగా క్రొత్త చిగుళ్ళు వచ్చేవరకు నీడలో ఉంచాలి.

ఆకులను తుంచడానికి ముందుగాని, తుంచిన వెంటనే గాని ఎట్టి పరిస్థితుల్లోను ఎరువులను వాడకూడదు.

## వేళ్ళు:

ప్రకృతిలో మహావృక్షాలను చూస్తున్నప్పుడు పెద్ద మ్రాను, విశాలంగా విస్తరించిన కొమ్మలతోపాటు మనదృష్టిని ఆకర్షించేవి- బలంగా ఉబికి, పాముల్లా మెలికలు తిరిగి భూమి మీద వ్యాపించిన ఉపరితలపు వేళ్ళు.

కుండీలో మనం పెంచే వామనవృక్షంలో కూడా అలాటి వేళ్ళున్నప్పుడే అది మహావృక్షాన్ని తలపింపచేస్తుంది.

భూమిలో లోతుగా చొచ్చుకుపోయి పెరిగే తల్లివేరును కత్తిరించినప్పుడే పై వరుసన ఉన్న ప్రక్కవేళ్ళు బలాన్ని పుంజుకుని భూమి మీదకు ఉబికి వచ్చి చెట్టుకు నిండుదనాన్ని సమకూరుస్తాయి.

కొమ్మలను నాటిగాని, అంటుగట్టిగాని తయారుచేసిన మొక్కలకు ఎటూ కుచ్చువేళ్ళే వస్తాయి గనుక ఆ మొక్కల్లో తల్లి వేరును కత్తిరించే ప్రసక్తే రాదు. విత్తనాలు నాటి మొలిపించుకున్న మొక్కలు ఒక సంవత్సరం పాటు మామూలు కుండీలో పెరిగాక దాన్ని బోన్సాయ్ కుండీలోకి మార్చుకునేటప్పుడు తల్లివేరును కత్తిరించవలసి వస్తుంది. అలాగే నర్సరీ మొక్కనో, బయటెక్కడో గాలికి పెరుగుతున్న మొక్కనో తెచ్చి బోన్సాయ్‌గా మలచుకునేటప్పుడు కూడా ఈ అవసరం ఉంటుంది.

తల్లివేరును కత్తిరించబోయే ముందే మనం మొక్కను నాటబోయే కుండీ కంటే కొంచెం తక్కువ వెడల్పున్న పలుచని చెక్కపలకనొకదాన్ని సిద్ధం చేసిపెట్టుకోవాలి.

పాతకుండీ నుండి మొక్కను జాగ్రత్తగా బయటకు తీసి వేళ్ళకున్న మట్టిని దులపాలి. పదునైన కట్టర్‌తో గాని, చిన్న రంపంతోగాని తల్లివేరును పూర్తిగా కోసెయ్యాలి. అప్పుడు ప్రక్కవేళ్ళను ప్రక్కలకు లేపి చెక్కపలక మీద అన్నివైపులకు విస్తరించినట్లుగా పరచి పెట్టాలి. ఒక దారంతో ఈ వేళ్ళను చెక్కకు కలిపి కట్టాలి.



ఇప్పుడు మొక్కను చెక్కపలకతో సహా కుండీలో నాటాలి. ఒక సంవత్సరం గడిచేసరికి ఈ ప్రక్కవేళ్ళు బలంగా పెరిగి చెక్కను కూడా దాటుకుని చెక్క అంచుల ప్రక్కగా మట్టిలోకి చొచ్చుకుపోతాయి.

ఇప్పుడు చెక్క పలకను తీసేసినా వేళ్ళు క్రిందికి వాలిపోకుండా అలాస్థిరంగా నిలబడే ఉంటాయి. బోన్సాయ్ తొట్టిలో మొక్కను పెట్టేటప్పుడు అవసరమయిన మేరకు వేళ్ళను కత్తిరించినా మొక్కకెలాంటి ప్రమాదమూ



**పటం 38 : తల్లి వేరును కత్తిరించి ప్రక్కవేళ్ళను పెంచే పద్ధతి**



ఉండదు. ఎందుకుంటే అప్పటికే ఈ వేళ్ళకు అవసరానికి మించి పీచువేళ్ళు పుట్టుకొస్తాయి గనుక! ఇలా మనం తీర్చిదిద్దిన వేళ్ళలో పై వరుసలో ఉన్నవి మొక్క పెరిగిన కొద్దీ బలం పుంజుకుని దృఢంగా తయారై అందమైన ఉపరి తలపు వేళ్ళుగా మారతాయి.

## వైరింగ్ (Wiring) :

బోన్సాయ్‌లో దృఢమైన కాండంతో, వలయాల్లో అమరిన కొమ్మలతో, చిన్నని, సన్నని ఆకులతో చెట్టు పొట్టిగా ఉండటం ఒక ఎత్తుఅయితే, ప్రకృతిలోని వివిధ పరిస్థితులకు అనుగుణంగా ఏదో ఒక నిర్దిష్టమైన శైలి (Style) లో పెరుగుతూ చూపరులను ఆకట్టుకునే ఆకర్షణీయమైన ఆకారాన్ని కలిగి ఉండడం మరో ఎత్తు.

ప్రూనింగ్, ట్రిమ్మింగులు చెట్టు పరిమాణాన్ని కుదించి మహావృక్షానికి వామనరూపాన్నిస్తుంటే - ఆ వృక్షానికి వంపుసొంపులతో, వయోభారంతో, వివిధ రీతుల్లో పెరిగే సహజ వృక్షాల్లా కనిపించే ఆకారం ఈ వైరింగు మూలంగా సాధ్యమవుతుంది.

ఇలా కాండాన్ని, కొమ్మలను మనకనువైన ఆకారంలోకి మలచుకొనేందుకు సాధారణంగా అల్యూమినియం, రాగితీగలను ఉపయోగిస్తుంటారు. రాగితీగను సన్నని సెగమీద బాగా వేడి చేసి చల్లార్చితే దానికోవిధమైన మెతకదనం వస్తుంది. ఇలా చేసిన తీగ ఎటు కావాలంటే అటు తేలిగ్గా వంగుతుంది. మళ్ళీ అంత తేలిగ్గాను సాఫీగా వచ్చేస్తుంది. అందువల్ల దీని సాయంతో మొక్క దెబ్బ తినకుండా మనకనువైనట్లు మలచుకోగలగటమే గాక, ఒకే తీగను రెండు మూడుసార్లు వైరింగ్ చేసుకోడానికి ఉపయోగించుకోవచ్చు కూడా!

రాగి, అల్యూమినియం తీగలు గాకుండా వైరింగుకి ఇనుపతీగలను వాడితే అవి తుప్పు పట్టి త్వరగా విరిగిపోతాయి. విరగక పోయినా వాటి తుప్పు మరకలు కాండం మీద అసహ్యంగా కనిపిస్తుంటాయి.

వైరింగు విధానం గురించి తెలుసుకునే ముందు మనం గుర్తుంచుకోవలసిన ముఖ్యవిషయాలు కొన్ని ఉన్నాయి.

మొక్క వైరింగుకి తట్టుకోగలదో లేదో నిర్ధారించుకోవాలి.

మొక్కలో నీటి పరిమాణం ఎక్కువగా ఉన్నప్పుడు మొక్కను వంచితే తేలిగ్గా విరిగిపోయే గుణం ఉంటుంది. అందువల్ల వైరింగు చెయ్యబోయే రోజు, ఆ క్రితం రోజు కూడా మొక్కకు నీళ్ళు పొయ్యగూడదు.

ఆకులు రాలే స్వభావం ఉన్న చెట్లకు ఆ ఆకులు రాలిన సమయంలో వైరింగు చెయ్యడం మంచిది, సులభం కూడాను.

చుట్టే తీగ అవసరాన్ని మించి మరీ మందంగా ఉంటే చెట్టు దెబ్బతినే ప్రమాదం ఉంది. అలాగని మరీ సన్నగా ఉన్నా మనకు



కావలసిన మేరకు కొమ్మను వంచడానికి దాని శక్తి చాలకపోవచ్చు. అందువలన ఎంత మందం గల తీగ అవసరమో ఉజ్జాయింపుగా ఊహించి వాడడం మంచిది. తీగ చుట్టాక శక్తి చాలనట్లు అనిపిస్తే మరో తీగ తీసుకుని మొదటి తీగను పూర్తిగా ఆనించి మళ్ళీ చుట్టుకోవచ్చు.

తగిన మందం గల తీగ అందుబాటులో లేనప్పుడు రెండు మూడు సన్నని తీగలను తీసుకుని పైన చెప్పినట్లుగా ఒకదాని ప్రక్కన ఒకటి ఆనించి పెట్టి కొమ్మ చుట్టూ చుట్టుకోవాలి. గట్టిగా ఉంటుంది గదా అని రెండు మూడు తీగలను కలిపి మెలేసి ఎట్టి పరిస్థితుల్లోను ఉపయోగించకూడదు. అలాచేస్తే మెలికలు తిరగి మొద్దులా ఉన్న ఆ తీగల చుట్ట కాండాన్ని తేలిగ్గా కోసేసి చెట్టును పాడు చేసేస్తుంది.

చెట్టు బలహీనంగా ఉన్నప్పుడు, రీపాటింగ్ చేసిన వెంటనే వైరింగు చేయకూడదు.

వైరింగు చేసేటప్పుడు కాండం చుట్టూనో, కొమ్మ చుట్టూనో మొదటి మెలిక మరికాస్త బిగించి వేస్తాం కనుక అది చెట్టును కోసేసి బెరడును పాడుచేసే అవకాశం ఉంది. ఆ ప్రమాదం జరగకుండా ఉండేందుకు తీగను మొదట బిగించి చుట్టే చోట ఒక రబ్బరు ముక్కను చుట్టి దాని మీద వైరు చుట్టుకోవాలి.

తీగను మరీ ఎక్కువగా బిగించి చుడితే ఇది మొక్క పెరుగుదలను అరికడుతుంది. లేదా అరలు పడిపోతుంది. అలాగని మరీ లూజుగా చుడితే కొమ్మలు కావలసిన మేరకు వంగవు. అందువల్ల తగినంత బిగుతుగా మాత్రమే తీగను చుట్టాలి. ఎంత బిగుతుగా చుట్టాలి అన్నది అనుభవంతో తెలుసుకోవలసిన విషయం.

తీగను కాండం చుట్టూ గుండ్రంగా గాక సర్పిలాకారం (Spiral) లో చుట్టాలి. చుట్టుకూ చుట్టుకూ మధ్య దూరం మొక్క క్రింది భాగంలో సమంగా ఉన్నా పైకి పోయిన కొద్దీ తగ్గుతుండాలి.

ప్రూనింగూ, వైరింగూ ఒకేసారి చేస్తే మొక్కను కావలసిన విధంగా మలచుకోడం తేలిగ్గా ఉంటుంది.

వైరింగు చేసేటప్పుడు తీసికోవలసిన జాగ్రత్తలు తెలిసాక ఇక ఇప్పుడు వైరింగు చేసే విధానమేమిటో చూద్దాం!

మన మొక్క కాండాన్ని వంపులు తిప్పి షేప్ చేసుకోవాలనుకోండి! తగిన మందం గలిగి, కాండం పొడవు కంటే సుమారుగా మరొక మూడవవంతు (1 + 1/3 ) ఎక్కువ పొడవున్న తీగను తీసుకోవాలి. తీగ ఒక కొనను



**పటం 39 : కాండాన్ని వంపులు తిప్పి షేప్ చేసుకొనే విధానం**
**తీగ ఒక కొసను కాండం వెనుకగా కాస్త వాలుగా మట్టిలో గుచ్చాలి**

కాండం చుట్టూ సర్పిలా కారంలో తిప్పు కుంటూ అలా పై దాకా చుట్టాలి. ఈ చుట్లు మరీ దగ్గరగానూ ఉండగూడదు, దూరదూ రంగానూ ఉండగూడదు. అలాగే మరీ లూజు గాగాని, బిగుతుగా గాని లేకుండా చూచుకోవాలి.

ఇప్పుడు కాండాన్ని ఎటు తిప్పాలనుకున్నామో ముందే నిర్ణయించుకుని ఆ ప్రకారం జాగ్రత్తగా కాండాన్ని వంచుకోవాలి.



## పటం 40 : కొమ్మలకు వైరింగ్ చేసే పద్ధతి



కొమ్మకు కొమ్మకు మధ్య మరీ ఒక చుట్టు గాకుండా
రెండు మూడు చుట్లన్నా ఉంటే తప్ప తీగ బిగుతుగా ఉండదు

అలాగే కొమ్మలకూ వైరింగు చేసుకోవాలి. ఎటొచ్చీ వైరుకొనని భూమిలో గుచ్చడానికి బదులు, షేప్ చేసుకోదలచిన కొమ్మ మొదట్లో కాండానికి చుట్టాలి. కొమ్మకు కొమ్మకు మధ్య మరీ ఒక చుట్టు గాకుండా రెండు మూడు చెట్లన్నా ఉంటే తప్ప తీగ బిగుతుగా ఉండదు.

రెండుగాచీలిన (Forked)కొమ్మలనుషేప్ చేసుకోవలసి వచ్చినప్పుడు తగినమందం,పొడవుఉన్న ఒకేతీగను ఉపయోగించుకోవచ్చు.



పటం : 41

**1.** ఒకే తీగతో రెండుగా చీలిన కొమ్మలను షేప్ చేసుకొనే విధానం

**2.** కాండం మీద కొంత దూరం పోయాక కొమ్మ రెండుగా చీలితే కాండం చుట్టూ ఒకే తీగను త్రిప్పి, తీగ రెండుకొసలను కలిపి పట్టుకొని కొమ్మచుట్టూ త్రిప్పుతూ రెండుచీలికలు మొదలైన చోట మళ్ళీ తీగను విడదీసి చీలికలకు విడివిడిగా చుట్టాలి



కోవచ్చు. తీగను మధ్యకు వంచి కొమ్మ చీలిన దగ్గర కాండం వెనుక తీగనుంచి అక్కడ ఒక చేత్తో తీగ గట్టిగా నొక్కిపట్టుకుని రెండో చేత్తో తీగ ఒక నగాన్ని కొమ్మ చుట్టూ రెండు మూడు చుట్లు తిప్పాలి. అప్పుడు దాన్నలా వదలి తీగ రెండో నగాన్ని రెండో కొమ్మ చుట్టూ చివరి దాకా చుట్టుకుంటూ పోవాలి. ఇప్పుడు కొంతవరకు చుట్టివదలిన తీగను మొదటి కొమ్మ చివరి వరకూ చుట్టేసుకోవచ్చు.

ఇలా చెయ్యడం వల్ల తీగ లూజుగా లేకుండా తగినంత బిగుతుగా చుట్టడానికి వీలవుతుంది.

కాండం మీద కొమ్మ కొంత దూరం పెరిగి అక్కడ రెండు కొమ్మలుగా చీలినప్పుడు కూడా తీగను ముందుగా కాండం చుట్టూ తిప్పి తీగ రెండు నగాలను కలిపి ఒకదాన్ని అనుకుని మరోటి ఉండేలా కొమ్మ చుట్టూ తిప్పాలి. కొమ్మ చీలిన దగ్గర తీగను మళ్ళీ రెండు కొనలుగా వేరుచేసి ఒకో కొనతో ఒకో చిన్న కొమ్మను చుట్టుకుంటూ పోవాలి.



కొమ్మలను క్రిందివైపుకి వంచుకోవలసి వచ్చినప్పుడు తీగ మొదటి చుట్టు కొమ్మపై నుండి క్రింది వైపుకు చుట్టుకోవాలి.

అలాగే కొమ్మలను పైవైపుకి వంచవలసి నప్పుడు తీగను కొమ్మ క్రింది నుంచి పైవైపుకు తిప్పుకుంటూ పోవాలి.

**పటం 42 :** పైనున్న కొమ్మను క్రిందికి వంచి వైరుతో షేప్ చేస్తే కొన్నాళ్ళ తర్వాత ఇలా ఉంటుంది.

క్రింది కొమ్మను పైకి వంచి వైరుతో షేప్ చేస్తే కొమ్మ ఇలా ఉంటుంది



## పటం 43 : బరువులు గట్టి కొమ్మలను వాల్చుకోవచ్చు





కాండానికి కుడివైపుగా ఉన్న కొమ్మను కొద్దిగా వెనుక వైపుకి మళ్ళేలా తిప్పుకోవాలంటే కొమ్మచుట్టూ తీగను గడియారం ముల్లు తిరిగే దిశలో చుట్టాలి. అదే కొమ్మను కాస్త ముందుకు మళ్ళించుకోవాలంటే దానికి వ్యతిరేక దిశలో తీగను చుట్టుకోవాలి.

కాండానికి ఎడమవైపున ఉన్న కొమ్మ వెనకముందులకు మలచుకోవాలంటే కుడివైపు కొమ్మ విషయంలో అనుసరించిన విధానానికి విరుద్ధంగా తీగను చుట్టుకోవలసి ఉంటుంది.

కొమ్మల ఆకారాన్ని మలచుకునేటప్పుడు - ఉదాహరణకు కొమ్మను క్రిందికి వంచవలసి వచ్చినప్పుడు - గట్టి తాడుకు అటూఇటూ బరువులు కట్టి దాన్ని వంచవలసిన కొమ్మ నుండి వేళ్ళాడదీయవచ్చు.



## పటం 44 : కుండీకి తాళ్ళు కట్టి కొమ్మలను ఆ తాళ్ళకు కొన్నాళ్ళ పాటు లాగి కడితే కొమ్మలు వంగుతాయి



కుండీకి కొన్ని తాళ్ళు గట్టి కొమ్మలను ఆ తాళ్ళకు కొన్నాళ్ళ పాటు లాగి కట్టినా కూడా కొమ్మలు మనకు కావలసినట్లు వంగుతాయి.

ఒకోసారి దగ్గరగా ఉన్న రెండు కొమ్మలను కాస్త దూరంగా మలచవలసి వస్తుంటుంది. అలాటప్పుడు ఒక చెక్కముక్కను తీసికొని కొమ్మల సైజుకు తగ్గట్టుగా చెక్క రెండు చివరల్లోనూ గాడులు కొట్టించాలి. ఈ గాడుల్లో కొమ్మలు ఇరుక్కునేలా రెండుకొమ్మల మధ్య కొన్నాళ్ళపాటు చెక్కముక్కను ఉంచితే ఆ రెండు కొమ్మల మధ్య దూరం పెరుగుతుంది.



పటం 45

ఆకారపు ఇనుప ఒగ్గీతో దూరంగా ఉన్న కొమ్మలను దగ్గరకు జరుపవచ్చు



చెక్కముక్క సాయంతో దగ్గరగా ఉన్న కొమ్మలను దూరంగా జరుపవచ్చు





పటం 46 : కొమ్మ చుట్టూ తీగచుట్టేటప్పుడు తీగక్రింద నలుగుతాయనుకున్న ఆకులను తుంచెయ్యాలి. లేకపోతే అవికుళ్లి పురుగులు చేరతాయి











పటం 47 : ప్రత్యేక పరికరాలను ఉపయోగించి
కాండాన్ని కొమ్మలను మనకిష్టమైనట్లు వంచుకోవచ్చు



అలాగే దూరంగా ఉన్న రెండు కొమ్మ లను దగ్గరగా చెయ్యాలంటే ఒక లావుపాటి తీగను ఆకారంలోకి వంచి దానిని కొమ్మలకు బిగించి పెట్టినట్లైతే రెండుకొమ్మలూ దగ్గరౌ తాయి.

కొమ్మ చుట్టూ తీగ చుట్టేటప్పుడు తీగక్రింద ఆకులు పడి నలిగితే అవి కుళ్ళి అక్కడ నన్నని పురుగులు చేరతాయి. అందు కని తీగక్రింద పడతాయనుకున్న ఆకులను తుంచేయడం మంచిది. అంతేగాకుండా బోన్సాయ్ కొమ్మలు ముదిరిన కొద్దీ కొమ్మ అడుగు భాగంలో ఆకులుండగూడదు కనుక తీగ చుట్టి కొమ్మ ఆకారాన్ని మలచుకునేట ప్పుడు అడుగున ఉన్న ఆకులను తుంచేయడం అవసరం|.

కాండాన్ని గాని, కొమ్మలను గాని షేప్ చెయ్యడానికి 47 వ పటంలో చూపిన ప్రత్యేక పరికరాలను కూడా ఉపయోగిస్తుంటారు.

వైరింగు చేసాక ఎంతకాలంలో మొక్క మనం కోరుకున్న ఆకారంలో సెట్ అవుతుంది అనేది ఆయామొక్కల తీరుతెన్నుల మీద ఆధా రపడి ఉంటుంది. ఇందుకు కొన్ని వారాలనుండి సంవత్సర కాలం వరకు పట్టవచ్చు. మనం కొంతకాలం పోయాక తీగలను తొలగించి చూచినప్పుడు మనం అనుకున్న ఎఫెక్టు రాలేద నిపించితే మళ్ళీ తీగ చుట్టుకోవాలి.

ఇలా తాడుతోను, తీగతోను, ఇంకా కొన్ని ప్రత్యేక పద్ధతులు, పరికరాలనుపయో గించి మన బోన్సాయ్‌కి మహావృక్షపు రూపు వచ్చేలా చేసుకోవచ్చు.

## స్పెషల్ టెక్నిక్స్

## *(Special Techniques)*

విత్తనం నాటడం, కొమ్మను కత్తిరించి పాతడం, అంటు గట్టడం, గ్రాఫ్ట్ చెయ్యడం లాటి విధానాల ద్వారా పెంచుకున్న మొక్కను బోన్సాయ్‌గా రూపు దిద్దుకోడం చాలా సులు వైన పని! ఆమొక్కలను లేతగా ఉన్నప్పటి నుండే సరైన తరుణంలో ప్రూన్ చేసి షేప్ చేసుకోవడానికి మనకు అవకాశం ఉంటుంది. మెత్తటి మైనపు ముద్దను తీసుకుని మనకు కావలసిన ఆకారాన్ని మలచుకోడం ఎంతసుల భమో లేతగా ఉన్నమొక్కను బోన్సాయ్ వృక్షంగా రూపుదిద్దడం అంత తేలిక! ఎటొచ్చీ మహావృక్షంలా కనిపించేటంత దృఢంగా ఈచిన్న మొలక పెరగడానికి కొన్ని సంవత్స రాలు ఓపిక పట్టవలసి వస్తుంది. అలా ఎన్నో ఏళ్ళు ఎదురు చూడకుండానే కొన్ని ప్రత్యేక మైన టెక్నిక్స్‌ని ఉపయోగించి అతి తక్కువ కాలంలోనే మన బోన్సాయ్‌లో మహావృక్షపు ఛాయలను చూపవచ్చు.



రాళ్ళలోను, రప్పల్లోను, చెఱువు గట్ల మీద, బీడుల్లోను ఆలనాపాలనా లేకుండా పెరిగే మొక్కలు సహజంగా ఉండవలసిన ఎదుగుదల లేక ఇలకరుచుకుని ఉండడం మనం గమనిస్తుంటాం! ఇలాటి మొక్కలు బోన్సాయ్ పెంపకందార్ల పాలిటి కల్పవృక్షాల్లాటివి! అయితే మొక్క ఎదుగుదల లేకుండా పొట్టిగా ఉండడం మాత్రమే బోన్సాయ్‌కి సరిపోదు. దానికీ కొంత రీతీ రివాజూ ఉండాలనే రూలు ఉందిగదా! కాని ప్రకృతిలో పెరిగే ప్రతి మొక్కా ఖచ్చితమైన నిబంధనలకు లోబడి పెరగదనే విషయం మనకు తెలుసు! అలాటి మొక్క మనకు దొరికినపుడు ఆ మొక్కను కాండం, కొమ్మల వలయాలు, ఉపరితలపు వేళ్ళ విషయంలో బోన్సాయ్‌కున్న నిబంధనల చట్రంలో బిగించడానికి ప్రయత్నించకుండా దానిని మలచడానికి కొంత స్వేచ్ఛను తీసుకోవచ్చు. అలాగని బొత్తిగా ఏశైలీకి చెందని రూపాన్నిగాక ఉన్నంతలో ప్రామాణికంగా చెప్పబడే ఏదోఒక శైలిలోకి ఇమడ్చక తప్పదు. అలా చెయ్యడానికి కొన్ని ప్రత్యేకమైన టెక్నిక్స్‌ని మనం అనుసరించాల్సి ఉంటుంది.

వీటన్నిటినీ మించి బోన్సాయ్ కళాకారుడికి ఆచెట్టును కళాత్మకమైన దృక్కోణంతో చూడగలిగే మనసు ఉండాలి. అప్పుడే శిల్పి నిరాకారమైన ఒక పెద్ద శిలను తన నైపుణ్యంతో ఒక అద్భుత శిల్పంగా రూపుదిద్దినట్లు, తీరూ తెన్నూలేని చెట్టును బోన్సాయ్ రూప శిల్పి తన కళా దృష్టికి స్పెషల్ టెక్నిక్స్‌ని జోడించి ఒక చక్కని సజీవ శిల్పంగా మలచగలుగుతాడు.

మొక్కను అలా మలచడానికి తోడ్పడే ఆ ప్రత్యేక విధానాలేమిటో ఇప్పుడు చూద్దాం!

## *కాండం :*

ఒక ప్రత్యేకమైన శిక్షణా విధానం ద్వారా లేత మొక్కను చక్కటి టేపరింగ్ (Tapering) తో పొట్టిగాను, ధృఢంగాను ఉండే బోన్సాయ్‌గా రూపొందించవచ్చు.

అలాగే మరో ప్రత్యేకమైన టెక్నిక్‌ని ఉపయోగించి ఎంతో ఎత్తు ఉన్న ముదురు చెట్టును ఎత్తు తగ్గించేసి పరిపూర్ణమైన బోన్సాయ్‌గా మలచుకోనూవచ్చు.

''ఏపుగా పెరగనివ్వడం - క్రిందికి కత్తిరించేయడం ( Growing Up and Growing Down)'' అనేదే ఈ శిక్షణా విధానం!

లేత మొక్కను పెద్ద కుండీలోనాటి కాండం, కొమ్మలు కూడా బలంగానూ, ధృఢంగానూ పెరిగేందుకు దోహదం చెయ్యడం ఈ విధానం లోని మొదటి దశ! కొన్నాళ్ళు అలా పెరిగాక కాండాన్ని కొంత వరకు కత్తిరించేసి కత్తిరించిన దగ్గరలో ఉన్న ఒక కొమ్మను నిలబెట్టి దాన్నే కాండాగ్రంగా (apex) పెంచడం



రెండవ దశ. ఈ కొమ్మ నిలదొక్కుకుని బలం పుంజుకున్నాక దీన్నికూడా కొంతవరకు కత్తి రించేసి మరో కొమ్మను కాండాగ్రంగా మల చడం తరువాతి దశ. ఇలా కాండాన్ని కొంత వరకు పెరగనివ్వడం, కత్తిరించడం; మళ్ళీ పెరగనివ్వడం, కత్తిరించడం చేస్తుండడం వల్ల మన మొక్క దృఢంగాను, పొట్టిగాను పెరగడ మేగాక కాండానికి బోన్సాయ్ ముఖ్యలక్షణమైన చక్కటి టాపరింగ్ కూడా వస్తుంది.

పైవిధానంలోని దశలను వెనుక ముందు లుగా అనుసరించడం ద్వారా బాగా ఎత్తుగా ఉన్న చెట్టును పొట్టిగా తయారు చేసుకోవచ్చు. ఉదాహరణకు దాదాపు రెండు మీటర్ల ఎత్తున్న చెట్టును పొట్టి చెయ్యాలనుకోండి. దానిని ఒకటి రెండడుగల ఎత్తువరకు మాత్రం ఉంచి ఆ పైభాగాన్ని కొట్టెయ్యాలి. కొట్టేసిన దగ్గరున్న కొమ్మను నిలబెట్టి దాన్ని క్రొత్త కాండాగ్రంగా పెంచాలి. ఇది కొంత కాలం పెరిగాక దాని ఎత్తును కొంతవరకు తగ్గించేసి మరో కొమ్మను కొత్త కాండాగ్రంగా పెంచాలి. అంటే ఈ విధా నంలో ముందు ఎత్తు తగ్గించి (Growing down) ఆ తరువాత దాన్ని పెరగనిచ్చి (Growing up),మళ్ళీ ఎత్తు తగ్గిస్తూ (Growing Down) ఎత్తైన చెట్టును పొట్టిగా మలచగలుగు తున్నామన్న మాట!

## సభామికి

మొక్కపైకి పెరిగిన కొద్దీ కొమ్మలు భూమికి దూరంగా వెళ్ళి పోతుంటాయి. అంటే బాగా ఎదిగిన మొక్కకు మొదలుకు దగ్గరగా కొమ్మలుండవన్నమాట! ఎదిగిన మొక్కకు తప్పని సరిగా కాండం దృఢంగా ఉండి ఉంటుంది కదా! బలిష్టమైన కాండం ఉన్న మొక్క బోన్సాయ్ కళాకారుడి దృష్టి నుండి తప్పించుకోవడం కష్టం! అయితే బోన్సాయ్‌లో సమస్యంతా కాండం టేపర్‌గా ఉండడం, మూడు కొమ్మల వలయాలూను! ఈ సమ స్యను పరిష్కరించుకుంటూ బాగా పెరిగిన మొక్కను, ఏదో ఒక కారణంగా శిఖరాన్ని కోల్పోయిన మొక్కను (blunt end) ఎలా ఉపయోగించుకోవచ్చో చూద్దాం!

మామూలు బోన్సాయ్ మొక్కల ఎత్తు సాధారణంగా ఒకటి, రెండు అడుగులకు మించి ఉండదు. దానిని దృష్టిలో పెట్టుకుని ఇప్పుడు మనకు దొరికిన మొక్కను కూడా దానికి కాస్త అటూ ఇటూగా కాండం కోసేయాలి. కాండం కోసేటప్పుడు ఎలాటి జాగ్రత్తలు తీసుకోవాలో మరచిపోకూడదు. చివురుకు ఆయువుపట్టు కణుపు. కణుపుకు ఏమాత్రం దెబ్బతగిలినా పుట్టబోయే చివురు ఆగిపోవచ్చు. అందుకని ముందు జాగ్రత్తగా కణుపుకు కాస్త పైగా కాండా న్నికోయాలి. ఈ కణుపు దగ్గర పుట్టిన చివురే మనకు కాబోయే కాండాగ్రం.



## పటం 49 : సబామికి

### లావుగా ఎత్తుగా ఉన్న చెట్టును బాగా క్రిందికి నరికి కాండాన్ని తొలిచి సబామికి గా మలచుకోవచ్చు

ఎటొచ్చీ మొద్దులా క్రిందినుండి పైదాకా మూసపోసినట్లున్న కాండం - పైన కాండం సైజుకు ఏ మాత్రం పొంతన లేని లేత రెమ్మ లతో మొక్క చూడ్డానికి చాలా అసహజంగా ఉంటుంది. అలా అని మనం నిరుత్సాహపడ వలసిన పని లేదు. ఆ మొంటెను తీర్చిదిద్దడం లోనే మన నేర్పంతాను!

ఒక సంవత్సరం పాటు ఆచిపురు నలా



పెరగనిచ్చాక ఇప్పుడు మొద్దులా ఉన్న కాండాన్ని షేప్ చేసుకోవాలి. పెరుగుతున్న కొమ్మ పీఠంనుండి మొదలు పెట్టి క్రమేణా టాపర్‌గాను లోతుగానూ మొద్దునుతొలుచు కుంటూ రావాలి. ఇలా చేయడం వలన బలిష్ట మైన కాండపీఠం క్రమంగా పైకి పోయినకొద్దీ సన్నబడుతూ క్రొత్తగా మొలిచిన కొమ్మలోకి కొనదేలి ముగిసిన భావన మనకు కలుగు తుంది. కాండాన్ని తొలిచినప్పుడు ఆ భాగం పాడైపోకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు మరచి పోకూడదు - (సిట్రిక్ ఆసిడ్ గాని, లైమ్‌సల్ఫర్‌గాని రాయడం)

రెండు, మూడంగుళాల మందం ఉన్న కాండమైనా ఈ టెక్నిక్‌ద్వారా మనం చక్కని 'సబామికి'ని సృష్టించవచ్చు.

## డ్రిఫ్ట్ ఉడ్ టెక్నిక్:

బలిష్టమైన మొద్దులా ఉన్న ఇలాటికాం డాలనుడ్రిఫ్ట్‌ఉడ్ టెక్నిక్ ఉపయోగించి కూడా అందమైన బోన్సాయ్‌గా తీర్చిదిద్దవచ్చు.

ఈ పద్ధతి నవలంబించదలచుకున్నప్పుడు కాండాన్ని పూర్తిగా తొలిచి తీసిపారేయ కూడదు. క్రిందనుండిపైకి టాపర్‌గా ఉండేలా జాగ్రత్త పడుతూ అందుకవసరమైన మొద్దు లోని భాగాన్ని సన్నని చీలికలుగా చీల్చాలి. ఈచీలికలు చూపరులకు ఎదురుగా కంట్లో గుచ్చుకుంటున్నట్లుగాకుండా సాధ్యమయినంత వరకు కాండం ప్రక్కలకు వచ్చేలా రాగితీగసాయంతో అందమైన వంపులు తిప్పుకోవాలి. సజీవంగా ఉన్న మొద్దునుండి చీల్చినవే గనుక ఈ చీలికలను మనం ఎటుబడితే అటు తేలిక గానే తిప్పవచ్చు. ఒక వేళ అలా తిప్పడంలో ఈ సన్నని చీలికలు విరిగి పోతాయనుకుంటే వేడినీళ్ళలో ముంచిన గుడ్డచుట్టి ఆవిరి పెట్టడం ద్వారా కొమ్మలకు మరింత మెతక దనం వస్తుంది. అప్పుడు వాటిని మెలిపెట్టడం మరింత సులువవుతుంది. (ఈప్రక్రియ 'జిన్, షారీ, సబామికి' అన్న భాగంలో వివరంగా చర్చించబడింది.) కాండాన్ని చీల్చడం, చీలిక లను మెలికలు తిప్పడంలో కూడా ఒక అందం కనిపించాలి. అంతేకాని కాండాన్ని టాపర్ చేయడమొక్కటేమన ధ్యేయం కాకూడదు. బోన్సాయ్ పెంపకంలో మౌలిక సూత్రమయిన 'కొమ్మల వలయం' గుర్తు పెట్టుకుంటే మన పని కొంత సులువవుతుంది.

## షారీ:

కాండం కొన ఇంతకుముందు మనం అనుకున్నట్లుగా 1,2 అంగుళాలు కాకుండా 2,3 సెంటీ మీటర్లు మందం ఉందనుకోండి. అప్పుడు దాన్ని నేర్పుగా షారీగా మలచుకో వచ్చు.

కణుపుకు కాస్త పైగా కత్తిరించడం-ఆ తరువాత కణుపు దగ్గర రెమ్మరావడం-రెమ్మను



## పటం 50 : డ్రిఫ్ట్ వుడ్ టెక్నిక్

చెట్టును క్రిందికి నరికి పొట్టిచేశాక కాండాన్ని
చీలికలుగా చేసి డ్రిఫ్ట్ వుడ్ ఎఫెక్ట్ తేవచ్చు



అలా వదిలేస్తే కొమ్మగాను లేదా కాండం గానూ మారడం - ఇదంతా మామూలుగా జరిగేపనే! అయితే ఇక్కడ మన ఉద్దేశం కొత్తగా కాండాగ్రాన్ని కల్పించడం కాదుగదా! అందువలన కాండంలో చక్కని taper కనిపించే లావుపాటి కాండభాగాన్ని పైనుండి క్రిందికి చీల్చుకుంటూ రావాలి. అంటే జిన్‌లోలాకాకుండా కాండంలోని దారువులోని కొంతభాగం కూడా చీలికతోపాటు వచ్చేస్తుందన్నమాట. ఆ చీలికను ఎలా తీర్చిదిద్దుకోవాలనేది మన ఇష్టా ఇష్టాల మీద ఆధారపడి ఉంటుంది. మొక్కలో బాలెన్స్ మూడుకొమ్మల వలయం - ఇలాటి



కొన్ని మూలసూత్రా లను దృష్టిలో పెట్టుకుని చేస్తేనే ఏ టెక్నిక్ అయినా రాణిస్తుంది.

## ఊడలు

ఊడలుదిగే మఱ్ఱి జాతి వృక్షాలను



పటం 51 : ఊడలు

మఱ్ఱి చెట్టు కొమ్మ అడుగున చెక్క్, మాస్ చుట్టి తడుపుతుంటే సన్నని వేళ్ళు పుడతాయి. వాటిలో బలంగా ఉన్న ఒకవేరును మట్టినింపిన ప్లాస్టిక్ గొట్టంలోకి దించి తడుపుతుంటే అది త్వరగా పెరుగుతుంది

ఫైకస్ బెంజిమన్ లాటి చెట్ల కాండాలలో పై భాగం నుండి వేళ్ళు పుడతాయి. ఆ వేళ్ళను బాగా మునిగేదాకా కాండంతో సహా మొక్కను పెద్ద కుండీలో దించితే ఆ వేళ్ళు త్వరగా బలం పుంజుకుంటాయి.



(Ficus Varieties) బోన్సాయ్‌లుగా మలచడం బోన్సాయ్ పెంపకం దారుకి ఒక ఛాలెంజ్! అనతి కాలంలోనే ఊడలను సృష్టించి, ఎంతో వయసున్న మహావృక్షాన్ని తలపింపజెయ్యడానికి ఒక ప్రత్యేకమైన దగ్గరదారి ఉంది. మొక్క తీరును బట్టి కొన్ని చెట్లకు (Ficus Benjamin) కాండం నుండి ఊడలు పుట్టుకొస్తాయి. కొన్ని చెట్లకు ఉదా: మర్రి (Ficus Bengalensis) కొమ్మలనుండి ఊడలు దిగుతాయి. మొదటి రకం మొక్కలకు కాండం మీద చిన్న చిన్న గాట్లుపెట్టి, రూట్ ఫామింగ్ పౌడర్ అద్ది గాట్లు పెట్టినంత వరకు కాండాన్ని పెద్ద కుండీలో దింపెయ్యాలి. కొన్ని నెలలకు ఆ గాట్లు పెట్టిన చోటనుండి వేళ్ళు పుట్టుకొస్తాయి. ఆ వేళ్ళుసాగి, బలపడే వరకు అలా మట్టి లోపలే పెరగనివ్వాలి.

ఇక రెండో రకం మొక్కల్లో ముదురుగా ఉన్న క్రింది వరుస కొమ్మల అడుగున అనువుగాను, సహజంగాను ఉంటాయనిపించిన ఒకటి రెండు చోట్ల పదునైన కత్తితో సన్నని గాట్లుపెట్టాలి. అక్కడ రూట్ ఫామింగ్ పౌడర్ అద్ది, మాస్ (Moss) ను దట్టంగా చుట్టి సన్నదారంతో కట్టెయ్యాలి. రోజూ నాలుగైదుసార్లు మాస్‌ను తడుపుతుంటే ఆ తేమకు గాటు పెట్టిన దగ్గర సన్నని వేళ్ళు పుట్టుకొస్తాయి. ఈ వేళ్ళు గుంపుగా వచ్చే అవకాశం ఉంది. అలాగుంపుగా వచ్చిన వేళ్ళన్నిటినీ పెరగనిస్తే సహజమైన ఊడల్లా ఉండవుగనుక వాటిలో అనువుగా ఉన్న రెండుమూడు వేళ్ళను ఉంచి మిగిలిన వాటిని కత్తిరించెయ్యాలి. వేళ్ళు మరీ లేతగా ఉన్నప్పుడే ఈ పని చేస్తే ఉన్న ఆ రెండుమూడు వేళ్ళు ఎండిపోయే ప్రమాదం ఉంది. అందు వేళ్ళన్నిటినీ కొద్దిగా పెరిగే వరకు మాస్‌ను అలాగే చుట్టి ఉంచి తడుపుతుండడం మంచిది. వేళ్ళు కొన్త బలం పుంజుకున్నాక మనకవసరమైన వేళ్ళను ఉంచి మిగిలిన వాటిని కత్తిరించెయ్యవచ్చు. వీటినే భూమి వైపుకు సాగి పెరిగే ఊడలుగా మలచబోతున్నామన్నమాట! ఇలా మలచడానికి మనం మొక్కలకు నీళ్ళు పెట్టుకునే రబ్బరు ట్యూబునుండి ఒక చిన్న ముక్క కత్తిరించి తీసుకోవాలి. ఈముక్కను నిలువుగా ఒక ప్రక్క చీల్చి దాన్ని మట్టితో నింపాలి. అలా చీల్చి పట్టుకుని ట్యూబు ముక్కలోని మట్టిలోకి లేత ఊడకొన దిగేలా జాగ్రత్తగా అమర్చాలి. ఇప్పుడు ఈ ట్యూబు రెండవ కొనను కుండీలోని మట్టిలోకి మెల్లగా గుచ్చాలి. రోజూ 4,5 సార్లు ఈ ట్యూబులోని మట్టిని తడుపుతుంటే ఆతేమను, మట్టిలోని సారాన్ని పీల్చుకుంటూ ఊడ పెరిగి కుండీలోని మట్టిలోకి దిగుతుంది. ఇక అప్పుడు జాగ్రత్తగా రబ్బరు ట్యూబును తొలగించేయవచ్చు.

## గర్డిలింగ్:

అసలు సిసలైన బోన్సాయ్ కాండపీఠం విశాలంగాను, బలిష్టంగాను ఉంటుంది. సహ



# పటం 52 : గర్డిలింగ్

## కాండపీఠంలో తీగచుట్టి కొన్నాళ్ళు ఉంచితే అక్కడ ఉబ్బి బలిష్ఠంగా కనిపిస్తుంది



జంగా కాండ పీఠం అలా తయారవ్వాలంటే ఎన్నో ఏళ్ళు పడుతుంది. 'గర్డిలింగ్' అనే ఒక ప్రత్యేకమైన టెక్నిక్ ద్వారా స్వల్పకాలంలోనే మన బోన్సాయ్‌లో అలాటి ఎఫెక్టునుతేవచ్చు. ఈ గర్డిలింగ్ విధానాన్ని ఇంతకు ముందు కూడా మనం ఉపయోగించాం.

బొమ్మలో చూపినట్లుగా కాండ పీఠం చుట్టూ ఒక రాగితీగను బిగించి చుట్టాలి. బిగించిన ఈ రాగి తీగ వేళ్ళలోకి వెళ్ళే ఆహార సరఫరాకు కొంతవరకు అంతరాయం కలిగిస్తుంది. అందువలన ఆ ఆహారం కాండ పీఠంలో నిలిచిపోయి ఆ భాగం లావుగా ఉబ్బుతుంది. అలా బలిష్టంగా ఉన్న మన బోన్సాయ్ కాండ పీఠం చూడగానే మహావృక్షాన్ని తలపింపచేస్తుంది.

### *జడలల్లడం :*

మరీ దగ్గరగా పెరిగిన మొక్కల కాండాలు ఒక దానితో ఒకటి కలసి పోయి ఒకే కాండంలా బలిష్టంగా కనిపించడం ప్రకృతిలో మనం చూస్తుంటాం! అక్కడ సహజంగాను, కథాజిత్తుగాను జరిగే ఈ ప్రక్రియను కూడా మనం కృత్రిమంగా గ్రాఫ్టింగ్ విధానం ద్వారా సాధించవచ్చు.

స్వాభావికంగా కాండం లావుగా ఉండని మొక్కలను రెండు మూడింటిని తీసుకుని



## పటం 53 : సన్నగా ఉన్న మూడు మొక్కలను కలిపి లూజుగా జడ అల్లితే పెరిగాక అవి కలిసిపోయి బలమైన ఒకే కాండంలా కనిపిస్తుంది



కాండభాగాలను కొద్దికొద్ది చెక్కి ఆ చెక్కిన భాగాలు ఒక దాని కొకటి ఆనుకునేలా కలిపికట్టాలి. అది క్రమంగా కలిసి పోయి పెరగడంతో కొన్నేళ్ళకు మనం పాతినప్పుడు ఉన్న ఖాళీలు కూడా మూసుకుపోయి, కాండం ఒక దానికొకటి ఒరుసుకున్నట్లై కాలక్రమేణా దృఢమైన ఒకే కాండంలా కనిపిస్తాయి. బోన్సాయ్ పెంపకంలో ఇది అద్భుతమైన విషయమే గదా!.

ఈ పద్ధతనే కొంతమంది పటంలో చూపినట్లుగా రెండు మూడు కాండాలను కలిపి మెలిదిప్పిగాని, జడలా అల్లిగాని పెంచుతారు. ఇలా చేయడం వల్ల మొక్కలు ముదిరిన కొద్దీ జడలు పూర్తిగా కలిసిపోయి ఒకే దృఢమైన కాండంతో మొక్క వయసు రెండు మూడింతలు ఎక్కువగా ఉన్నట్లు కనిపిస్తుంది.



పటం 54 : పొడవు మొక్క మొదట్లో పొట్టిమొక్కను గ్రాఫ్ట్ చేయవచ్చు
దీనివలన పొట్టి బోన్సాయ్ లభిస్తుంది.



## కొమ్మలు :

గ్రాఫ్టింగ్ విధానం ద్వారా పొట్టిమొక్కలను ఎలా తయారుచేసుకోవచ్చో రెండవ అధ్యాయంలో చర్చించుకున్నాం! ఈ గ్రాఫ్టింగ్ పద్ధతి పొట్టి చెట్లును పొందడానికే గాక అవసరమైన చోట క్రొత్తకొమ్మలను, చిగుళ్ళను గ్రాఫ్ట్ చేసుకోవడం ద్వారా బోన్సాయ్‌కి పరిపూర్ణమైన ఆకారాన్నివ్వడానికి కూడా తోడ్పడుతుంది.

మన బోన్సాయ్‌లో ఉండవలసిన చోట ఉండకుండా, దానికి కాస్త క్రిందగానో, పైగానో ఒక కొమ్మ ఉందనుకోండి. అప్పుడు కొమ్మను పటంలో చూపినట్లుగా వంచి కొమ్మ ఉండవలసిన చోట కాండాన్ని కాస్తచెక్కాలి. వంచిన కొమ్మను కూడా కాండాన్ని తాకుతున్న దగ్గర చాకుతో బెరడు లేపాలి. ఆ గాయాలకు గ్రాఫ్టింగ్ మైనం గనుక దొరికితే దట్టంగా పూసి రెండింటినీ కలిపి గట్టిగా కట్టాలి. మైనం లేకపోయినా కాస్త ఆలస్యంగానైనా కొమ్మలు కలసిపోతాయి. కొమ్మ మొదలు కాండంలో కలిసే ఉంటుంది గనుక దానికి ఆహారం, నీరు సరఫరా అవుతూనే ఉంటాయి. కొన్నాళ్ళకు కొమ్మ మొదటి నుండి అదే ప్రదేశంలో పెరుగుతున్న దానిలా కాండంలో కలసిపోతుంది. అప్పుడు అనవసరమైన కొమ్మ పాత మొదలును జాగ్రత్తగా పుటాకారపు కత్తెర (Concave Cutter) తో తొలగించెయ్యాలి.



పటం 55 : మొక్కలో అనవసరంగా ఉన్నకొమ్మను వంచి అవసరమైన చోట గ్రాఫ్ట్ చేసుకోవచ్చు

పటం 56 : మరో లేతమొక్కను గ్రాఫ్ట్‌చేసి బోన్సాయ్‌లో క్రొత్తకొమ్మను సృష్టించవచ్చు



## పటం 57 : క్రొత్తఆకులు, కొమ్మలకోసం లేత చిగుళ్ళను కూడా గ్రాఫ్ట్ చేసుకోవచ్చు



ఒకవేళపైన చెప్పినట్లుగా అదే చెట్టులో గ్రాఫ్ట్ చెయ్యదగ్గ కొమ్మ లేనప్పుడు ఆ రకానికే చెందిన మరోమొక్కను 56వ పటంలో చూపినట్లుగా గ్రాఫ్ట్ చేసుకోవచ్చు.

కొమ్మలను గ్రాఫ్ట్ చేసినట్లే లేత చిగుళ్ళను కూడా అవసరమైన చోట 57వ పటంలో చూపినట్లుగా గ్రాఫ్ట్ చేసుకోవచ్చు.

### వేళ్ళు :

మన బోన్సాయ్ మొక్కలో ఉపరి తలపు వేళ్ళు అన్నివైపులా వ్యాపించి లేవనుకోండి. అప్పుడు మరో చెట్టును గ్రాఫ్ట్‌చేసి క్రొత్త కొమ్మలను ఎలా సృష్టించామో అలాగే మరో మొక్క వేళ్ళను కావలసిన తీరులో గ్రాఫ్ట్ చేసుకోవచ్చు. 58వ పటంలో చూపినట్లుగా వేళ్ళను గ్రాఫ్ట్



## పటం 58 : మన బోన్సాయ్‌కి అవసరమైతే మరోమొక్క-వేళ్ళను తెచ్చి గ్రాఫ్ట్ చేయవచ్చు



చెయ్యవలసిన చోటలోతుగా కత్తితో గాటు పెట్టి ఆగాటులో మరో చెట్టునుండి కత్తిరించిన వేళ్ళను దూర్చి గట్టిగా దారంతో కట్టెయ్యాలి. కొన్నాళ్ళకు ఈ వేళ్ళు మొక్కలో భాగంగా కలసిపోయి పెరుగుతాయి.

జానెడు ఎత్తు మించని మేమ్ బోన్సాయ్‌ల కాండం దానంతటదే దృఢంగా పెరగాలంటే ఎన్నో ఏళ్ళు పడుతుంది. వ్యాయామం మనిషిని కండలు తిరిగిన వస్తాదులా తయారుచేస్తుంది. అలాగే మేమ్ బోన్సాయ్ కాండాన్ని వ్యాయామంతో బలిష్టంగా తయారు చెయ్య వచ్చు. ఒక చేత్తో కాండపు మొదలును కదల కుండా పట్టుకుని రెండోచేత్తో కాండాన్ని కుడి ఎడమలకు, ముందు వెనుకలకు మెల్లగా వంచి



లేపుతున్నట్లైతే కొన్నాళ్ళకు కాండం దృఢంగా తయారవుతుంది. అయితే వ్యాయామం మొరటుగా చేయించినా, మోతాదు మించినా మొదటికే మోసం వస్తుం దని గుర్తుంచుకోవాలి.

మేమ్ బోన్సాయ్‌ని విసనకర్ర విధానం (Broom Style) లో పెంచుతున్నప్పుడు కొమ్మలను క్రిందినుండి పైకి మృదువుగా రోజుకు కొంతసేపు నిమిరితే సులభంగా షేప్ వస్తుంది.

స్పెషల్ టెక్నిక్స్‌నుపయోగించి బోన్సాయ్‌కి పరిపూర్ణత్వాన్ని తేవడమనేది అంత సులభమైన పనిగాదు. దీని కెంతో నైపుణ్యంకావాలి. అలా అని మనం నిరుత్సాహపడి అసంతృప్తికరంగా తీరూతెన్నూలేని బోన్సాయ్‌ని పెంచుకోవలసిన పనిలేదు. ఒకటికి రెండుసార్లు ప్రయత్నిస్తే ఫలితం తప్పకుండా ఉంటుంది.





# 7 - శైలీ విన్యాసాలు

## (Styles)

సృష్టిలో కొన్నివేల రకాల మొక్కలున్నాయి. ఏ ఇద్దరు మనుషులు ఒక రకంగా ఉండనట్లు ప్రకృతిలోని ఏరెండు మొక్కలు అక్షరాలా ఒకదాన్ని ఒకటి పోలి ఉండవు. మొక్క శరీర నిర్మాణం, దాని జీవన పరిస్థితులు మొక్క ఆకారాన్ని మలచడంలో ప్రధానపాత్ర వహిస్తుంటాయి.

పుట్టినప్పటినుండి ఏవిధమైన అడ్డంకి లేకుండా పెరిగిన మొక్క నిటారుగాను, బలంగాను ఉంటుంది. సూర్యరశ్మి కోసం దిక్కులు చూడవలసి వచ్చినప్పుడు వంపులు తిరిగి పెరుగుతుంది. సముద్ర తీరాల్లోని ప్రతి కూల పరిస్థితుల నెదుర్కుంటూ పెరిగిన మొక్క ఒకవైపుకు వాలిపోయి పెరుగుతుంటుంది. కొండ చరియల్లో బ్రతికే మొక్కలు జలపాతాల్లా జాలువారుతుంటాయి.

ప్రకృతిలో ఇలా విభిన్న రూపాల్లో దర్శనమిచ్చే మొక్కలకు ప్రతిబింబాలుగా మనం వామన వృక్షాలను రూపొందిస్తున్నాం గనుక సృష్టిలో కనిపించే మొక్కల ఆకారాలే మన బోన్సాయ్‌ల్లో కూడా కనిపిస్తుంటాయి.

బోన్సాయ్ పెంపకం ఒక కళగా రూపాంతరం చెందడం ప్రారంభం అయ్యాక ఆనాటి బోన్సాయ్ కళాకారులు ప్రకృతిలో అసంఖ్యాకంగా కనిపించే మొక్కల స్వరూప స్వభావాలను నిశితంగా పరిశీలించి వాటిలోని సామ్యలక్షణాలు ఆధారంగా కొన్ని సూత్రాలను రూపొందించారు. ఈ సూత్రాలను మొక్కల ఆకారాలకు అనుసంధించి కొన్ని ప్రత్యేకమైన శైలులను ప్రతిపాదించారు.

''స్వేచ్ఛగా పెరగవలసిన మొక్కలను



సూత్రాల పేరుతో నిబంధించడం కూడనిపని! అందుకే బోన్సాయ్‌లను కూడా నియమ నిబం ధనలతో పెంచాలనడం భావ్యం కాదు''. అంటుంటారు కొందరు. కాని ఈ అభిప్రాయం సరైనది కాదు. స్వేచ్ఛకు కూడా ఒక విధమైన నిబద్ధత ఉండడం వాంఛనీయం ! అందుకే బోన్సాయ్ కళాకారుడు ప్రామాణికమైన శైలుల నుండి తన సృజనాత్మకత, నేర్పుల మేలు కలయికతో మరో విన్నూతమైన శైలిని వెలువ రించ వచ్చేమో గాని, స్వేచ్ఛ పేరుతో తీరూ తెన్నూ లేని ప్రతివిధానాన్ని ఒక క్రొత్త శైలి అనడం మాత్రం సబబు కాదు.

మొక్కల శైలులను వర్గీకరించేటప్పుడు కాండాల సంఖ్య, వాటి ఆకారం ముఖ్యంగా పరిగణనలోకి తీసుకోబడతాయి. కాండాల సంఖ్యను బట్టి బోన్సాయ్ శైలులు ఒకే కాండంతో పెరిగే విధానం (Single trunk style) , ఒకే మొక్క రెండు, అంతకు మించిన కాండాలతో (Twin, Triple, Clump, Multiple trunk styles), పెరిగే విధానం, సామూహి కంగా ఎన్నో మొక్కలు అడవిలా పెరిగే విధానం (Group or Forest style) అని వర్గీకరించ బడ్డాయి.

కొందరు కాండం ఆకారం, కాండాల సంఖ్య, వేళ్ళ ఆకారం, కొమ్మల ఆకారం, మొక్కల అమరిక (Composition) లను ప్రాతి పదికగా తీసుకొని బోన్సాయ్ శైలులను వర్గీకరిం చారు.

ఈ వర్గీకరణ ప్రకారం కాండం ఆకా రాన్ని బట్టి మొక్కలలో ఫార్మల్ అప్‌రైట్, ఇన్‌ఫార్మల్ అప్‌రైట్, ఏటవాలుపద్ధతి, సెమీకే స్కేడ్ , కేస్కేడ్ , లిటరటి, చుట్టలు చుట్టు కుంటూ పెనవేసుకుని పెరగడం (Coiled and Twisted) అనే విధానాలున్నాయి.

కాండాల సంఖ్యను బట్టి ఒకటి, రెండు, మూడు, ఐదు కాండాల మొక్కలు, సాముదా యిక కాండాల (Clump) మొక్కలు ఉన్నాయి.

వేళ్ళ ఆకారాన్ని బట్టి మొక్కల్లో ఉపరి భౌమిక వేళ్ళతోను (Exposed Root Style) రాఫ్ట్‌విధానంలోను, సిన్యువన్ పద్ధతిలోను పెరిగే మొక్కలున్నాయి.

కొమ్మల ఆకారాన్ని బట్టి బ్రూమ్, గాలి వాలు, కొమ్మ విస్తరించి పెరగడం అనే మూడు విధానాలున్నాయి.

ఇంక మొక్కల అమరికను (Composition) బట్టి సామూహిక విధానం (Group Settings) రాళ్ళమీద పెంచే విధానం (Rock Settings) అని రెండు రకాలు.

కాని శైలిని గురించి చెప్పేటప్పుడు మౌలికమైన విషయం చెట్టు ఆకారం. ఆ ఆకా రాన్ని బట్టి అయిదు రకాల ప్రామాణికమైన శైలులున్నాయి. అవి నిట్ట నిలువుగా పెరిగే విధానం (Formal Upright), వంపులు తిరిగి పైకి పెరిగే విధానం (Informal Upright), ఏటవాలు పద్ధతి(Slant style), సెమీ కేస్కేడ్



కేస్కేడ్ , జలపాతశైలి (Cascade). ఈ అయిదు ప్రాథమిక శైలుల నుండే లిటరటీ (Literati), గాలి వాలు పద్ధతి (Wind Swept style), విసనకఱ్ర పద్ధతి (Broom style), తెప్ప విధానం (Raft style), రాళ్ళలో మొక్కలు పెరిగే పద్ధతి (Rock settings), జిన్ (Jin), షారి (Shari), సబామికి (Sabamiki), మొద లైన శైలులన్నీ ఆవిర్భవించాయి. ఈ శైలులన్నిం టిలోను బోన్సాయ్‌లను విడివిడిగా పెంచ వచ్చు. సమూహాల్లోను పెంచవచ్చు.

ఒక ప్రక్కగా కొన్ని చెట్లు, వాటికి వెనుకగా కాస్త దూరంలో కొండలు, ఆ కొండల పీఠ భాగాన ఒక కొలను - ఇలా సుందర ప్రకృతి దృశ్యాలను (Land Scape), చూపుతూ పెద్ద ట్రేల లాటి బోన్సాయ్ కుండీల్లోగాని, పలుచటి పెద్ద రాతి పలకల మీద గాని అమర్చే విధానాన్ని కూడా బోన్సాయ్ కళాకారులు రూపొందిం చారు.

పైన చెప్పిన శైలీ విధానాలు, వాటికి చెందిన సూత్రాలు ఔత్సాహికులైన బోన్సాయ్ పెంపకం దారులకు పరిపూర్ణమైన బోన్సాయ్ లను రూపొందించుకోడానికి మార్గదర్శకా లుగా ఉపయోగపడతాయి. అనుభవాన్ని మించిన గురువు మరొకరుండరు గనుక బోన్సాయ్ కళాకారులు ఇంతకు ముందే చెప్పు కున్నట్లు వారి అనుభవానికి సృజనాత్మకతను జోడించి అపురూపమైన సజీవ కళారూపాలను సృష్టించవచ్చు.

## నిట్టనిలువుగా పెంచే పద్ధతి
## *(Formal Upright)*
## *Chokkan(Japanese Name)*

దృఢమైన కాండపీఠంతో, కాండం చుట్టూ వర్తులాకారంగా అమరిన అందమైన కొమ్మలతో నిటారుగా, ఠీవిగా, దర్జాగా, దర్పంగా కనిపించేళఆ పెంచే ఈ పద్ధతి బోన్సాయ్ పెంపకం దార్లకు చాలా ప్రీతి పాత్రమై నది. కాండంలో ఎలాటి వంపూలేకుండా బలంగా పైకి పెరిగిన చెట్టును చూడగానే ఏ విధమైన ప్రతికూలతలేని పరిస్థితుల్లో ఈ చెట్టు పెరిగి ఉంటుందని అర్థమైపోతుంది. ఈ తీరులో పెరిగే చెట్లు ఎక్కువగా మంచుకొండ లున్న ప్రాంతాల్లో కనిపిస్తుంటాయి. అలాగని మిగిలిన ప్రాంతాల్లో ఈ పద్ధతిలో మొక్కలను పెంచడం సాధ్యంకాదని మాత్రం అనుకోనవ సరం లేదు.

ఫార్మల్ అప్‌రైట్‌కి ఏ విధంగాను రాజీప డడానికి వీలులేని కొన్ని నిర్దుష్టమైన సూత్రాలు న్నాయి. వాటిని ఖచ్చితంగా పాటించి, వాటికి తోడు కొన్ని ప్రత్యేకమైన టెక్నిక్స్ ని ఉపయో గించినప్పుడు చక్కటి ఫార్మల్ అప్‌రైట్ మనకు తయారవుతుంది.

విత్తనం నాటి మొలిపించిన మొక్కను ఈ శైలిలో రూపొందించడం తేలిక। మొక్క లేతగా ఉన్నప్పటి నుండే మనకు అవసరమైన విధంగా కాండాన్ని, కొమ్మలను, వేళ్ళను తేలిగ్గా మలచుకోవచ్చు.



# పటం 59 : ఫార్మల్ అప్‌రైట్



మొక్కను చూడగానే కొట్టొచ్చినట్లు కనిపించే భాగం కాండం ! ఫార్మల్ అప్‌రైట్ బోన్సాయ్ కాండం ఇంతకు ముందే చెప్పుకు న్నట్లు ఎక్కడా వంపులేకుండా నిటారుగా ఉండాలి. ఎంత నిటారుగా అంటే చెట్టు అగ్ర భాగాన్నుండీ దారం కట్టిన రాయిని వేలాడదీస్తే అది కాండపీఠానికి మధ్య భాగంలో తగలాలి మరో మాటలో చెప్పాలంటే కోణమానిని పెట్టి 90 డిగ్రీలు కొలిచి మరీ గీతగీసినంత నిటా రుగా ఈ కాండం ఉండాలన్న మాట! అలాగని కాండాన్ని చూస్తుంటే ఒక లావు పాటి పుల్లను మట్టిలో గుచ్చినట్లు క్రిందినుండి పైకి ఒకేలా



మూనపోసి నట్లుండ గూడదు. కాండపీఠం లావుగాను, ధృఢంగాను ఉండి పైకిపోయిన కొద్దీ క్రమేణా నన్నబడి (taper) కొనదేలాలి.

ఫార్మల్ అప్‌రైట్‌లో 'మూడుకొమ్మల వలయ సిద్ధాంతాన్ని' తప్పకుండా పాటించాలి. కాండం 1/3 వ వంతు ఎత్తులో కుడి ఎడమల్లో ఏదో ఒకవైపున మొదటి కొమ్మ ఉండాలి. ఇది అన్ని కొమ్మల్లోకి ధృఢంగాను, పొడవుగాను ఉండాలి. కాండం మీద ఈ కొమ్మకు అభిముఖంగా గాని, వెనకగాని రెండవ కొమ్మ రావాలి. అలాగాకుండా వెనక రెండవ కొమ్మ వస్తే, ప్రక్కన మూడవ కొమ్మ రావాలన్నమాట! ఈ వలయంపైన రెండవ వలయం, ఆ పైన మూడవ వలయం-అలా చెట్టు ఎత్తును బట్టి వలయాల సంఖ్య మారుతుంటుంది. అన్నిటి కంటె పైన శిఖరాగ్రం (apex) ఉంటుంది.

కొమ్మలు ఎట్టి పరిస్థితుల్లోను కాండపు ముఖభాగాన్ని దాటుకుంటూ వెళ్ళకుండా జాగ్రత్త తీసుకోవాలి. కొమ్మలు, చెట్టు శిఖరభాగమూ కూడా వయోభారంతో వంగిన సూచనగా కొంచెం క్రిందకు, మనవైపుకు వాలినట్లు ఉండాలి. కాండాన్ని కప్పుతూ కొమ్మలు వెళ్ళకుండా ఎలా జాగ్రత్తపడ్డామో - అలాగే కొమ్మల వంపులను, అందాన్ని మరుగు పరిచేలా ఆకులను దట్టంగా పెరగనివ్వగూడదు. కొమ్మ అడుగున ఉన్న ఆకులను త్రుంచి వేస్తే కొమ్మ స్పష్టంగా కనిపిస్తుంది.

ధృఢమైన మొదలు, పైకిపోయిన కొద్దీ క్రమంగా నన్నబడి కొనదేలిన కాండం, క్రిందివైపున బలంగాను, విశాలంగాను ఉండి పైకిపోయిన కొద్దీ నిడివితగ్గి నన్నబడిన కొమ్మలతో రూపొందిన ఫార్మల్ అప్‌రైట్ బోన్సాయ్‌ని చూస్తుంటే దాంట్లో మనకో త్రిభుజాకారం కనిపిస్తుంది.

ఫార్మల్ అప్‌రైట్‌లో పెరిగే బోన్సాయ్‌లో కాండంతో సమానంగా చూపరులను ఆకర్షించేవి ఉపరితలపు వేళ్ళు. సాధారణంగా బలంగాను, ఎత్తుగాను పెరిగే వృక్షజాతులను ఫార్మల్ అప్‌రైట్ విధానానికి ఎంచుకుంటాం! అలాటివాటికి బలిష్ఠంగా భూమిలోకి చొచ్చుకుపోయే తల్లివేరు ఉంటుంది. దాన్ని కత్తిరించి పై వరుసలో ఉన్న ప్రక్క వేళ్ళను ముక్కు ముఖభాగం వైపున లేకుండా మిగిలిన అన్ని వైపులా వ్యాపించేలా మలచి పెంచుకోవాలి. ఈ ప్రక్రియను గురించి 'బోన్సాయ్ రూపు రేఖలను తీర్చిదిద్దడం' అనే అధ్యాయంలో విపులంగా చెప్పుకున్నాం గదా!

తల్లివేరును కత్తిరించుతాం గనుక దానికి చేరవలసిన ఆహారం ఈ ఉపరితలపు వేళ్ళకు చేరి అవి లావుగా ఉబుకుతాయి.

ఫార్మల్ అప్‌రైట్‌లో కాండంలోను, కొమ్మల్లోను కనిపించే క్రమబద్ధమైన టాపరింగ్ ఉపరితలపు వేళ్ళలో కూడా కనిపిస్తుంది. కాండపీఠం నుండి బలిష్ఠంగా విస్తరించి పోను



పోను సన్నబడే ఈ ఉపరితలపు వేళ్ళ కొనలు భూమిలోకి చొచ్చుకుని పెరుగుతుంటాయి. ఇలా భూమి మీద విస్తరించి పెరుగుతున్న దృఢమైన ఉపరితలపు వేళ్ళు చెట్టు అందాన్ని ఇనుమడింప జెయ్యడమే గాక ఎన్నో ఏళ్ళుగా ఆ మహావృక్షానికి స్థిరత్వాన్నిస్తున్న భావనను మనకు కలుగజేస్తాయి.

ఫార్మల్ అప్‌రైట్ శైలిలో పెరిగే మొక్కలకు గుండ్రంగాను, నలుచదరంగాను, దీర్ఘచతురస్రాకారంలోను ఉన్న కుండీలు అనువుగా ఉంటాయి. సన్నగా, పొడవుగా పెరిగే మొక్కలు బాగా లోతు తక్కువ కుండీల్లో అందంగా అమరుతాయి. దృఢమైన కాండంతో, విశాలమైన కొమ్మలతో పెరిగే అప్‌రైట్‌కి మధ్యస్థమైన లోతు ఉండే కుండీలు పనికొస్తాయి. కుండీ వెడల్పు చెట్టు ఎత్తు, కొమ్మల విస్తారం - ఈ రెండింటిలో ఏది ఎక్కువైతే ఆ కొలతలో సుమారు 2/3 వ వంతు ఉండాలి. మనం ఎదురుగా నిలబడి చూస్తే మొక్క కుండీ మధ్యలోగాక పటంలో చూపినట్లు కాస్త ప్రక్కగాను, వెనుకగాను ఉండేలా మొక్కను నాటాలి.

చిన్న మొలకను తీసుకుని ఫార్మల్ అప్‌రైట్ విధానంలో ఒక మహావృక్షంలా మలచాలంటే కనీసం ఒక దశాబ్దమైనా పడుతుంది. అంతకాలం ఓర్పుగా ఎదురు చూడలేని వాళ్ళు నేర్పుని, అనువైన టెక్నిక్స్‌ని ఉపయోగిస్తే స్వల్పకాలంలోనే మంచి బోన్సాయ్ తయారవుతుంది.

మనకు నర్సరీలోగాని, బయటగాని ఫార్మల్ అప్‌రైట్ శైలిలో పెంచడానికి అనువైన మొక్క దొరికినప్పుడు దాన్నికొన్ని సవరణలు

| | |
|---|---|
| | |
| | |

**పటం 60 : ఫార్మల్ అప్‌రైట్ మొక్కను కుండీలో నాటవలసిన స్థానం**



చేసి చక్కటి బోన్సాయ్‌గా రూపొందించుకో వచ్చు. కాండం కొంత భాగాన్ని కత్తిరించి ఒక కొమ్మని కాండాగ్రంలా వచ్చేలా ఎలా మలచు కోవాలి, కాండంలో ఉండే స్వల్పమైన వంపు లను ఎలా సరిచేసుకోవాలి, అవసరమైన చోట క్రొత్త కొమ్మలను గ్రాఫ్ట్ చేసుకోడం ఎలా, బలంగా ఉండి అందంగా వ్యాపించేలా ఉపరిత లపు వేళ్ళను ఎలా మలచుకోవాలి - మొదలైన విషయాలకు సంబంధించిన వివరాలను ''బోన్సాయ్ రూపురేఖలను తీర్చిదిద్దడం'' అనే అధ్యాయంలో వివరంగా చర్చించుకున్నాం గదా ! వాటిని అనుసరించి అతి తక్కువ కాలంలోనే ఎంతో ఎక్కువ వయసును చూపే బోన్సాయ్‌ని మనం తయారు చేసుకోవచ్చు.

## వంపులు తిరుగుతూ పైకి పెరిగే పద్ధతి (Moyogi) (Informal Upright)

బోన్సాయ్ పద్ధతుల్లో ఇది రెండవది. ఫార్మల్ అప్‌రైట్ విధానం కంటే ఇన్‌ఫార్మల్ అప్‌రైట్ విధానంలో బోన్సాయ్ మొక్కలను పెంచడం తేలిక. ఎందుకంటే మొక్క ఆకా రాన్ని తీర్చిదిద్దడంలో ఫార్మల్ అప్‌రైట్‌లోలా తు.చ తప్పకుండా పాటించవలసిన నిబంధన లకు ఈ పద్ధతిలో కాస్తసడలింపు, సర్దుబాటు ఉంటాయి. కాండాన్ని మలచడంలోను, వల యాలుగా ఉండవలసిన కొమ్మల స్థానంలోను, కొమ్మలమధ్య దూరంలోను బోన్సాయ్ కళాకా రుడికి ఈ విధానంలో రవ్వంత వెసులుబాటు ఉంటుంది. ఇందులో మన అభిరుచిని, ప్రత్యేక తను ప్రదర్శించే అవకాశం ఉంటుంది. ప్రకృ తిలో ఈ విధానంలో పెరిగే మొక్కలే ఎక్కువ కనిపిస్తుంటాయి. ఇన్ ఫార్మల్ అప్‌రైట్ బోన్సాయ్ కళాకారులకు ప్రీతిపాత్రమైన పద్ధతి. అందుకనే బోన్సాయ్ కలెక్షన్స్‌లో ఈ పద్ధతిలో పెంచిన మొక్కలను ఎక్కువగా చూస్తుంటాం!

ఇక్కడ ఇంకోవిషయం కూడా చెప్పాలి. పేరులో ఇన్‌ఫార్మల్ అని ఉంది కదా అని మొక్కను బొత్తిగా రీతీరివాజు లేకుండా పెంచ డానికి వీల్లేదు. దానికీ కొన్ని పద్ధతులున్నాయి. ఎటొచ్చీ ఫార్మల్ అప్‌రైట్‌తో పోల్చి చూచిన ప్పుడు మాత్రం ఈ పద్ధతిలో పట్టు విడుపులకు ఆస్కారం ఎక్కువ ఉంది.

కాండం మొదలు లావుగాను, దృఢం గాను ఉండి పైకి వెళ్లిన కొద్దీ క్రమేణా సన్నబడా లనడం, ఉపరితలపు వేళ్ళు కాండం చుట్టూ పరచుకొని ఉండాలనడం - ఇవి ఫార్మల్ అప్ రైట్ విధానానికే పరిమితం కాదు. ఇన్‌ఫార్మ ల్‌తో పాటు తక్కిన బోన్సాయ్ విధానాలన్నిం టిలోను ఇవి మౌలికమైన సూత్రాలుగా గుర్తుం చుకోవలసినదే !

ఫార్మల్ అప్‌రైట్‌లో చెప్పినట్లు ఇన్ ఫార్మల్‌లో కూడా కాండం పొడవులో సుమారు



1/3వ వంతు ఎత్తులో మొదటి కొమ్మ ఉండాలి. ఈ కొమ్మ ఎప్పుడూ కాండానికి కుడివైపున గాని, ఎడమవైపునగాని ఉండాలి. అంతేగాని ఎట్టిపరిస్థితులలోను ముందువెనుకలకు ఉండగూడదు. అంటే మనకు ఎదురుగాగాని, కాండం వెనుక వైపునగాని ఉండగూడదన్నమాట! ఇకపోతే ఇన్‌ఫార్మల్ అప్‌రైట్‌లో కూడా ఫార్మల్‌లోలా మొదటి మూడుకొమ్మల వలయం తప్పనిసరి ! అయితే ఆపైన వచ్చేకొమ్మలకు ఈ మూడుకొమ్మల వలయ సిద్ధాంతం ఖచ్చితంగా పాటించాలన్న నిర్బంధం ఏమీలేదు.

ఫార్మల్ అప్‌రైట్‌లో కాండం నిటారుగా 90 డిగ్రీల కోణంలో గీసిన గీతలా ఉంటుంది - ఉండాలి కూడా! ఇన్ ఫార్మల్‌లో కాండం అలా ఖచ్చితంగా 90డిగ్రీల కోణంలో ఉండవలసిన అవసరం లేదు.

ఓ పది పదిహేను డిగ్రీలు అటూఇటూగా ఉండవచ్చు. అంటే కాండం నిటారుగా పైకే పెరుగుతున్నప్పటికి మధ్యలో



పటం 61 : ఇన్‌ఫార్మల్ అప్‌రైట్



అక్కడక్కడా వంపులు తిరగవచ్చునన్న మాట! కాండం శిఖరం (Apex) మాత్రం కొద్దిగా మనవైపుకు - అంటే ముందుకు వాలిన ట్లుగా ఉండాలి. అలా కొన ముందుకు ఒరిగి నట్లుగా చేయడం వల్ల అసలు ఉన్నదానికంటే చెట్టు మరింత పెద్దదిగా ఉన్నట్లు, వయోభా రంతో తలవాల్చినట్లు భ్రమకలుగుతుంది. చెట్టు ఎంత ఎక్కువ వయసుకలదిగా కనిపిస్తే అంత అందం అని గదా మన భావన!

ఫార్మల్ అప్‌రైట్‌లోలా కాకుండా ఇన్ ఫార్మల్‌లో కాండం వంపులు తిరిగి ఉండవచ్చు ననుకున్నాం గదా ! అయితే ఇక్కడ మనం గుర్తుపెట్టుకోవలసిన ముఖ్యవిషయం ఒక టుంది. అదేమిటంటే కాండం వంపు ఎప్పుడూ కూడా కుడి ఎడమలకే ఉండాలిగాని ముందు వెనుకలకు ఉండగూడదు. మరో ముఖ్యవిషయ మేమిటంటే కాండం వంపు తిరిగిన చోటుకి వ్యతిరేక దిశలో తప్పనిసరిగా కొమ్మ ఉండాలి.

సాధారణంగా మనం ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోనవసరం లేకుండానే కాండంగాని,



**పటం 62 : చెట్టు వంపుకు అభిముఖంగా కొమ్మ ఉంటుంది**



కొమ్మ గాని వంపుతిరగినప్పుడు దానికి వ్యతిరేక దిశలో కొమ్మ బలంగాను, ఆకులు దట్టంగాను పెరగడం గమనిస్తుంటాం! ఎందుకంటే అలా లేకపోతే చెట్టుకు బ్యాలెన్స్ ఉండదు గనుక ప్రకృతే అందుకు తగిన జాగ్రత్తలు తీసుకుంటుంది. కాని మన బోన్సాయ్ పెంపకంలో అలా కాదుగదా ! మనం అనుకున్న రీతిలో మొక్కను తీర్చిదిద్దడానికి బలవంతంగా వంపులు తిప్పుతున్నాం! ఇలా బలవంతంగా వంచడం వలన సరిగ్గా వంపుకు వ్యతిరేకదిశలో మనకు కావలసినట్లుగా దృఢమైన కొమ్మ పెరగక పోవచ్చును. అటువంటప్పుడే మన నైపుణ్యం, టెక్నిక్కూ కూడా కావలసి వస్తాయి. వంపుకు కాస్త క్రింద గానో, పైగానో కొమ్మ ఉందనుకోండి ! అప్పుడు రాగితీగ సాయంతో ఆ కొమ్మ ఉండవలసిన స్థానానికి - అంటే పైకిగాని, క్రిందికి గాని వంచి ఆలోటును భర్తీచేయవచ్చు.! అంటే సహజంగానే ఆకొమ్మ ఆ స్థానంలో ఉన్నట్లు భ్రమింపజేయవచ్చునన్న మాట!

ఒకవేళ వంపుకి పైగానో, క్రిందగానో మలచడానికి అనువైన కొమ్మ లేదనుకోండి. అలాటప్పుడు మరో చెట్టునుండి మనకు కావలసిన సైజులో ఉన్న కొమ్మను తీసుకొని మనకు అవసరమైన చోట గ్రాఫ్ట్ చేసుకోవచ్చు!

ఇన్ ఫార్మల్ అప్‌రైట్‌కి సాధారణంగా దీర్ఘ చతురస్రాకారంలో గాని, అండాకారంలో గాని ఉన్న కుండీల నుపయోగిస్తాం! ఇకకుండీ లోతు ఎంత ఉండాలన్నది కాండం లావుని బట్టి నిర్ణయించుకోవాలి. కుండీ పొడవు కొస్తే చెట్టు ఎత్తులో 2/3 వవంతు ఉంటే బాగుంటుంది. కుండీలో మొక్కని ఖచ్చితంగా మధ్యలోగాక కాస్త ప్రక్కకి జరిపి నాటుకోవాలి.

## ఏటవాలు పద్ధతి
## (Slanting Style)
## (Shakan)

ఏటవాలు పద్ధతిలో బోన్సాయ్‌ని పెంచే విధానం ఇటు ఇన్ ఫార్మల్ అప్‌రైట్‌కి అటు సెమీకేస్కేడ్ కి మధ్యస్థంగా ఉంటుంది. అంటే ఇటు ఇన్‌ఫార్మల్‌లోలా కాండం వంపులు తిరుగుతూనే సెమీకేస్కేడ్ లోలా ఒక వైపుకి వాలి పెరుగుతుంది.

ఏటవాలు పద్ధతిలో పెరిగే మొక్క కాండం 90డిగ్రీల కోణంలో నిటారుగా గీత గీస్తే ఆ గీతకు కుడివైపుకి గాని, ఎడమవైపుకి గాని 10 డిగ్రీల నుండి 45డిగ్రీల వరకు వాలి ఉంటుంది. ఇకపోతే వాలిన కాండం ఆకారం ఎలా ఉండాలన్నది మన అభిరుచి మీద ఆధారపడి ఉంటుంది - ఫార్మల్ అప్‌రైట్‌లో పెరిగిన మొక్కను ఏటవాలుగా నిలబెట్టినట్లు కాండం ఏవంపులు లేకుండా పెంచవచ్చు. లేదా కాండాన్ని వంపులు తిప్పుతూగాని, కోణాలు చేస్తూ గాని మలచుకోవచ్చు.

ఫార్మల్ అప్‌రైట్‌లోలా సిద్ధాంతరీత్యా కాకపోయినా చెట్టు నిలువుగా పెరిగితే బాగుం



## పటం 63 : ఏటవాలుగా పెరిగిన ఫార్మల్ అప్‌రైట్



టుందిగాని పడిపోయినట్లు వాలుగా నిలబెట్టడ మెందుకు అని మీకు అనిపించవచ్చు. బోన్సాయ్ పద్ధతిలో మొక్కలు పెంచడమంటే ప్రకృతి ననుకరించడమే గదా! అందుకే ప్రకృతిలో మనం చూసే అన్ని రకాల ఆకారాల మొక్కలను మన చిన్ని వనంలో చూపించడానికి ప్రయత్నిస్తుంటాం ! నిజానికి అన్ని పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడే చెట్టు నిలువుగా పెరగగలుగుతుంది. సూర్యరశ్మిని వెదుక్కుంటూనో లేదా గాలివాలు వల్లనో చెట్లు ఇలా వాలిపోయి పెరగడం మనం ప్రకృతిలో చూస్తునే ఉంటాం!

ఈ పద్ధతిలో బోన్సాయ్ మొక్కలను పెంచే వాళ్ళకు వారి వారి అభిరుచులను బట్టి పెంచుకోడానికి కావలసినంత స్వేచ్ఛ ఉందని చెప్పుకున్నాం గదా! అలా అని కొమ్మలు ఎక్కడంటే అక్కడ పెరగవచ్చునని కాదు. మొట్ట మొదట చెప్పుకున్నట్లుగా కాండానికి కొమ్మ



## పటం 64 : ఏటవాలుగా పెరిగిన ఇన్‌ఫార్మల్ అప్‌రైట్



లుండడమంటే మూడుకొమ్మల వలయమనే! కనుక మూడు కొమ్మల వలయ సిద్ధాంతం ఏటవాలు పద్ధతికి కూడా వర్తిస్తుంది. ఎటొచ్చీ కాండంలో వంపులు తిరిగినప్పుడు ఇన్‌ఫార్మల్ అప్‌రైట్‌లో చెప్పుకున్నట్లుగా ప్రతి వంపుకి వ్యతిరేక దిశలో తప్పకుండా కొమ్మ ఉండాలి. మొదటి వంపుకి వ్యతిరేక దిశలో ఉన్న కొమ్మ మొదటిది అవుతుందిగదా! కాబట్టి అది బలం గాను, పొడవుగాను కూడా ఉండాలి. ఈ మొట్ట మొదటి కొమ్మ వంగిపోయిన చెట్టును సమతూకంలో ఉంచుతుందన్నమాట!

ఏటవాలుపద్ధతిలో కాండం తీరుకంటె కూడా ప్రత్యేకంగా చెప్పుకోదగిన అంశం ఉపరితలపు వేళ్ళు! ఈ పద్ధతిలో ఉపరితలపువేళ్ళు పరుచుకున్నరీతి ప్రత్యేకంగా ఉంటుంది. ఇవి ఇంతకు మునుపు పద్ధతుల్లోలా కాండం చుట్టూ పరచుకొని ఉండవు. వాలిపోతున్న చెట్టును లంగరువేసి ఆపడానికి ప్రయత్నిస్తున్నట్లుగా



**పటం 65 : ఏటవాలు పద్ధతిలో పెరిగే చెట్టు వాలిన వైపు వేళ్ళు ముడుచుకుంటాయి – రెండవ వైపు చెట్టును లంగరు వేసి నిలబెడుతున్నట్లుగా నిగడదన్ని ఉంటాయి**



వాలుకు వ్యతిరేకదిశలోని ఉపరితలపువేళ్ళు సాగి నిగడదన్ను కున్నట్లుంటాయి. అంటే మొక్కకుడి వైపుకు వాలి ఉన్నప్పుడు ఎడమ వైపున ఉండే ఉపరితలపు వేళ్ళు పైన వర్ణించిన ట్లుగా ఉంటా యన్నమాట! దానికి విరుద్ధంగా చెట్టువాలినవైపుకు ఉన్నవేళ్ళు మొక్కబరు వుకు కుంగిపోయి ముడుచుకు పోయినట్లుగా కనిపిస్తుంటాయి. ఏరకంగాను వేళ్ళుసాగడా నికి అవకాశంలేదు గనుక రెండవ వైపు వేళ్ళు అలా లావుగా ఉబ్బిపోయి ఉంటాయి.

ఏటవాలు పద్ధతిలో మరో సుగుణం ఉంది. చక్కని ఆకారంతోపాటు ఎత్తు తక్కువ ఉండేలా చూడ్డం బోన్సాయ్ పెంపకంలో ముఖ్యలక్షణం! కాండాన్ని భూమికి దగ్గరగా వంచడం వలన, కాండం వాలి ఉండడం వలన సహజంగానే చెట్టు పొట్టిగా కనిపిస్తుంది. ఏకా రణం చేతనైనాగాని కొమ్మలు కాండానికి ఒకవై పున మాత్రమే బలంగా ఉన్నప్పుడు కూడా ఒక్క చిన్న వంపుతో మనం చక్కని ఏటవాలు పద్ధతికి అనువైన బోన్సాయ్‌గా దాన్ని రూపొం దించుకోవచ్చు.



ఈవిధానంలో మొక్కలను పెంచడానికి లోతు తక్కువగా ఉన్న నలుచదరం, దీర్ఘచతురస్రం, గుండ్రం, షడ్భుజాకారాల్లో ఉన్న తొట్లను ఉపయోగించుకోవచ్చు.

ఫార్మల్, ఇన్‌ఫార్మల్ అప్‌రైట్ విధానాల్లో పెంచడానికి అనువైన మొక్కలన్నీ ఏటవాలుపద్ధతిలో కూడా పెంచుకోడానికి అనువుగానే ఉంటాయి.

## సెమీ కేస్కేడ్ పద్ధతి

## *(Semi Cascade Style)*
## *(Han - Kengai)*

మొక్కనాటిన కుండీ అంచుమీద భూమికి సమాంతరంగా ఒక గీతను గీసామనుకుందాం! ఆగీతకు దాదాపు 45 డిగ్రీల కోణంలో మొక్క తలభాగం, ఆ గీతకు క్రిందగా దాదాపు సమాంతరంగా మెలికలు తిరుగుతూ పెరిగిన తోకభాగం ఉంటే ఆ మొక్క ఆకారాన్ని 'సెమీకేస్కేడ్' అంటాం! కొండ శిఖరాల నుంచి దూకుతూ సాగే జలపాతాన్ని తలపిస్తూ పెరిగే బోన్సాయ్ శైలిని 'కేస్కేడ్' విధానం అంటారు. కేస్కేడ్ విధానంలోలా మొక్క క్రిందికల్లా పెరగక పోయినా మొక్క శిఖర భాగమూ, కుండీ అంచును దాటి కొంతమేరకు పెరిగే తోక భాగమూ, దీన్ని 'సెమీకేస్కేడ్' అని పిలిచేందుకు దోహదం చేస్తాయి.

ప్రకృతిలో ఈ ఆకారంలో పెరిగే మొక్కలు మనకు చాలా అరుదుగా తారసపడుతుంటాయి. పెనుగాలులు వీచినపుడు ప్రక్కకు వాలి భూమి మీద పడిపోయి కాస్తో కూస్తో మిగిలిన పట్టుతో బ్రతుకుతున్న వృక్షాల్లోను, గాలికి అల్లల్లాడుతు కొండ చరియల్లో భూమికి సమాంతరంగా పెరుగుతున్న మొక్కల్లోను మనకు ఈ ఆకారం కనిపిస్తుంటుంది.

వాస్తవానికి ఈ మొక్కలు శక్తిలేకపోవడం వల్ల ప్రక్కకు వాలి పెరగవు. నిటారుగా పెరగడానికి పరిసరాలు, పరిస్థితులు అనుకూలించక పోవడంతో అవరోధాలను దాటుకునే ప్రయత్నంలో అలా పెరుగుతాయి. అందుకే మనం ఈ శైలిలో మొక్కను పెంచేటప్పుడు కాండం శక్తిలేక కుండీ అంచుమీదికి వాలిపోయినట్లు గాకుండా కొద్ది ఎత్తువరకు పెరిగి అప్పుడు ప్రక్కకు తిరిగినట్లు పెంచితే అది సహజత్వానికి మరింత చేరువగా ఉంటుంది. అలా ప్రక్కకు తిరిగిన కాండం కుండీ అంచును దాటిపోయి కొంచెం క్రిందికి పెరిగి ఆ తరువాత మెలికలు తిరుగుతూ దాదాపు భూమికి సమాంతరంగా పెరుగుతూ పోతుంది.

కాండం కుండీ అంచును దాటి పెరుగుతుందంటున్నాం గదా! అలా దాటడం మనకు ఎదురుగా ఉండే వైపునుండిగాని, కుండీ వెనక వైపు నుండి గాని గాక కుండీకి కుడి ఎడమల్లో ఏదో ఒక వైపు నుండి మాత్రమేదాటాలి.



# పటం 66 : సెమీకేస్కేడ్



ఇక పోతే కొమ్మల అమరిక మామూలే! అప్‌రైట్ విధానాల్లోని మూడుకొమ్మల వలయం ఇక్కడా వర్తిస్తుంది. ఒక్కముక్కలో చెప్పాలంటే ఇన్‌ఫార్మల్ అప్‌రైట్ విధానంలో పెంచిన మొక్కను ముఖభాగం అడుగుకు ఉండేలా బోర్లా పడుకోబెడితే కొమ్మలు ఎలాఉంటాయో అలాటి అమరికే సెమీ కేస్కేడ్ లో ఉంటుంది. అప్‌రైట్‌లో క్రింది కొమ్మనుండి పైన శిఖరాగ్రం వరకు కనిపించే త్రిభుజాకారపు డిజైను ఇక్కడ సమాంతరంగా పెరిగిన కాండంలో కూడా కనిపిస్తుంది. అప్‌రైట్‌లో కాండాగ్రం మన వైపుకి కొద్దిగా వాలి ఉన్నట్లుగా ఇందులో తోక కొసభాగం క్రిందివైపుకి వంగి ఉంటుంది.



పటం 67 : తోకభాగం బాణం గుర్తున్న ఏ వైపుకైనా వాలవచ్చు.
వెనుకకో, ముందుకో మాత్రం వాలకూడదు




కుండీ అంచును దాటి సమాంతరంగా పెరుగుతూ పోయే తోకభాగం ఏవంపూ వైనం లేకుండా సాదాగా, సూటిగా పెరిగితే కేస్కేడ్ అందం తెలియదు. దాన్ని వంపులు తిప్పి పెంచితే బాగుంటుంది. వంపు తిరిగిన ప్రతి చోటా ఆ వంపుకు అభిముఖంగా కొమ్మ ఉండేలా చూచుకోవాలి. అలా మొక్క మొదటి వంపు దగ్గర పెరిగిన కొమ్మ నిలువుగా కొంచెం పైకి పెరిగేలా చేస్తే అది తలలాగా ఉండి చెట్టుకు ప్రత్యేకమైన అందం వస్తుంది. ఇలా పెరిగిన



పటం 68 : సెమీకేస్కేడ్ లో తోక, ఉపరితలపు వేళ్ళు పెరిగే విధానం



కొమ్మ తరువాతంతా ప్రక్కకు వాలి పెరిగే చెట్టును బ్యాలెన్స్ చేస్తుంది కూడా!

అయితే పైకి తలలా పెరిగిన ఈ కొమ్మ కంటే ప్రక్కకు తోకలా సమాంతరంగా పెరిగిన కాండభాగం తప్పని సరిగా దృఢంగాను, పొడవుగాను ఉండి తీరాలి. అలా లేకపోతే పైకి పెరిగిన కొమ్మభాగం అప్‌రైట్ విధానంలో పెరుగుతున్న మొక్క కాండం లాను, సమాంతరంగా ప్రక్కకు పెరిగిన కాండభాగం ఆ అప్ రైట్ మొక్క మొదటి కొమ్మలాను అనిపించే ప్రమాదం ఉంది.

ఇక్కడ మనం జాగ్రత్తపడవలసిన విషయం మరొకటుంది. ఒకప్రక్కగా కుండీ అంచును దాటిన కాండభాగం అలా సమాంతరంగా మెలికలు తిరుగుతూ పోయి కొసభాగంలో మాత్రమే క్రిందికి వాలినట్లు ఉండాలి. అలాగాకుండా అంచును దాటగానే క్రిందికి జారిపెరుగుతూ కుండీ అడుగుభాగం వరకూ వెళ్ళనిచ్చామను కోండి! అప్పుడు అది ఫుల్‌కేస్కేడ్ అయిపోతుంది తప్ప సెమీకేస్కేడ్ కాదు.

సెమీకేస్కేడ్ లో ఉపరితలపు వేళ్ళ అమరిక దాదాపు ఏటవాలు పద్ధతిలోలాగే ఉంటుంది. అంటే చెట్టు ప్రక్కకు సమాంతరంగా పెరిగిన వైపుకు వ్యతిరేకదిశలో ఉన్న వేళ్ళు వాలిన మొక్కను లాగిపట్టి ఉంచుతూ నిగడదన్ని భూమిలోకి చొచ్చుకుపోయి ఉంటాయి.కాండం వంగినవైపు ఉన్నవేళ్ళు అణచబడి లావుగా ఉబ్బి ఉంటాయి. అయితే ఏటవాలు పద్ధతిలో ఉన్నంత పొడవుగా ఇందులోని వేళ్ళు ఉండవు.

సెమీ కేస్కేడ్ శైలిలో మొక్కలను పెంచడానికి మెరకగా ఉండే మామూలు బోన్సాయ్ తొట్లు పనికిరావు. కాస్తలోతుగా ఉన్న గుండ్రం, చదరం, షడ్భుజి, అష్టభుజి మొదలైన ఆకారాలున్న కుండీలేవైనా సెమీ కేస్కేడ్ శైలికి అనువుగా ఉంటాయి. ఈపద్ధతిలో కుండీలో మొక్కనాటే విధానం కూడా వేరుగా ఉంటుంది. కుండీ అంచును కూడా దాటి గాలిలో అల్లల్లాడే కాండాన్ని భరించడానికి వీలుగా కాండంవాలిన వైపుకు వ్యతిరేకదిశలోని కుండీ అంచువైపుగా మొక్కనునాటాలి.

సెమీకేస్కేడ్ పద్ధతిలో పెంచడానికి మనకు తేలికగా లభించే చింత, నందివర్ధనం, గోవర్ధనం, బోగన్ విల్లా లాంటి మొక్కలు అనువుగా ఉంటాయి.

## జలపాత శైలి (Kengai) (Full Cascade Style)

కేస్కేడ్ అంటేనే ఎత్తైన కొండమీద నుండి దూకే జలపాతం గదా! బోన్సాయ్ మొక్కను పెంచే విధానానికి ఈ పేరు ఉందీ అంటే ఆ మొక్క పెరిగే తీరేమిటో మనకు ఇట్టే



# జలపాత శైలి



బోన్సాయ్ మొక్కలు ప్రకృతిలో ఎన్నో రీతుల్లో పెరిగే సహజ వృక్షాలకు సూక్ష్మరూపా లనే సంగతి మరోసారి గుర్తుచేసుకుంటే ఈ కేస్కేడ్ విధానంలో మొక్కను పెంచడం కూడా అసహజమేమీరా అనిపించదు.

కొండ అంచున మొలిచి గాలి తాకిడికి నీటి ఉరవడికి తట్టుకుంటూ పైకి పెరగలేక

తెలిసిపోతుంది. సాధారణంగా మొక్కలు భూమ్యాకర్షణకు వ్యతిరేకంగా సూర్యుడివైపు సాగిపోతున్నట్లు పెరుగుతుంటాయి. కాని అందుకు విరుద్ధంగా మొక్క పైనుండి క్రింది వైపుకు సాగుతూ పెరుగుతోందంటే దాని జీవన పరిస్థితులు, పరిసరాలు ఎంత ప్రతికూ లంగా ఉన్నాయో కూడా అర్థమైపోతుంది.



ఆ అంచువెంటే వేళ్ళాడుతూ పెరిగే కొన్ని మొక్కలకు ప్రతిరూపాలు ఈ కేస్కేడ్ విధానంలో మనం పెంచే బోన్సాయ్ మొక్కలు.

మొక్కలు పరిసరాలకు అనుగుణంగా తమ జీవన సరళిని అనువర్తించుకుంటూ ఎలా మనుగడ సాగిస్తాయో చూపే చక్కటి ఉదాహరణే ఈ కేస్కేడ్ విధానంలో పెరిగే మొక్క!

కొండలు దూకి పారేజలపాతాల్లా బోన్సాయ్ మొక్కలను పెంచే ఈ పద్ధతి చైనీయులకు చాలా ప్రీతిపాత్రమైనది.

ఎక్కువ వంపులు తిరిగిన ఇన్ ఫార్మల్ అప్‌రైట్ విధానంలో పెరిగే మొక్కను తలక్రిందులు చేస్తే ఎలా ఉంటుందో దాదాపు అలా ఉంటుంది కేస్కేడ్ లా పెరిగే మొక్క! అప్‌రైట్‌లో లాగే మూడుకొమ్మల వలయాలు ఇందులో కూడా తప్పనిసరి!

తేలిగ్గా అర్థం కావడం కోసం ఈపోలిక చెప్పుకున్నాం గాని నిజానికి దీని ప్రత్యేకత దీనిదే! అందుకే కేస్కేడ్ ని ఒక అసాధారణ కళారూపంగా పరిగణించదగ్గ విశేషాలేమిటో వివరంగా తెలుసుకుందాం!

ముందుగా కాండం గురించి! కాండాన్ని మొదట్లో కొద్ది ఎత్తువరకు పెరగనివ్వాలి. ఎంత ఎత్తు అంటే - ప్రక్కను వాలినప్పుడు కుండీ అంచును ఏ మాత్రం తాకనంత ఎత్తు! కాండం కుండీ అంచుమీద ఆనితే దానికి పైకి పెరిగే శక్తిలేక ప్రక్కకు సోలి క్రిందకు జారిందేమోనన్న భావన చూసే వాళ్ళకు కలుగుతుంది. అలా కాకుండా కేస్కేడ్ కాండంలో దాని దృఢత్వం, పరిస్థితులను అధిగమించి పెరగగలిగిన దర్పం మనకు అడుగడుగునా కనిపిస్తుండాలి.

పైన చెప్పినట్లు కాండం కొంతఎత్తువరకు పెరిగాక దాన్ని ఒకవైపుకు తిప్పికాండం క్రిందకు వాలేలా వంచాలి. ఆ వంపు గుండ్రంగా గాకుండా కాస్తవెనుకకు వాలి మళ్ళీ ముందుకు వచ్చినట్లుగా కోణాకారంలో ఉండాలి. ఈ మొదటి వంపే కాకుండా కాండంలో ముందు ముందు తిప్పేవంపులన్నీ కూడా కోణా కృతిలోనే ఉండాలనే విషయాన్ని మనం మరచి పోగూడదు. కొండరాళ్ళను పట్టుకుని వేళ్ళాడుతూ వాటి సందుల్లో మెలికలు తిరుగుతూ పెరిగే ఈ మొక్కలో మనం చూపే వంపులు అలా కోణా కృతిలో ఉంటేనే సహజత్వానికి దగ్గరగా ఉంటుంది.

మరో మౌలికమైన విషయమేమిటంటే ప్రతివంపుకి అభిముఖంగా ఒకకొమ్మ ఉందో లేదో చూచుకోడం ! ఈ మొక్కని సహజంగా కనిపించేలా వంపులు తిప్పుతూ పెంచుతున్నామేగాని ఆ వంపులు సహజంగా వచ్చినవి కాదు గదా! అందుకే వంపు ఉన్న దగ్గర కొమ్మ ఉందోలేదో చూచుకునే కంటే కొమ్మఉన్న దగ్గరే వంచుకుంటూ పోతే మనపని తేలికవుతుంది.



సహజంగా పెరిగే కాండంలో ముందుకు పోయిన కొద్దీ కొమ్మకూ కొమ్మకు మధ్య దూరం కూడా తగ్గుతుంటుంది. అదే విధంగా మనమొక్కలో కూడా వంపుల మధ్యదూరం పోను పోను ఆటోమాటిక్‌గా తగ్గుతూ ఉండాలి.

కేస్కేడ్ ని రూపొందించే విషయంలో చైనీయుల అభిరుచికి, జపానువారి అభిరుచికి తేడా ఉంది. చైనీయుల కేస్కేడ్ లో ఒకే కాండం ఉంటుంది. జపాన్‌వారి కేస్కేడ్ లో తోకల్లా పెరిగే కొమ్మల సంఖ్య అధికంగా ఉంటుంది. కాండపు దృఢత్వం, వంపుసొంపులు, కొమ్మల అందచందాలు ప్రస్ఫుటంగా కనిపించాలంటే నామటుకు నాకు చైనీయుల పద్ధతే బాగున్నట్లనిపిస్తుంది.

ఇప్పుడు కొమ్మల అమరిక ఎలా ఉంటుందో చూద్దాం! కేస్కేడ్ విధానంలో మొక్కను తలభాగం, తోకభాగం ఉండేలా పెంచుకోవచ్చు. తలలేకుండా జాలువారే తోక మాత్రమే ఉండేలానూ పెంచుకోవచ్చు. అందుకే ముందు మనం ఏతరహా కేస్కేడ్ ని రూపొందించదలచుకున్నామో నిశ్చయించుకోవాలి.

తలఉన్న మొక్కను పెంచదలచుకుంటే దాన్నెలా మలచాలో ముందు చూద్దాం! అప్‌రైట్ విధానాల్లో మొక్కను మలచేటప్పుడు క్రిందకొమ్మలతో ప్రారంభించి క్రమంగా పైకి వెళ్లాం గదా! కాని ఇక్కడ ముందుగా పైన ఉండే కొమ్మతో ప్రారంభించి క్రమంగా క్రిందకు వెళ్ళాలి.

కుండీలో కాండం కొంచెం ఎత్తువరకు పెరిగాక దాన్ని ఒక ప్రక్కగా క్రిందివైపుకు వంచాలని ఇంతకుముందే చెప్పుకున్నాం గదా! ఇది మొదటి వంపు. సహజంగా ప్రతివంపుకీ అభిముఖంగా ఒక కొమ్మ ఉంటుంది. ఈ మొదటి వంపు క్రిందికి ఉంటుంది గనుక దానికి అభిముఖంగా వచ్చే మొదటికొమ్మ పైవైపుకు పెరుగుతుంది. ఇదే మొక్కకు తలభాగం అవుతుంది. ఎత్తైన పర్వతం పైనుండి మహోధృతంగా క్రిందికి దూకే జలపాతంలో చిందే నీటితుంపరలు పొగలా ఎగజిమ్ముతాయి. అవి పర్వతశిఖరాన్ని మేఘశకలంలా ఎలా కమ్ముకుని ఉంటాయో కేస్కేడ్ తలభాగం కూడా అలా ఉంటుందని చైనీయులు అభివర్ణిస్తారు.

ఇంత అందంగా అమరిన ఈ తలకొమ్మ మరీ ఎత్తుగా పెరగకుండా జాగ్రత్త తీసుకోవాలి. దీనికి ఉన్న చిన్నిరెమ్మలు, ఆకులు దట్టంగా పెరిగే ఒక గోపురంలా కనపడాలి. మొక్కకు ఈ తలభాగం అందాన్నివ్వడమే గాక చెట్టును బేలెన్స్ చెయ్యడానికి కూడా ఉపయోగపడుతుంది.

తలభాగం అలాపైకెళ్ళాక ఇంక మిగిలిందంతా తోకభాగమే ! ఈ తోకభాగంలో తిరిగే మొదటి వంపు కుండీ అంచువైపుకు ఉంటుంది. ఈ వంపుకి అభిముఖంగా వచ్చిన కొమ్మ క్రింది



కొమ్మలన్నింటి కంటే ధృఢంగాను, పెద్దది గాను ఉంటుంది. ఈ కొమ్మ కుండీ అంచుకు దాదాపు సమాంతరంగా పెరుగుతుంది. (ఇది చదువుతుంటే గజిబిజిగా అనిపించినా బొమ్మ చూస్తూ చదివితే ఇదంతా తేలికగానే అర్థమవు తుంది)

తోకభాగం క్రిందికిపోయినకొద్దీ కుండీకి అభిముఖంగా వచ్చిన కొమ్మలు కాస్త బలంగా పొడవుగా పెరుగుతాయి. వంపుకి వంపుకి మధ్య ఉన్న కాండభాగంలో వచ్చిన కొమ్మలు కాస్త చిన్నగాను, ఒకింత ముందువైపుకు వాలి ఉంటాయి. ఈ చిన్ని కొమ్మలు అప్‌రైట్ విధానంలోని వెనక కొమ్మల వంటివన్నమాట!

ఈ విధానంలో దాదాపు మొక్కంతా ఒకవైపుకు జాలువారుతుంటుంది గదా! అలా ఒకవైపుకే ఉన్న చెట్టు బరువును బేలెన్స్‌చేస్తూ తోక భాగానికి అభిముఖంగా ఉన్న ఉపరితలపు వేళ్ళు చెట్టును లాగిపడుతూ మట్టిలోకి చొచ్చు కుపోతాయి. తోకభాగం ఉన్నవైపు వేళ్ళు చెట్టు వాలిన భారానికి అణిగి ముడుచుకుంటాయి గనుక లావుగా ఉబ్బిఉంటాయి.

ఫుల్ కేస్కేడ్ ని ఫార్మల్ ఫుల్ కేస్కేడ్ , ఇన్‌ఫార్మల్ ఫుల్ కేస్కేడ్ , క్లిఫ్‌హేంగింగ్ కేస్కేడ్ - ఇలా రకరకాలుగా మలచుకొని పెంచుకోవచ్చు. ఫార్మల్ ఫుల్ కేస్కేడ్ లో మొక్కలోని తల అగ్రభాగం, తోక కొనభాగం ఒకే నిలువుగీతలో ఉంటే దాన్ని ఫార్మల్ ఫుల్ కేస్కేడ్ అని, తోకకొన ప్రక్కకు వెళ్ళిపోతే దాన్ని ఇన్‌ఫార్మల్ ఫుల్ కేస్కేడ్



**పటం 70 :కేస్కేడ్‌లో కొమ్మవాలి పెరిగిన వైపు వేళ్ళు ముడుచుకుంటాయి. రెండవ వైపు నిగడదన్ని చెట్టు పడిపోకుండా ఆపుతాయి**



పటం 71

ఇన్ ఫార్మల్ కేస్కేడ్ ఫార్మల్ కేస్కేడ్

అని అంటారు. క్లిఫ్ హేంగింగ్ స్టైల్లో అసలు తలభాగం ఉండదు. ఉన్న కొమ్మలు, ఆకులూ కూడా ఈసురు మంటూ ఉంటాయి. ప్రతికూల వాతావరణంలో చెట్టు ఎదుర్కొన్న కష్టాలకు నిదర్శనంగా చీలినకాండం, ఎండినకొమ్మలు, ఊడిపోయిన బెరడు మనకు దర్శనమిస్తాయి. ఈ ఎఫెక్ట్స్ మనం బోన్సాయ్‌లో చూపడానికి జిన్, షారీ (Jin and Shari) లాటి టెక్నిక్స్‌ని ఉపయోగించుకోవచ్చు.

ఫుల్ కేస్కేడ్ కి ఉపయోగించే కుండీలు మధ్యస్థమైన లోతున్నవిగాని, సన్నగా ఎక్కువ లోతు గలిగి ఉన్నవిగాని అనువుగా ఉంటాయి.



# పటం 72 : క్లిఫ్ హాంగింగ్ కేస్కేడ్



సన్నగా లోతుగా ఉన్న కుండీలు పైనుండి క్రిందికి వేళ్ళాడుతూ పెరిగే మొక్కను స్థిరంగా నిలిపి ఉంచడానికి బాగా తోడ్పడతాయి గనుక సాధారణంగా వీటినే ఉపయోగిస్తుంటారు - ఇందులో మొక్క, కుండీ ఒకదాని కొకటి సమతూకంగా ఉండి చూడడానికి అందంగా ఉంటుంది.

ఈ విధానంలో మొక్కను నాటడంలో కూడా ప్రత్యేక శ్రద్ధ చూపాలి. మొక్కవాలినవైపుకి అంచుకు దగ్గరగా మొక్కను నాటగూడదు. ఒకవైపుకు వాలిన మొక్క బరువును ఆపడానికి అనువుగా మొక్క వాలిన అంచుకు అభిముఖంగా ఉన్న అంచుకు దగ్గరగా గాని, కుండీ మధ్యలో గాని నాటుకోవాలి.

ఫుల్ కేస్కేడ్ లో తోకభాగం కుండీ క్రిందిభాగాన్ని దాటుకుని ఇంకా క్రిందికి పెరిగి



తేనే అందంగా ఉంటుంది. తోక కొన, కుండీ క్రిందిభాగం మరీ సమాంతరంగా ఒకే లెవెల్ లో ఉండకుండా జాగ్రత్తపడాలి. అలా ఉంటే చెట్టు అందంగా కనిపించదు. మొక్క ఉన్న కుండీని స్టాండు మీద పెట్టినప్పుడు కుండీ పూర్తిగా స్టాండులో దిగబడకుండా బాగా ఎత్తుగా ఉండేలా చూడాలి. అలా ఎత్తుగా ఉన్న కుండీలో నుండి ప్రక్కకు జాలువారుతూ, కుండీని, స్టాండు అంచును కూడా దాటు కుంటూ క్రిందికి పెరిగిన బోన్సాయ్ 'కేస్కేడ్' పేరుకు తగినట్లుగా మనోహరంగా కనిపిస్తుంది.

ఎక్కువలోతు ఉన్న కుండీల్లో కేస్కేడ్ లను పెంచేటప్పుడు మనకో చిక్కు ఎదురౌ తుంది. లోతు ఎక్కువగా ఉండడంతో పోసిన నీళ్ళు అడుగుకివెళ్ళి అక్కడి మట్టి నుద్దనుద్దగా ఉంటుంది - పైభాగమేమో పొడారి పోతుం టుంది. అలాగని నీళ్ళు తక్కువ పోస్తుంటే అవి క్రిందికల్లా దిగకపోవడంతో వేళ్ళకు సరిగా నీళ్ళందవు. ఈ సమస్యకు పరిష్కారం కుండీలో సగంపైవరకు ఇసుకనుగాని, బాగా బరక మట్టిని గాని పోసి ఆపైన మామూలు మట్టిని పొయ్యడం! ఆ మట్టిలో కూడా మామూలు తొట్లలో పోసే మట్టికంటే ఇసుక మరి కాస్త ఎక్కువ కలపాలి.

కుండీలో నుండి నీళ్ళుపోయే రంధ్రాలు కాస్త పెద్దవిగా ఉండేలా చూచుకోవాలి.

ఈ పద్ధతిలో బోన్సాయ్‌లను పెంచదల చుకున్నప్పుడు మొక్క ఎన్నికలో మరింత శ్రద్ధ చూపాల్సిఉంటుంది.

ఈ శైలిలో మొక్కను పెంచేటప్పుడు కాండాన్ని మాటి మాటికి వంచుతుంటాం గనుక అలావంచినప్పుడు విరగకుండా ఉండే మొక్క రకాలనే మనం ఎంచుకోవాలన్నమాట. ఈ మొక్కల ఆకులు ఎంతచిన్నగా ఉంటే అంత అందంగా ఉంటుంది.

క్రాసులా, చింత, జూనిపర్ వంటి మొక్కలు కేస్కేడ్ విధానానికి అనుకూలంగా ఉంటాయి.

## *లిటరటీ శైలి (Bunjingi)*
## *Literati Style*

చైనాలో బాగా చదువుకున్నవాళ్ళు, మేధావులు, చెట్టురూపురేఖల్లో కూడా మానవ జీవన సౌందర్యాన్ని, వేదాంతాన్ని చదవగలిగిన భావుకులు ప్రవేశపెట్టిన పద్ధతి ఇది. అందుకే దీనికాపేరు!

లిటరటీ పద్ధతిలో విశాలమైన ఎడారిలో కాలం ఆటుపోటులకు తట్టుకుని స్థిరంగా నిలబ డిన ఏకాకిలా ఒకే ఒక్క చెట్టు ఉంటుంది. ఆ చెట్టును చూడగానే జీవితంలో ఎడతెరిపిలేని కష్టాలను భరిస్తూ రాటుదేలిన మనసుతో బక్క చిక్కి, ఒడిలి, ముడతలు బడ్డ శరీరంతో, అనుభవాల సారంతో నిలచి ఉన్న మానవుడు స్ఫురిస్తాడు.



## పటం 73 : లిటరటీ



మొదలు దృఢంగా లేకపోయినా ఉన్నం తలో తీరుగా కొనదేలుతూ పోయిన కాండం; వయసును సూచిస్తూ చారికలు, పగుళ్ళతో కూడిన బెరడు, కొసమెరుపులా కాండం చివర ఉండీ ఉండనట్లుగా రెండో, మూడో కొమ్మలు - ఇదీ లిటరటీ ఆకారం!

లిటరటీకి మనం మామూలుగా బోన్సాయ్ పెంపకంలో పాటించే నియమాలేవీ వర్తించవు. అంతేకాదు. ఆ పద్ధతులన్నింటికీ విరుద్ధంగా ఉంటుందీ మొక్కను మలచే తీరు! కాండం టాపర్‌గా ఉండాలిగాని దృఢంగా ఉండగూడదు. పైకిపోయిన కొద్దీ క్రమంగా సన్నబడే ఈ చెట్టు ఇతర పద్ధతుల్లోని మొక్కల్లాగా కొమ్మలు, ఆకులతో కళకళలాడుతూ



ఉండగూడదు. కాండంలో ఎక్కువభాగం అసలు కొమ్మలు ఉండనే గూడదు. మిగిలిన పద్ధతుల్లో (ఒక్క గాలివాలుపద్ధతిలో తప్ప) కొమ్మలు కాండాన్ని దాటుకుంటూ ఒకవైపు నుంచి మరో వైపుకి వెళ్ళగూడదు. ఈ లిటరటీ లోకూడా గాలివాలు శైలిలోలా కొమ్మ కాండాన్ని దాటుకుంటూ వెళ్ళవచ్చు. నామ మాత్రంగా ఉన్న కొమ్మలు భారీగా ఉండ కుండా నేడో రేపో రాలిపోతాయా అన్న భ్రమ కలిగించాలి.

''కొమ్మలు లేకుండా ఆకులు లేకుండా ఎండిన మోడు లాంటి మొక్కలో అందమే ముంటుంది'' అని మనకనిపించవచ్చు. పండు టాకులాటి వయోవృద్ధుల్లో జీవితాన్ని తరచి చూచిన తేజస్సు మనకు ప్రస్ఫుటంగా కనిపి స్తుంటుంది. అదిగో - అలాటి అందమే ఈ లిటరటీలో మనం చూడగలం!

మామూలు పద్ధతుల్లో కాండం మొదలు నుండి 3 వ వంతు ఎత్తులో కొమ్మలు మొదల వ్వాలని గదా మనం అనుకుంటాం! కాని లిటర టీలో కాండం కొన భాగం నుండి - అంటే పైనుండి క్రిందికి 3వ వంతు ఎత్తువరకూ మాత్రమే కొమ్మలు, ఆకులు ఉంటాయి. ఆ క్రిందిభాగం కాండం మొత్తం ఆకులు, కొమ్మలు లేకుండానే బోసిగా ఉంటుందన్నమాట!

ఇలా బోన్సాయ్‌కి ఉండవలసిన ప్రత్యేక లక్షణాలేవీ ఈ పద్ధతిలో ఉండవు గనుకనే దీనిని ''ఏ లక్షణమూ లేని విలక్షణమైన శైలి'' అంటారు.

మొక్క నిలువుగా పెరిగినా, వంపులు తిరిగినా, వాలుగా పెరిగినా మొక్కను చూడ గానే ముదిమితో ముడతలు పడినట్లుగా మనకు అనిపించాలి. ఈ ఎఫెక్టు బాగా కనిపించాలంటే ఈ పద్ధతిలో పెంచదలచుకున్న మొక్కను ఎంచుకోడంలోనే శ్రద్ధ వహించాలి. ఆ చెట్టు కాండం, బెరడు, ఆకులు అన్నీ దీనికి అనుకూ లమో కాదో ముందే పరిశీలించాలి.

చెట్టు వయసును ఎక్కువగా చూపే బెరడు, సన్నని ఆకులు ఉండే బోటిల్ బ్రష్, చైనా బాక్స్, సర్వి, చింత, వేప, కరివేప మొదలైన రకాలు ఇందుకు అనువుగా ఉంటాయి.

సిద్ధాంతరీత్యా లిటరటీ పద్ధతిలో ఒకే ఒక్క చెట్టు ఉండాలి అనే నియమం ఉన్నా ఉత్సాహవంతులు లిటరటీ శైలిలో కూడా కేస్కేడు, Bowed Head, Two Tree Setting మొదలైన విధానలను కూడా కలిపి పెంచు తుంటారు.

ఈ పద్ధతికి లోతు మధ్యస్థంగా ఉండి గుండ్రం, చదరం, షడ్భుజాకారం, అష్టభుజా కారం - ఇలా ఏ ఆకారంలో ఉన్నా అన్నివైపుల సమంగా ఉన్న కుండీలను ఉపయోగిస్తే బాగుం టుంది.



## కాండం చుట్టలు చుట్టు కుంటూ పెరిగే విధానం:

## (Coiled and Twisted Trunk) (Bankan)

అడుగడుగునా మార్గంలో అవరోధాలను ఎదుర్కొంటూ దానికనుగుణంగా తమ జీవన గమనాన్ని మలచుకుంటూ పెరిగే మొక్కలకు ప్రతీకలు ఇవి.

కొండల్లోను, గుట్టల్లోను సాఫీగా పెరగలేక మొక్కల కాండాలు మెలిదిరిగిపోయి పెరగడం మనం చూస్తుంటాం! ఆ ఒరిపిడికి కాండం మొరటుదేలి పోతుంటుంది (Crooked). బెరడు పెట్లి పోయి ఉంటుంది.



పటం 74 : కాండం చుట్టలు చుట్టుకుంటూ పెరిగిన చెట్టు



ఈ శైలిలో పెంచే మొక్కల్లో కాండానికే అధిక ప్రాధాన్యత నివ్వాలి. మూడుకొమ్మల వలయసిద్ధాంతం అనుసరించగలిగితే మంచిదే! కాని సహజత్వానికి భిన్నంగా ఉంటుంది అని పించినప్పుడు ఖచ్చితంగా పాటించాలని నియ మమేమీలేదు.

ఈ విధానంలో పెంచదలచుకున్న మొక్కలను ఎంచుకోవడంలో కొంత విజ్ఞత అవసరం. ఈ మొక్కలు ప్రతికూల పరిస్థితు లను తట్టుకుని పెరగగలిగే జాతులై ఉండాలి. వీటి కాండాలను చాలా మొరటుగా మెలిదిప్పు తుంటాం గనుక అవి అందుకనువుగా కూడా ఉండాలి.

ఈ విధానంలో మొక్కను మలచడానికి చాలా ఎక్కువకాలం పడుతుంది. అందుకే మొక్కను 4, 5 సంవత్సరాలపాటు - అంటే శిక్షణ కాలమంతా నేలలోగాని, పెద్దకుండీలో గాని పెంచడం అవసరం! మొక్క ఒక సంవత్స రంపాటు పెరిగాక మనం కోరుకున్న విధంగా కాండాన్ని వంచి మలచడం ప్రారంభించవచ్చు. గట్టిపుల్లలను పాతి పటంలో చూపినట్లుగా అంచెలంచెలుగా మెలి దిప్పుతూ పోవాలి. మెలిక లన్నీ ఒక్కసారి తిప్పడంగాక మధ్యలో 6నెలల నుండి సంవత్సరం వరకు వ్యవధి నివ్వాలి. అలా చేస్తే మొక్కకి తట్టుకునే శక్తి ఉంటుంది - తిప్పిన మెలికలు కదల్చకుండా ఉండడంతో చక్కగా స్థిరపడుతుంటాయి.

కాండాన్ని మెలిదిప్పదలచుకున్న రోజు మొక్కకు సాధ్యమైనంత తక్కువ నీళ్ళు పోస్తే మంచిది. కాండంలో నీరు తక్కువుంటే అది తేలిగ్గా సాగి మెలి దిరుగుతుంది.

ట్రైనింగ్‌లో ఉన్న 4, 5 సంవత్సరా ల్లోను సంవత్సరాని కొకసారి మొక్కను కుండీ లోనుండి తీసి, వేళ్ళు కత్తిరించి మళ్ళీ నాటు తుండాలి. మనం కోరుకున్న ఆకారం సంపూ ర్ణంగా వచ్చిందనిపించినప్పుడు బోన్సాయ్ కుండీలోకి మార్చుకోవచ్చు.

ఈ శైలిలో పెరిగే మొక్కల కాండాలు బలిష్ఠంగా మెలిదిరిగి ఉంటాయి గనుక వీటిని పెట్టే కుండీలు మరీ లోతు తక్కువగా గాక సుమారైనలోతులో ఉంటే మంచిది. దీర్ఘచతుర స్రాకారం, అండాకారం, చతురస్రం, గుండ్రం - ఈ ఆకారాలన్నీ బాగుంటాయి.

## విసనకర్ర విధానం
## (Broom Style)
## (Hokidachi)

ఈ విధానంలో పెరిగే మొక్క ఆకారం ఎలా ఉంటుందో పేరులోనే తెలుస్తోంది గదా! కాండం మొదలు లావుగా ఉండి కొంత ఎత్తువ రకు (సుమారు 1/3 వ వంతు) పెరిగాక దాదాపు ఒకే చోటునుండి రెండుగాని, మూడు గాని కొమ్మలు బయల్దేరుతాయి. అవి చిరుకొ మ్మలు, రెమ్మలుగా చీలి విసన కర్రలా విస్తరి స్తాయి. మొత్తానికి కొమ్మలన్నీ కలిపి చెట్టుపైన ఒక డోమ్‌లా ఏర్పడతాయన్నమాట!



## పటం 75 : విసనకర్ర విధానం (Broom Style) లో పెరిగిన మొక్క



ఈ విధానంలో మొక్క కాండం చాలా దృఢంగా మొదలైపైకి వెళ్ళే కొద్దీ క్రమంగా లావు తగ్గుతుంది. కాండంలో ఎక్కడా వంపనేది ఉండగూడదు.

చెట్టు ఎత్తులో సుమారు 2/3 వ వంతు గాని, సగంగాని కాండం పెరిగాక దాదాపు ఒకే చోటులో రెండుగాని, మూడుగాని కొమ్మలుండాలి. ఇవి చెట్టుకుడివైపున ఒకటి, ఎడమవైపున ఒకటి వెనుక ఒకటి ఉండాలి. అవి పొడవుగా పెరిగాక వాటినుండి వచ్చే చిరుకొమ్మలు, రెమ్మలు విస్తరించేలా పెంచాలి. కొమ్మలకు రాగితీగ చుట్టి షేప్ చేసుకోవచ్చు. కొమ్మలు ఎట్టిపరిస్థితుల్లోను ఒకదాన్నొకటి దాటుకుంటూ పెరగగూడదు.



పటం 76 : విసనకర్రి విధానం (Broom Style) లో మొక్కను మలచడం













ఉపరితలపువేళ్ళు కాండం చుట్టూ (ముందువైపు తప్ప) సమంగా విస్తరించి ఉండాలి. వేళ్ళలో ఎక్కడా వంపులేకుండా మొదలు లావుగా ఉండి పోనుపోను సన్నబడతూ కొనలు భూమిలోకి చొచ్చుకొని ఉండాలి.

ఇంత తీరైన ఆకారంలో మొక్కను రూపొందించడం అంత సులభమేమీకాదు. కొన్నేళ్ళపాటు ఓపిక పట్టగలిగితే విత్తనం నాటి మొలిపించిన మొక్కను ఈ పద్ధతిలో చక్కని బోన్సాయ్‌గా తీర్చిదిద్దుకోవచ్చు.

మనం విత్తనం నాటితే మొలిచే మొక్కలన్నీ వినసకర్రి శైలిలో బోన్సాయ్‌ని తయారు చెయ్యడానికి అనువుగా ఉండవు. కాస్త అనువుగా ఉన్నాయనుకున్న మొక్కలను పీకి ఒక్కోదాన్ని ఒక్కో మామూలు కుండీలో నాటుకోవాలి. రెండుమూడు నెలల తరువాత మొక్క యొక్క తల్లివేరును కత్తిరించి పైవరున ప్రక్క వేళ్ళను చెట్టు చుట్టూ పరచుకునేలా మలచి మళ్ళీ కుండీలో నాటాలి.

మొక్క ప్రక్కన ఒక బద్దను పాతి కాండాన్ని దానికి కలిపి కడితే కాండం వంపు తిరగకుండా నిటారుగా పెరుగుతుంది. ఆరునెలలపాటు మొక్కను అలా కుండీలో పెరగనివ్వాలి. ఆ తరువాత వాటిని లోతులేని కుండీలోకి మార్చుకోవాలి. ఇలా మార్చేటప్పుడు వేళ్ళను ట్రిమ్ చేసి నాటుకోవాలి. ఇప్పుడింక తల భాగాన్ని షేప్ చేయడం ప్రారంభించాలి.

ఈ కొమ్మలు కొంతబలం పుంజుకునే వరకు పెరగనిచ్చి అప్పుడు వాటిని కత్తిరించాలి. వీటి పొడవు నేలమీద నుండి కొమ్మలు వచ్చేవరకు కాండం ఎంత ఎత్తు ఉంటుందో ఆ ఎత్తులో సగం ఉంటే బాగుంటుంది. ఇంక అక్కడి నుండి కొమ్మలకు సన్నని రెమ్మలు రావడం ప్రారంభిస్తాయి. కొమ్మలకు రాగితీగ చుట్టి వాటిని ఎటుబడితే అటు పెరగనివ్వకుండా ఒక వినసకర్రి ఆకారం వచ్చేలా మలచాలి. కొమ్మల మీద వచ్చిన రెమ్మలు, ఆకులు ఆకారంలో పొసగనట్లుంటే ఎప్పటికప్పుడు వాటిని గిల్లేస్తుండాలి. వినసకర్రిలా విస్తరించిన పైభాగం మొత్తం గుండ్రంగా ఒక డోమ్‌లా పెరుగుతుంది. ఆ తరువాత కూడా డోమ్‌దాటి పైకి పెరిగే ఆకులను ఏమరపాటు లేకుండా ట్రిమ్ చేసుకుంటూ ఉండాలి.

తల్లివేరును కత్తిరించాక ప్రక్కవేళ్ళు చెట్టు చుట్టూ విస్తరించేలా మలచుకొని అవి బలంగా తయారయ్యేవరకు లోతుగల తొట్టిలోగాని, భూమిలోగాని పెరగనివ్వడం మంచిది. చెట్టుకు చక్కటి షేప్ వచ్చిందని తృప్తిపడ్డాక ఆ వేళ్ళను పైకితీసి అందంగా చెట్టు చుట్టూ పరచుకుని పెరిగేలా సర్దాలి.

ఇలా చిన్ని మొక్కనుండి వినసకర్రిలా బోన్సాయ్‌ని పెంచడానికి ఓపిక పట్టలేని వాళ్ళు నర్సరీనుండో, మరో చోటనుండో సంపాదిం



చిన మొక్కను ఈ విధానంలో పెంచడానికి ప్రయత్నించవచ్చు.

దృఢంగా నిటారుగా ఉండి బలమైన, తీరైన ఉపరితలపు వేళ్ళున్న మొక్క మనకు దొరికితే దాన్ని వినసకర్రిలా మలచడానికి ప్రయత్నం చేయవచ్చు. అయితే ఈ మొక్క ఒక్క కొమ్మకూడా లేకుండా కాండాన్ని తెగనరికినా, ఆ నరికిన చోటునుండి క్రొత్త చిగుళ్ళు పుట్టే మొండి మొక్కై ఉండాలి. అలాటి మొక్కను తీసుకొని చెట్లు చిగిర్చే కాలానికి కొంచెం ముందుగా మనకు కావలసిన ఎత్తులో V ఆకారం వచ్చేలా కత్తిరించాలి. ఆ గాటు చుట్టూ చిగుళ్ళు వచ్చాక వాటిలో మనకు కావలసిన మూడు చిగుళ్ళను ఉంచుకొని మిగిలిన వాటిన తుంచేయాలి. ఈ మూడు చిగుళ్ళే ప్రధానమైన మూడు కొమ్మలుగా పెరిగి రెమ్మలు, ఆకులతో చెట్టును వినసకర్రిలా తయారుచేస్తాయి.

కాండాన్ని కత్తిరించేటప్పుడు వేళ్ళను కత్తిరించడం ఎట్టిపరిస్థితుల్లోను మరచి పోగూడదు.

విత్తనం నాటి మొలిపించిన మొక్కను ఉపయోగించినా, పెద్ద మొక్కను కత్తిరించి మలచుకున్నా మొదట్లో ఎక్కువకాలం పాటు పెద్ద కుండీలో మొక్కను పెంచుకుంటే కాండం, కొమ్మలు, వేళ్ళు కూడా తక్కువ కాలంలోనే దృఢంగా తయారవుతాయి.

లోతులేకుండా గుండ్రంగా గాని, అండాకారంగా గాని ఉన్న కుండీలు ఈ విధానానికి అనుకూలంగా ఉంటాయి.

వినసకర్రి లేదా తెరచిన గొడుగు ఆకారం బోన్సాయ్‌ని పెంచడానికి పెల్టోఫాం, పెద్దఉసిరి, చింత లాటి ఆకురాల్చే చెట్లరకాలు అనువుగా ఉంటాయి. ఆ చెట్లు ఆకులను పూర్తిగా రాల్చినపుడు వినసకర్రిలా విస్తరించిన కొమ్మల, రెమ్మల అందం మరింత స్ఫుటంగా కనిపిస్తుంది.

## *గాలి వాలు పద్ధతి*

## *(Wind Swept Style)*
## *(Fukinagashi)*

ప్రకృతిలోని సాధారణ తత్వాన్ని గాక ప్రత్యేకతను ప్రతిబింబించే ఈ గాలువాలుపద్ధతి (Wind Swept Style) లో పెరిగిన బోన్సాయ్ చూడడానికి ఎంత అద్భుతంగా ఉంటుందో, ఆ చెట్టునలా మలచడం అంత కష్టసాధ్యం!

సముద్రతీరాల్లోను, అనుక్షణం గాలి ఒకవైపుకే విసురుగా వీచే ప్రాంతాల్లోను పెరిగే చెట్ల ఆకారాలు పూర్తిగా మారిపోయి ఉంటాయి. చెట్టుకు అన్నిప్రక్కలకు వ్యాపించి ఉండవలసిన కొమ్మలన్నీ గాలి వాలు వైపుకే మెలిదిరిగిపోయి ఉంటాయి. కొన్ని కొమ్మలు విరిగిపోయి, కొన్ని చీలిపోయి ఉంటాయి. కళకళలాడుతూ, గుబురుగా ఉన్న ఆకులు



## పటం 77 : గాలి వాలు పద్ధతిలో పెరుగుతున్న బోన్సాయ్



చూద్దామన్నా కనిపించవు. గాలి తాకిడికి రాలి పోయి, రంగుమారిపోయి ఉంటాయి. కొన్ని చెట్లు ఒకప్రక్కకు పూర్తిగా వాలి, వేళ్ళుకూడా పెళ్ళగించుకు వచ్చి కనిపిస్తుంటాయి. కొన్ని నిటారుగా నిలబడే ఉంటాయిగాని వాటికొ మ్మలు, ఆకులు పూర్తిగా ఒకవైపుకు తిరిగిపోయి ఉంటాయి. ఇన్ని ప్రత్యేకతలను చూపుతూ బోన్సాయ్‌ని రూపొందించడం కష్టమే అయినా అసాధ్యం మాత్రం కాదు.

ఫార్మల్, ఇన్‌ఫార్మల్ అప్‌రైట్లను, ఏట వాలుగా పెరిగే మొక్కలను, సెమీ కేస్కేడ్ మొక్కలను, లిటరటీ విధానంలో పెరిగే మొక్కలను ఈ గాలి వాలు పద్ధతిలోకి మలచు కోవచ్చు. అయితే కొమ్మ, కాండం, ఆకులు, ఉపరితలపు వేళ్ళు అన్నీ ఆ విధానాల్లో ఉన్నట్లే ఇందులోనూ ఉంటాయి. కాకపోతే కొమ్మ లన్నీ ఒకవైపుకు తిరిగిపోయి ఆ వైపుకే భూమికి సమాంతరంగా పెరుగుతుంటాయి.



మనం ఇంతవరకు చెప్పుకున్న విధానాల న్నింటిలో లాగే ఇందులోనూ కాండం మొదలు దృఢంగా ఉండి పోనుపోను సన్నబడి చివరికి కొనదేలు తుంది. కొమ్మల అమరిక మౌలిక మైన 'వలయసిద్ధాంతానికి' లోబడే ఉంటుంది. కొమ్మల అడుగుభాగం ఆకులులేకుండా కొమ్మల తీరును స్పష్టంగా కనబరుస్తూ ఉంటుంది. ఎటొచ్చీ కొమ్మవాలూ, అది పెరి గిన తీరూ గాలి వాలును సూచించేలా ఉండాలి.

కాండం నిర్మాణంలో గాని, వంపుసొం పుల విషయంలోగాని చెట్టు ఏశైలిలో పెరుగు తుంటే ఆశైలికి అనుగుణంగానే ఉంటుంది. లిటరటీలో తప్పించి మామూలుగా ఏ బోన్సాయ్ పద్ధతిలోనూ కొమ్మలు కాండాన్ని దాటుకుంటూ వెళ్ళకూడదనుకున్నాం గదా! గాలివాలు పద్ధతిలో ఆ నిబంధనకు సడలింపు ఉంది. అంటే కొమ్మలు కాండాన్ని దాటవచ్చు. కాని సాధ్యమైనంత వరకు కాండం క్రిందిభా గంలో ఉన్న కొమ్మలు కాకుండా పైభాగంలో ఉన్నవి మాత్రమే అలా దాటితే బాగుంటుంది. ఒకవేళ తప్పనిసరిగా క్రిందివైపునే దాటవలసి వస్తే ఆ కొమ్మకాండాన్ని దాటి కొంతమేర పోయేవరకు ఆకులు లేకుండా చూడాలి. అప్పుడే కాండం అందం కప్పబడి పోకుండా ఉంటుంది.

నిరంతరం ఉధృతంగా వీచే సముద్రపు గాలి తాకిడికి గాలి తగిలే వైపున ఉండే కొమ్మల్లో చాలా వరకు విరిగిపోతాయి. ఒకవేళ ఉన్నా ఆవైపు కణాలన్నీ చచ్చుబడి పోయినట్లై కళ తప్పి ఉంటాయి. అవి మెలిదిరిగి కాండాన్ని దాటుకుంటూ రెండోవైపుకి సాగి గాలివాలు వైపు పెరుగుతుంటాయి. ఈ చెట్లలో ఉండే ఈ లక్షణాలను ఆధారంగా చేసుకొని కాండం దృఢంగా బోన్సాయ్‌కి పనికివచ్చేలా ఉండి, కొమ్మల అమరిక తీరుగా లేని మొక్కలేవైనా మనదగ్గరుంటే వాటిని గాలివాలు విధానంలోకి మలచుకోవచ్చు. ఉన్న కొమ్మలన్నిటినీ అలా ఒకవైపుకి మలచుకోగలిగితే అది చక్కటి బోన్సాయ్‌గా రూపుదిద్దుకుంటుంది.

ఇంక వేళ్ళ సంగతి కొస్తే ఈ విధానంలో పెరిగే మొక్కకి బలమైన ఉపరితలపు వేళ్ళ అవసరం మరింత ఎక్కువగా ఉంటుంది. బల మైన గాలితాకిడిని తట్టుకుంటూ చెట్టు ఏళ్ళత రబడి నిలచి మనుతోందంటే దాన్నలా నిలపగ లిగేశక్తి ఉన్న ఉపరితలపు వేళ్ళే అందుకు కారణం! చెట్టు ఒకవైపుకి వాలినప్పుడు కొన్ని చెట్ల వేళ్ళు పెళ్ళగించుకు వస్తాయి. అవి అలా కనబడ్డా చెట్టు మనం భయపడినట్లుగా ఆరోజో, మరురోజో కూలిపోదు. లాగిపట్టి ఉంచిన వేళ్ళు దాన్ని పడిపోకుండా అలానే ఉంచుతాయి. అలాగే మన బోన్సాయ్‌లో కూడా అలాటి ఎఫెక్టు వచ్చేలా చెట్టును వాల్చి వేళ్ళు ఒకవైపున పైకి లేచివస్తున్నట్లు అమర్చి పెంచుకోవచ్చు. అయితే ఏ ఆధారం లేకుండా



ఆ వేళ్ళకొనలు గాలిలో తేలుతున్నట్లుగా వదల కూడదు. తప్పనిసరిగా ఆ వేళ్ళ ఎత్తువరకూ మట్టి ఉండి తీరాలి. ఆ మట్టి ఒక గుట్టలాగాక గాలి ఒరిపిడికి కొంత కొట్టుకు పోయినట్లు ఉంటే మరింత సహజంగా కనిపిస్తుంది.

మన అభిరుచిని, సృజనాత్మకతను బట్టి ఈ గాలివాలు పద్ధతినే రకరకాలుగా తీర్చిదిద్ద వచ్చు.

గాలితగిలే వైపు కొమ్మలు అసలులేనట్లు చూపించదలచుకుంటే ఆ చెట్టు కాండం నిటారుగా ఉండకుండా వాలినట్లు, వంపులు తిరిగినట్లు, ఆ వంపులు కోణాకృతిలో ఉండేటట్లు మలచుకుంటే బాగుంటుంది.

గాలి తాకిడికి కొమ్మలు విరిగిపోయినట్లు, బెరడు చీలిపోయినట్లు భ్రమింపచేయడానికి జిన్, షారి వంటి టెక్నిక్స్‌ని కూడా ఉపయోగించవచ్చు.

కాండం వంపులు తిరిగి క్రిందివరుసల్లో కొమ్మలు లేకుండా ఎక్కడో పైకొనల్లో మాత్రం చిన్ని కొమ్మలుండే లిటరటీ శైలిలో ఆ నాలుగు కొమ్మలు గాలివాలు వైపు సాగుతున్నట్లు మలచి పెంచుకోవచ్చు.

ఒకే కాండంతో ఉన్న చెట్లనే గాలివాలుపద్ధతిలో పెంచుకోవాలనేం లేదు. ఒకే మొదలు నుండి వచ్చిన రెండుకాండాలు, మూడు కాండాలు ఉన్న చెట్లని, అడవిలో ఒక భాగాన్ని



పటం 78 : గాలివాలు పద్ధతిలో పెరుగుతున్న మొక్కల సముదాయం



చూపుతున్నట్లుండే (గ్రూప్ సెట్టింగ్‌లో కూడా ఈవిధానాన్ని అనుసరించవచ్చు).

లోతు తక్కువగా ఉన్న కుండీలు ఈ గాలివాలు పద్ధతి విధానానికి అనువుగా ఉంటాయి. అవి ఏ ఆకారంలో ఉన్నా బాగానే ఉంటాయి. సెమీకేస్కేడ్ విధానంలో గాలివా లుపద్ధతిని పెంచినప్పుడు మాత్రం కాస్త ఎక్కువ లోతు ఉన్న కుండీలు అవసరం.

ఈ విధానంలో చెట్టు పెరిగే సహజ వాతావరణాన్ని చూపేందుకు చెట్టును ఒకపల కలాటి రాతిమీద సెట్ చేసి పెంచవచ్చు. కొన్ని రాళ్ళమధ్యగా పెరుగుతున్నట్లు చూపవచ్చు. ఒక చెట్టున్నా, చెట్లు గుంపుగా ఉన్నా అవి గాలివాలువైపుకు వీస్తున్నట్లు - దానికి దగ్గరలో కొన్ని కొండరాళ్ళున్నట్లు సెట్‌చేసి చెట్టుపె రిగే పరిసరదృశ్యాన్ని (Land Scape) చూపెట్టి నట్లైతే మరింత మనోజ్ఞంగా ఉంటుంది.

అన్నిరకాలుగాను అనుకూలపరిస్థి తుల్లో పెరుగుతున్న మొక్కకు చుట్టూపెట్టిన ట్లుగా ఈ మొక్క మొదట్లో దట్టంగా మాస్‌పెం చగూడదు. కాని అక్కడక్కడా కాస్తంత మాస్, ఇసుక, కొన్ని గులకరాళ్లు పరిస్తే సెట్టింగ్ మరింత సహజంగా ఉంటుంది.

ఇంక కుండీలో మొక్కనాటే స్థానం! కుండీ సుమారైన సైజులో ఉండి దాంట్లో ఒక ప్రక్కగా నాటిన మొక్క కుండీని దాటి గాలివా లువైపు సాగుతున్నట్లు పెంచుకోవచ్చు.

లేదా లోతుతక్కువగా ఉండి దీర్ఘచతుర ప్రాకారంగా ఉన్న పెద్దకుండీలో ఒకప్రక్కగా మొక్కను నాటితే అది ఆ ఖాళీ స్థలం వైపు కొమ్మలు చాచి పెరుగుతుంటే విశాలమైన తీర ప్రాంతంలో మొక్క పెరుగుతున్న ఎఫెక్టువ స్తుంది.

విశాలమైన కొమ్మలతో గుబురుగా పెరిగే ఆకులతో ఉండే చెట్లు ఈ విధానానికి ఏమాత్రం అనువుగా ఉండవు. సన్నని కొమ్మలు, చిన్న ఆకులు ఉన్న చెట్లు ఈ విధానానికి తగినట్లుగా ఉంటాయి. ఆకులు సన్నగా ఉండే సీమచింత, చింత చెట్లు సహ జంగా ఉంటాయి.

## ఉపరిభౌమిక వేళ్ళు
## *(Exposed Root Style)*
## *(Neagari)*

చెట్టు కాండం భూమి మీద, వేళ్ళు భూమి లోపల పెరగడం ప్రకృతి సహజం! కాని దీనికి విరుద్ధమైన లక్షణాలున్న చెట్లను కూడా అప్పుడప్పుడూ మనం చూస్తూనే ఉంటాం! భూమిలోపల పెరగవలసిన వేళ్ళు కాండంతో పాటు భూమిపైన కనిపించటం - రాళ్ళకు రప్పలకు అంటుకుని కాండంలో భాగంగా కలి సిపోవడం - ఇవన్నీ ప్రకృతి వింతలే కదా! వీటిని ఆధారం చేసుకుని రూపొందించినదే ఉపరి భౌమిక వేళ్ళ శైలి.



నీటి ఉరవడికి మట్టంతా కొట్టుకుపోయి బయటపడ్డ వేళ్ళులాగాను, కొండ చరియల్లో రాతిని పెనవేసుకుని పెరుగుతున్న మొక్క వేళ్ళులా-ఇలా 'ఉపరిభౌమిక వేళ్ళ శైలి' రకరకాలు. ప్రకృతి సిద్ధంగా ఏర్పడ్డ ఈ విధానాలకు మానవుడి మేధస్సుతోడై 'ఉపరిభౌమిక వేళ్ళ శైలి' అనేక విన్యాసాలు గా రూపొందింది.

ముందుగా వేళ్ళు ఒకదానికొకటి పెనవేసుకుని పెరిగే విధానాన్ని గురించి తెలుసుకుందాం!

మొక్క లేతగా ఉన్నప్పుడు కాండము, కొమ్మలలాగే వేళ్ళు కూడా ఎటు తిప్పితే అటు తిరుగుతాయి. అలాటి దశలో ఉన్న మొక్కలను రెండు మూడింటిని కలిపి మెలితిప్పిగాని లేదా జడలాగా గాని అల్లవచ్చు. అయితే అలా అల్లడానికి ముందుగా వేళ్ళను కొద్దిగా చెక్కి ఆ చెక్కిన భాగం ఒకదానికొకటి అతుక్కునేలా వాటన్నింటిని కలిపి దారంతో సున్నితంగా చుట్టాలి. ఇలా చుట్టిన భాగాన్ని లోతైన కుండీలో పెట్టి ఇసుక ఎక్కువ కలిపిన మట్టిని పొయ్యాలి. మొక్క పెరుగుతున్న కొద్దీ వేళ్ళన్నీ ఒకదానికొకటి అతుక్కుపోయి బలిష్టంగానూ, ప్రత్యేకంగానూ కనిపిస్తాయి.

ఇలా వేళ్ళు ఒకటిగా పెనవేసుకుపోవడానికి కనీసం రెండు, మూడు సంవత్సరాలైనా పడుతుంది. ఆ తరువాత క్రమేణా కుండీలో మట్టి లెవెల్ తగ్గించడం మొదలు పెట్టాలి. అంటే ఇప్పటివరకు పూర్తిగా మట్టిలో కప్పబడిన వేళ్ళు కొద్ది కొద్దిగా మట్టి మీద కనిపిస్తుంటాయన్నమాట. అలా మట్టిలో నుండి పైకి వచ్చిన వేళ్ళు స్థిరంగాను, నిటారుగాను నిలబడడానికి ఆసరాగా వెదురుబద్దలు పాతి వేళ్ళను ఈ బద్దలతో కలిపి కట్టాలి. మరి కొంతకాలానికి వేళ్ళు కాండంలా గట్టిపడి పోయి ఏ ఆధారం లేకుండానే స్థిరంగా నిలబడగల స్థితికి చేరుకుంటాయి. అప్పుడింక వెదురుబద్దల అవసరం ఉండదు.

ఇలా రూపుదిద్దుకున్న ఉపరిభౌమిక వేళ్ళ మీద క్రమంగా బెరడు కూడా ఏర్పడి ఏదివేరో, ఏదికాండమో కూడా తెలుసుకోలేని విధంగా మార్పుచెందుతాయి.

స్థిరంగా వేళ్ళను భూమ్మీద నిలబెట్టడానికి మరో పద్ధతి కూడా ఉంది.

పైన మనం చెప్పుకున్న విధానంలో రెండు మూడు వేళ్ళను కలిపి ఒకే దృఢమైన కాండంలా స్ఫురింప చేసే దెలాగో తెలుసుకున్నాం. ఇప్పుడీ పద్ధతిలో ఏ వేరుకావేరు విడివిడిగానే పెరగనిస్తాం. ఎటొచ్చీ ఇక్కడ వేళ్ళకు ఆధారంగా వెదురు బద్దకు బదులు అరంగుళం కైవారం ఉన్న ప్లాస్టిక్ గొట్టాలను ఉపయోగిస్తాం. ఉపరి భౌమిక వేళ్ళు ఎంత సైజు కావాలనుకుంటామో దానికి ఒక అంగుళం ఎక్కువగా ప్లాస్టిక్ ట్యూబును కత్తిరించి పెట్టుకోవాలి. ఆ ట్యూబు ముక్కలను నిలువుగా



## పటం 79 : ఉపరిభౌమిక వేళ్ళు



చీల్చాలి. వేరు దెబ్బతినకుండా ఆ చీలికను వెడల్పు చేసి ఒక్కో ట్యూబులోకి ఒక్కో వేరుని దింపాలి. ఆ తరువాత ట్యూబును మట్టితో నింపి ట్యూబు విడిపోకుండా ప్యాకింగ్ త్రెడ్ తోగాని, సన్నని వైరుతోగాని చుట్టేయాలి. ఇప్పుడు ట్యూబ్ లతో సహా వేళ్ళను కుండీలో నిలబెట్టి ట్యూబ్ లు మునిగేదాకా మట్టి పోయాలి. రోజూ మామూలుగానే నీళ్ళు పొయ్యాలనేదివేరే చెప్పనవసరం లేదుగదా!

వెదురు బద్దలు కట్టిన దానికంటే ఈ పద్ధతిలో వేళ్ళకు మరింత రక్షణ ఉంటుంది. తద్వారా వేళ్ళు ఆరోగ్యంగాను, బలంగాను పెరిగే అవకాశముంటుంది.



వేళ్ళు పొడవవుతున్నకొద్దీ ట్యూబులను క్రమేణా పైకి లేపుతుండాలి. అలా పైకి లేపిన ట్యూబులను కొంచెం కొంచెంగా కోసి తీసేస్తుండాలి. అంటే క్రమేణ వేళ్ళను గాలికి, వెలుతురుకు బహిర్గతం (Expose) చేస్తున్నామన్నమాట! అలా కాకుండ వేళ్ళన్నీ బాగా పెరిగి బలంగా తయారయ్యాక ఒక్కసారే ట్యూబులన్నీ కోసి తీసివేస్తామనుకోండి. ఒక్కసారిగా వాతావరణంలోని మార్పుకు తట్టుకోలేక వేళ్ళన్నీ ఎండిపోవచ్చు.

ఇలా బలవంతంగా ఉపరి భౌమిక వేళ్ళను పెంచడం ప్రకృతి విరుద్ధమే! బోన్సాయ్‌లను పెంచడమే ప్రకృతి నియమాలను నియంత్రించడం! అటువంటప్పుడు అందులో ప్రత్యేకతను చూపడం ఉత్తేజభరితం కదా!

ఉపరిభౌమిక వేళ్ళ శైలికి వాలుగాగాని, సెమీకేస్కేడ్ విధానంలో గాని పెరుగుతున్న మొక్కలు బావుంటాయి.

ఇకపోతే కుండీలు - లోతైన కుండీలు ఈ విధానానికి అనువుగా ఉంటాయి. ఏ మాత్రం నగిషీలు లేకుండా సాదాగా ఉన్న కుండీలు విలక్షణమైన ఈ మొక్కల ప్రత్యేకతను, అందాన్ని ఇనుమడింపచేస్తాయి.

# కవలకాండాల పద్ధతి
# *(Twin Trunk Style)*
# *(Sokan)*

ప్రకృతిలో మొక్కలు పెరిగే తీరుతెన్నులు అనంతంగా ఉన్నట్లే బోన్సాయ్ మొక్కల పెంపకం కూడాను! ఒకే చెట్టుకు రెండు కాండాలున్నట్లు గాను లేక రెండు చెట్లు కలిసి దగ్గరగా పెరగడం వలన ఒకే చెట్టుగా భ్రమింపజేసేటట్లుగాను ఉండే వృక్షాలను మనం తరచు చూస్తూనే ఉంటాం!

ఇలా రెండుకాండాలతో చెట్టును పెంచే పద్ధతినే బోన్సాయ్ పరిభాషలో కవలకాండాల పద్ధతి (Twin Trunk Style) అంటారు. ఈ పద్ధతిలో కాండాలు రెండుగా కనిపించేలా మనం మొక్కను మలచినప్పటికీ సిద్ధాంతరీత్యా చెట్టు మొదలు - అంటే మొక్క ఒక్కటే అయి ఉండాలి. 'ఒక మొక్కలో నుండి రెండుకాండాలు ఎలా సాధ్యం' అని మనం సంశయించనక్కరలేదు. నేలకు దగ్గరగా పెరిగే కొమ్మను రెండో కాండంగా పెంచుకోవచ్చు. ఈ కొమ్మను ప్రధాన కాండంతో సమానంగా పెరగనిస్తాం గనుక అది క్రమేణా బలం పుంజుకొని అసలు కాండానికి దీటుగా తయారవుతుంది.

ఇక్కడ మనం ముఖ్యంగా గుర్తుపెట్టుకోవలసిన విషయమేమిటంటే చెట్టు మొదలు



## పటం 80 : కవల కాండాలు



రెండుకాండాలుగా చీలినచోట 'U' ఆకారంలో గాకుండా మొదలు ఒకటేనని తెలిసేలా ఖచ్చిత మైన 'V' ఆకారంలోనే ఉండాలి.

ఇంక కొమ్మల అమరికకొస్తే ఇక్కడ కూడా మూడేసి కొమ్మలు వలయాలుగా ఉండ వలసిందే! ఎటొచ్చీ కవల కాండాల విధానంలో కాండాలు రెండున్నా చెట్టు ఒకటే గనుక రెండు కాండాల కొమ్మలను కలిపి వలయాలుగా మల చుకోవాలి. మూడుకొమ్మల్లో మొదటికొమ్మ ఒక కాండానికుంటే, రెండవకొమ్మ, రెండవ కాండానికుంటుంది. వెనుకకొమ్మ ఈ రెండు కాండాల్లో ఏదో ఒకదాని కుండవచ్చునన్న మాట! రెండు కాండాలకు కూడా లోపలి వైపున కొమ్మలు పెరగనివ్వకుండా ఎప్పటికప్పుడు చిగురులోనే గిల్లేస్తుండాలి.

కవల కాండాలన్నాం గదా అని వాటి



## పటం 81 :కాండాల మొదళ్ళు ఎడముఖం పెడముఖంగా వున్నా కాండాగ్రాలు ఒకే వైపుకు తిరిగి ఉన్నాయి



ఎత్తు, లావు, అవి పెరిగే తీరుతెన్నులు ఒకే రకంగా ఉండాలనేం లేదు. మళ్ళీ దీన్లో రకరకాల పద్ధతులు!

ఒక కాండం పొడవుగాను, దృఢంగాను ఉండి రెండోకాండం దానికంటే పొట్టిగాను, సన్నగాను ఉండవచ్చు. ఇందులో కూడా రెండింటికీ కలిపి ఒకే కొమ్మల వలయం ఉండాలి. అందులో మొదటి కొమ్మ పొట్టి కాండానికి ఉండాలి. రెండవకొమ్మ, వెనుక కొమ్మ పొడవు కాండానికి ఉంటాయి.

మరో పద్ధతి ఏమిటంటే రెండు కాండాల మొదళ్ళు ఎడముఖం, పెడముఖంగా పెరిగి చివరకు కొనలు మాత్రం ఒకే వైపుకి తిరిగి ఉండడం!



## పటం 82 : కాండాల మొదళ్ళు ఒకేదిశలో ఉన్నా కాండాగ్రాలు మాత్రం ఎడముఖం, పెడముఖంగా ఉన్నాయి



మరికొన్నింటిలో కాండాల మొదళ్ళు రెండూ ఒకే తీరులో పైదాకా పెరిగి కొనలు మాత్రం వేరువేరు దిశల్లో పెరుగుతుంటాయి.

కాండాలు రెండూ ఏపద్ధతిలో పెరిగినా మొత్తం మీద చెట్టు త్రిభుజాకారాన్ని కలిగి ఉండాలనేది మరచిపోగూడదు.

కవలకాండాల విషయంలో గుర్తుపెట్టు కోవలసిన మరోవిషయమేమిటంటే పెద్దకొమ్మ లేవీ కూడా కాండాలను దాటుకుంటూ పెరగని వ్వగూడదు. అలా పెరిగితే కాండం అందం స్పష్టగా కనిపించదు.

ఉపరితలపు వేళ్ళను గురించి కూడా క్రొత్తగా చెప్పవలసిందేమీ లేదు. రెండుకాండాల ఉపరితలపువేళ్ళు కలిసి ఒక్క కాండంతో పెరిగే



## పటం 83 : తల్లీ బిడ్డల బంధం



చెట్టులో లాగానే ముందుభాగాన తప్ప మిగిలిన అన్ని వైపులకు విస్తరించి చెట్టుకు చక్కని సమ తూకాన్నివ్వాలి.

కవలకాండాల విధానానికి గుండ్రం గానూ, దీర్ఘచతురస్రాకారంలోనూ ఉన్న కుండీలు బాగుంటాయి. కాకపోతే కేస్కేడ్ , సెమీకేస్కేడ్ పద్ధతుల్లో మొక్కను పెంచదల చుకున్నప్పుడు పై ఆకారాల్లోనే కాస్తలోతైన కుండీలు అవసరం!

కుండీలో మొక్కను నాటేటప్పుడు రెండుకాండాలు ప్రక్క-ప్రక్కన ఉండేటట్లుగాక, కాస్త ముందు వెనుకలకు ఉన్నట్లు అనిపించేలా మొక్కను త్రిప్పుకొని నాటుకోవాలి.

మన దగ్గరున్న ఒకే మొక్కలోనుండి రెండు కాండాల పద్ధతిలో మలచడానికి వీలులేద నుకున్నప్పుడు ఒకే రకానికి చెందిన రెండుమొ క్కలను మొక్కల మొదట్లోనే కలిపి గ్రాఫ్ట్‌చేసు కోవచ్చు.

వేరు వేరు ఎత్తుల్లో ఉండి ఒకదానికొకటి తోడునీడగా కలిసి బ్రతికే ఈ రెండు కాండా లకు మధ్య బంధుత్వాలను, అనుబంధాలను చూపుతూ తల్లీబిడ్డల బంధంగా, భార్యాభర్తల బంధంగా, గురుశిష్యుల బంధంగా అభివర్ణిస్తుం టారు.



# సాముదాయక కాండాల పద్ధతి (Clump Style) (Kabudachi)

కవల కాండాల లాగానే మూడుకాండాలు, ఐదు కాండాలు, ఏడుకాండాలు - ఇలా ఒకే మొక్కలో నుండి అనేకమైన కాండాలను బేసి సంఖ్యలో పెంచడం కూడా బోన్సాయ్‌లో ఒక ప్రత్యేకమైన పద్ధతి. దీన్నే 'సాముదాయక కాండాల పద్ధతి ' అంటారు. కవలకాండాల్లో లాగానే మూడు కాండాలతో మొక్కను పెంచే ట్రిపుల్ ట్రంక్ విధానంలో కూడా కాండాల ఎత్తు, లావు సమంగాను ఉండవచ్చు లేదా ఒక కాండం మాత్రం దృఢంగా ఉండి తక్కినవి రెండూ మొదటిదానికంటే తగ్గుస్థాయిలోను ఉండవచ్చు. మూడుకాండాల కొమ్మలూ కలిపి మూడుకొమ్మల వలయాల నేర్పరుస్తాయి. అలాగే ఉపరితలపువేళ్ళ అమరికలో కూడా ఈ విధానంలో ప్రత్యేకించి చెప్పవలసిందేమీ లేదు.

ఒక పెద్దచెట్టును బాగా క్రిందికల్లా నరికినప్పుడు ఆ నరికిన చోటునుండి చాలా చిగుళ్ళు పుట్టుకొస్తాయిగదా! అలాపుట్టిన చివుళ్ళలో నుండి మనం ఎంపిక చేసుకుని పెంచిన కొమ్మలే క్రమంగా కాండాలుగా రూపుదిద్దుకుంటాయి. ఎటొచ్చీ ఈ కాండాలు ఎప్పుడూ బేసంఖ్యలోనే ఉండాలి.

కాబట్టే సాముదాయక కాండాల పద్ధతిలో మనం మొక్కను పెంచదలచుకున్నప్పుడు బాగా ముదిరిన మొక్కను తీసుకొని దాన్ని బాగా క్రిందుగా - అంటే దాదాపు నేలమట్టానికి ఒక అంగుళం ఎత్తువరకు ఉంచి ఆపై భాగం మొత్తాన్ని కత్తిరించెయ్యాలి. కాండాన్ని కత్తిరించినా మిగిలిన మొక్కకు మామూలుగానే నీళ్ళు పోస్తే కత్తిరించిన దగ్గరినుండి క్రొత్త చిగుళ్ళు వచ్చేస్తాయి. అయితే ఇలా అంటకత్తిరేసినప్పుడు మొక్క చచ్చిపోయి మొదటికే మోసం వచ్చే ప్రమాదముంది. అందుకే నేలలోనో, బాగాలోతైన కుండీలోనో పెరుగుతున్న మొక్కని మనం ఈ ఆపరేషన్ కోసం ఎన్నుకోడం మంచిది.

మనం కోరుకున్న విధంగా ఉన్న మొక్క లభ్యం కానప్పుడు రెండు కాండాలు, మూడు కాండాల మొక్కలకు లాగానే ఇందులో కూడా ఐదు లేక ఏడు మొక్కలను దగ్గరగా కలిపి కట్టడం ద్వారా ఇందు కనువైన మొక్కను పొందవచ్చు. మొక్కలు లేతగా ఉన్నప్పుడే కాండాల మొదళ్ళలో కాస్త కాస్త చెక్కి అన్నిటిని కలిపి మొదళ్ళదగ్గర గట్టిదారంతో కట్టి కుండీలో నాటుకుంటే కొన్నినెలల్లో కాండాల మొదళ్ళన్నీ కలిసిపోయి అవన్నీ ఒకే కుదురు నుంచి పెరిగిన ఒకే మొక్కలా అనిపిస్తాయి.

ఎటోచ్చీ కవల కాండాల్లో లాగానే ఇందులో కూడా కాండానికీ కాండానికీ మధ్య



## పటం 84 : సాముదాయక కాండాలు (Clump Style)



చీలిక 'V' ఆకారంలో ఉండేలా జాగ్రత్తపడాలి. ఒకే కాండం మరోకాండాన్ని కప్పకుండా ఎటు నుంచి చూసినా అన్నికాండాలు స్పష్టంగా కనిపించాలి.

ఇంతకు ముందే చెప్పుకున్నట్లుగా పొడవైన కాండం అన్నిట్లోకి లావుగాను, పొట్టికాండం అన్నిట్లోకి సన్నగాను ఉండాలి. కాండాలు ఎన్ని ఉన్నా మొత్తం మీద చెట్టు త్రిభుజాకారంగా కనిపించాలి. అలాగని కాండాలన్నీ మరీ విసనకర్రలా మధ్యలో ఎత్తుగాను, అటుఇటు ఎత్తు తక్కువగాను తీర్చిదిద్దినట్లు ఉండగూడదు. సహజసిద్ధంగా పెరిగిందని స్ఫురించేలా కాండాలు ఎగుడుదిగుడుగా పెరిగినట్లుంటేనే బాగుంటుంది.

లోతు తక్కువగా ఉండి అండాకారంలోగాని, దీర్ఘ చతురస్రాకారంలోగాని ఉన్న



కుండీలు ఈ పద్ధతికి అనుకూలంగా ఉంటాయి. చెట్టు మరీ దృఢంగా ఉన్నప్పుడు లోతు మధ్యస్థంగా ఉండి గుండ్రంగా గాని, చదరంగాగాని, షడ్భుజాకారంగా గాని ఉన్న కుండీలను కూడా ఇందు కుపయోగిస్తుంటారు.

కొన్నిరకాల క్రోటన్సు, పారిజాతం లాంటి మొక్కలు, చిన్న చిన్న ఆకులుండి త్వరగా చిగుళ్ళు తొడిగే మొక్కలు ఈ పద్ధతిలో బోన్సాయ్‌ని పెంచడానికి అనుకూలంగా ఉంటాయి.

## *తెప్పవిధానం (Raft Style) (Ikadabuki)*

పెనుగాలి తాకిడికి భూమిమీద వాలి పోయినా పూర్తిగా పట్టుసడలని వేళ్ళవలన నూతన జీవం పోసుకుని పెరిగే మహావృక్షాలను మనం అప్పుడప్పుడూ చూస్తుంటాం! అలా నేల బారుగా ఉన్న కాండంలో నుండి కొమ్మలు క్రమేపీ తలలెత్తి పైకి పెరగడం ప్రారంభిస్తాయి. ఒక్కోసారి కాండం నేలకంటుకున్న చోట కణుపుల్లోనుండి వేళ్ళూనడం కూడా గమని స్తుంటాం ! బోన్సాయ్‌లో మనం అనుకునే తెప్పవిధానం (Raft Style) ప్రకృతి వైపరీత్యా నికి బలై నేలబారుగా పెరిగే మహావృక్షానికి ప్రతీకగా రూపొందినదే !

నీటిలో అడుగుభాగం మాత్రమే మునిగి తేలియాడే తెప్పలా - ఈ విధానంలో నేల బారుగా ఉన్న కాండం అడుగుభాగం భూమిలో కూరుకుని మిగిలిన భాగమంతా పైనే ఉంటుంది. గనుక దీనికి తెప్పవిధానం అనే పేరువచ్చింది. దీనినే 'సిన్యువన్ స్టైల్' అని కూడా అంటారు.

అన్ని మొక్కలూ అన్ని రకాల పద్ధతు లకూ అనువుగా ఉండవన్నది మనం మొదటి నుండీ అనుకుంటూనే ఉన్నాం ! అలాగే ఈ తెప్పవిధానానికీను! తెప్పవిధానానికి ఎంపిక చేసుకునే మొక్క కొమ్మలు నాటడం మూలం గాగాని, అంటు ద్వారాగాని తేలికగా వేరూనేదై ఉండాలి. ఎందుకంటే ఈ పద్ధతిలో పైన మనం చెప్పుకున్నట్లు కాండం నేలమీద ఆనడం, కణుపు కణుపూ చివురించడం, చివురు కొమ్మగా నిట్టనిలువుగా పెరగడమే కాకుండా ప్రతికొమ్మ ఒక మొక్కగా రూపొందాలి. అందు కుగాను పైకిపెరిగే ప్రతికొమ్మ క్రిందుగా కాండా నికి వాలుగా ఒక గంటు పెట్టాలి. మనం ఎంపిక చేసుకున్న మొక్కకూడా అందుకు తగినదే గనుక ఆ గంటు నుండి త్వరగానే వేళ్ళు పుట్టుకొస్తాయి. మనం ఇక్కడ గుర్తుపెట్టుకోవ లసిన ముఖ్యవిషయమేమిటంటే ఎట్టిపరిస్థితుల లోను కాండం పూర్తిగా తెగకూడదు. మొక్క చివరకు వచ్చిన కొద్దీ కాండం సన్నగా ఉంటుంది. అలా సన్నగా ఉంది గదా అని ఆ భాగాన్ని తొలగించవలసిన పనిలేదు. ఆ కొనను



కూడా తక్కిన కొమ్మలను వంచినట్లే రాగతీగ సాయంతో పైకిలేపి దాని క్రింద గంటుపెట్టి మరోమొక్కగా మలచుకోవచ్చు! ఇలా పైకి మలచిన కొమ్మలు బేసంఖ్యలో ఉంటే బాగుంటుంది.

అడ్డంగా గీతగీసినట్లు ఒక్కటే కాండాన్ని ఈ తెప్పవిధానంలో మలచడం కంటే కాండంతో పాటు ఒకటీ అరా కొమ్మలను కూడా తెప్పలో భాగంగా మలచి పెంచినప్పుడు ఈ శైలి చూడముచ్చటగా ఉంటుంది. ఇందుకుగాను మనం ఎన్నుకున్న మొక్క కాండంలో దృఢంగా ఉన్న కొమ్మలను కాండాన్ని వంచినట్లే నేలబారుగా వంచాలి. ఈ కొమ్మలకున్న రెమ్మలన్నీ కాకుండా 'తెప్ప' ఆకారం స్పష్టంగా కనిపించేలా కొన్ని మాత్రమే ఎన్నుకొని వాటికి అడుగున కాండానికి పెట్టినట్లు గంట్లు పెట్టాలి. కొంతకాలానికి ఈ గంట్లు పెట్టిన చోటునుండి వేళ్ళు పుట్టుకొస్తాయి. వేళ్ళు పెరగడంతోపాటు సన్నగా ఉన్న రెమ్మలన్నీ క్రమేణా బలం పుంజుకొని దృఢంగా కాండంలో నుండి పెరిగిన మొక్కలకు దీటుగా తయారవుతాయి. దీనివలన మొక్కలన్నీ వరసకట్టి నిలబడినట్లుగాకుండా సహజ సిద్ధంగా పెరిగిన అందమైన తోపులా అనిపిస్తుంది.

రాఫ్ట్‌విధానంలో కాండం ఏ వంపులు లేకుండా ఒక అడ్డగీతలా పెరుగుతుంది.

సిన్యువస్ విధానంలో కాండం వంపులు తిరిగి పెరుగుతుంది.

ఇక్కడ మనం గుర్తుపెట్టుకోవలసిన విషయమొకటుంది! కాలక్రమేణా మొక్కలుగా స్థిరపడే కొమ్మలను, రెమ్మలను మనం కోరుకున్న ఆకారంలో నిలబెట్టడం కూడా అంత తేలికేమీ కాదు! తక్కిన బోన్సాయ్ పద్ధతుల్లో కొమ్మలను షేప్ చేసేటప్పుడు అవసరమైతే కాండాన్ని కూడా కలుపుకుంటూ రాగితీగను చుట్టి వంచుతుంటాము. కాని తెప్పవిధానంలో అలా చేయడానికి వీలులేదు. ఎందుకంటే ఇందులోకాండం నేలబారుగా ఉంటుంది. పైగా అందులో సగభాగం నేలలోకే ఉంటుంది. రాగితీగను కాండం చుట్టూ గనుక చుడితే అది కాండం అడుగున క్రొత్తగా పుట్టి పెరిగే వేళ్ళకు అడ్డుకావచ్చు. అంతేగాకుండా కాండం బలం పుంజుకున్న కొద్దీ తీగ కాండంలోకి చొచ్చుకుపోయి కాండాన్ని కోసివేసే ప్రమాదం కూడా ఉంటుంది.

ఈ ఇబ్బంది నుండి బయటపడడానికి ఒక్కటేమార్గం. కాస్త లావుగా ఉన్న రాగితీగను అడ్డంగా ఉన్న కాండం మీద బారుగా పెట్టి ఈ తీగని, కాండాన్ని కలిపి అక్కడక్కడా ప్యాకింగ్ త్రెడ్ తో కట్టాలి. ఇప్పుడు పై కొమ్మలకు కట్టిన తీగను కాండం మీద బారుగా ఉన్న ఈ లావు తీగలోనుండి తిప్పుకోవచ్చు.

మొక్కని తెప్పవిధానంలోకి మలచి పెంచే సమయంలో దీర్ఘచతురస్రాకారంగా ఉండి సుమారైన లోతుఉన్న పెద్దకుండీనిగాని,



పాలపాకెట్లు పెట్టే ప్లాస్టిక్ క్రేట్స్‌లాటివాటిని గాని ఉపయోగించుకోవచ్చు. ట్రైనింగ్ సమయంలో మాత్రం అడ్డంగా నేలబారుగా వంచిన కాండాన్ని పూర్తిగా మట్టితో కప్పెట్టాలి. అలా చేస్తే మనం గంట్లు పెట్టిన చోటవేళ్ళు తేలిగ్గా వస్తాయి. ఎట్టిపరిస్థితుల్లోను అడ్డంగా వంచిన కాండం పైకి లేచి పోకుండా దీన్ని కుండీ అడుగున ఉన్న నీళ్ళు పోయే రంధ్రాల్లోంచి దారంతో లాగి కట్టుకుంటే మంచిది. చెట్టుమొత్తాన్ని పక్కకి వాల్చేసాం గనుక చెట్టుకున్న అసలు వేళ్ళు పెకలించుకొచ్చేసే ప్రమాదం కూడా ఉంది. అందుకే వాటిమీద మరింత ఎక్కువ మట్టిని పోసి నొక్కి పెట్టాలి.

కొంతకాలంపాటు మొక్కనలాగే ఉండనిచ్చి మనం గాట్లు పెట్టినచోట క్రొత్తవేళ్ళు వచ్చాయి అని నిర్ధారించుకున్న తరువాత మొదలు పూర్తిగా తొలగించేయవచ్చు. ఆ తరువాత మట్టిలోపల అడ్డంగా ఉన్న ప్రధానకాండాన్ని కొంతవరకు బయటకు కనిపించేలా పై మట్టిని తీసెయ్యాలి. అప్పుడే ఈ శైలి అందమూ, ప్రత్యేకతా కూడా కనిపిస్తాయి.

ఈ విధానంలో చాలా ప్రధానమైనది పర్‌స్పెక్టివ్ (Perspective)! రకరకాల సైజుల మొక్కలు - మొక్కకీ మొక్కకీ మధ్యన మారిన దూరాలతో ఈ ఎఫెక్టుని తీసుకురావచ్చు! ఎత్తుగా దృఢంగా ఉన్న కాండాలు ముందుకి, చిన్ని కాండాలు వెనక్కి వచ్చేలా మొక్కను మలిస్తే ఆ చిన్ని కాండాల మొక్కలు పెద్ద మొక్కలకి ఎంతో దూరంలో ఉన్న భావన కలుగుతుంది.

రాళ్ళ మధ్యగా మెలికలు తిరుగుతూ పొక్కుంటూ రాఫ్ట్ విధానంలో పెరిగే మొక్కలను చూస్తుంటే ఎంతో మనోజ్ఞంగా ఉంటుంది.

మట్టిని కాస్త ఎత్తుపల్లాలుగా పోసి, ఆ ఎత్తుపల్లాల్లో విస్తరించిన ఎన్నో చెట్లలా పెరుగుతున్న మొక్క, దానికి ఒక ప్రక్కగా కొండలకు ప్రతిరూపాలుగా నిలిపిన రాళ్ళతో రాఫ్ట్‌విధానంలోనే చక్కటి లాండ్ స్కేప్‌ని కూడా తయారు చేసుకోవచ్చు.

త్వరగా వేళ్ళూనే ఫైకస్ జాతి మొక్కలు తెప్పవిధానానికి ఎంతో అనువుగా ఉంటాయి. అయితే ఈవిధానంలో మొక్కలు సామూహిక విధానం (Group Setting) లో లా ఎక్కువగా ఉంటాయి గనుక ఫైకస్ నూర్ లాంటి సన్నని ఆకులు గలవాటిని ఉపయోగించటం బాగుంటుంది.

ఈ విధానానికి దీర్ఘచతురస్రాకారంలో గాని, అండాకారంలోగాని ఉండి కాస్తలోతు తక్కువగా ఉన్న కుండీలు అనుకూలంగా ఉంటాయి.



# సామూహిక విధానం

## (Group Settings) (Yose - ue)

ఇప్పటివరకు ఒకే మొక్కను వివిధ రకాలుగా మలచడం ఎలాగో తెలుసుకున్నాం. అందులో భాగంగానే ఒక మొక్కనే ఎన్నో మొక్కలుగా భ్రమింపచేయడం ఎలాగో కూడా చూసాం! ఇప్పుడు ఒక భావాన్ని లేదా దృశ్యాన్ని (ఉదా: అడవి) స్ఫురింపజేయడం కోసం సామూహికంగా మొక్కలను ఎలా పెంచాలో తెలుసుకుందాం! ఇలా పెంచడాన్నే సామూహిక విధానం (Group Settings) అంటారు.

ప్రకృతిలో ఒక చోట గుంపుగా మొక్కలు పెరుగుతున్నప్పుడు అవన్నీ ఒకే రకానికి చెందినవై ఉండాలన్న సిద్ధాంతమేదీ లేదు. కాని అతిపరిమితమైన బోన్సాయ్ తొట్టిలో మనం తోపులు, అడవులు సృష్టించదలచుకున్నప్పుడు అందుకు తగిన మొక్కలను ఎంచుకోవడంలో కొంతజాగ్రత్త వహించక తప్పదు. మన చిట్టడవిలో అన్నీ ఒకేరకానికి చెందినటువంటివి, చిన్నని, సన్నని ఆకులుగల మొక్కలు అయితే బావుంటుంది. అదే వెడల్పాటి పెద్ద ఆకులున్న మొక్కలైతే ఏ మొక్కకు ఆ మొక్క ప్రత్యేకంగా కనిపించకుండా ఆకులన్నీ కలిసిపోయి అల్లుకుపోయినట్లుగా కనిపించే ప్రమాదముంది.

అంతేగాకుండా ఈ మొక్కలో కొట్టవచ్చినట్లు కనిపించే ప్రత్యేకత ఏదైనా ఉంటే మరింత అందంగా ఉంటుంది. ప్రత్యేకత అంటే ఋతువులను బట్టి ఆకుల రంగులు మారడం, ఆకురాలే స్వభావం కలిగి ఉండడం మొదలైన లక్షణాలన్న మాట!

ఈ సామూహికవిధానంలో మొక్కలు నాటాలంటే అన్నీ ఒకే రకమైన మొక్కలైతే బావుంటుందనుకున్నాం గదా! అన్ని మొక్కలను మనకు కావలసిన సైజులలో, రీతిలో ఎలా సంపాదించాలన్నది మీకు సమస్యగా తోచవచ్చు. దీనికి సులభమార్గం ఒక్కటే! ఒకే చెట్టునుండి మనకు కావలసిన సంఖ్యకంటే ఎక్కువగా కొమ్మలను కత్తిరించుకుని నాటుకోవడం! మనకు అవసరమైన వాటికంటే ఎక్కువగా నాటడం వలన వాటిలో కొన్ని చివురించినా, చివురించకపోయినా సమస్య ఉండదు. అదృష్టవశాత్తు అన్నీ చిగురించినా మనకు ఎంపిక చేసుకునే అవకాశం ఉంటుంది గదా!

ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన విషయం ఒకటుంది. మొక్కలు 'అనేకమే' అయినా వాటి అమరికలో ఒక ఏకత్వం, సమగ్రత చూపరులకు కనిపించాలి. అందుకుగాను ఈ సామూహిక విధానంలో కూడా మొక్కలను ఏ శైలిలో పెంచదలచుకున్నామో మనం ముందే నిర్ణయించుకోవాలి. ఉదాహరణకు - అడవి



లోని మొక్కలను ఏటవాలు పద్ధతి (Slanting Style) లో పెంచదలచుకున్నా మనుకోండి! అప్పుడు మొక్కలన్నీ దానికి తగినట్లుగా - కుడివైపుకు కావాలనుకుంటే కుడివైపుకు, ఎడమవైపుకు కావాలనుకుంటే ఎడమవైపుకు వాలుతున్నట్లు నాటి పెంచుకోవాలి. అంటే మనం బోన్సాయ్ తొట్టిలో సామూహికంగా మొక్కలను నాటడానికి ముందుగానే మనం నిర్ణయించుకున్న రీతికి అనుగుణంగా మొదటినుండీ మొక్కలను మలచుకుంటుండాలన్నమాట!

ఒక వేళ విసనకర్ర ఆకారం (Broom Style) లో ఈ సమూహాన్ని పెంచదలచుకుంటే విభిన్నమైన మరో విధానాన్ని అనుసరించాలి. అన్నింటిలోకి బలంగా, పొడవుగా ఉన్న మొక్కను నిలువుగా ఉండేలా తొట్టి మధ్యన నాటాలి. ఈ మొక్కను కేంద్రంగా పెట్టుకొని ఎడమవైపున నాటవలసిన మొక్కలు క్రమక్రమంగా ఎడమవైపుకు, కుడివైపునాటవలసిన మొక్కలు క్రమ క్రమంగా కుడివైపుకు వాలేలా నాటుకోవాలి.

సామూహిక విధానంలో మొక్కలు అనేకమైనా వాటి అమరికలో ఏకత్వాన్ని, సమగ్రతను స్ఫురింపజేసే పొందిక ఉండాలనుకున్నాం గదా! ఇక్కడ ఏకత్వమంటే అన్ని మొక్కలు ఒకే సైజులో - అంటే ఎత్తులోగాని వైశాల్యంలో గాని ఒక్కలా ఉండాలనికాదు. నిజానికి సామూహిక విధానంలో ఉండకూడనిదే అది! ఎట్టి పరిస్థితుల్లోనూ అన్ని మొక్కలు ఒకే పరిమాణంలో ఉండనేగూడదు. అన్నింటి లోకి దృఢంగా కనిపించే చెట్టు ఎత్తుగా ఉండాలి. అలాగే అన్నింటికంటె చిన్నది సన్నగా ఉండి తీరాలి. మొక్కల కాండాల పరిమాణాల్లో తేడా లుండి ఎత్తుల్లో పెద్ద తేడాలు లేకపోయినా ప్రమాదం లేదు. ఎందుకంటే ఎత్తుగా నాటడం అవసరమనుకున్న మొక్క క్రింద మరికాస్త మట్టి పోసి ఆ మొక్క ఎత్తుగా ఉన్నట్లు భ్రమింప జేయవచ్చు! అలాగే పొట్టిగా కనిపించాలనుకున్నప్పుడు మొక్కను కాస్తలోతుగా నాటుకుంటే సరిపోతుంది! మొక్కల కాండాలన్నీ ఒకే రీతిగా ఉన్నప్పుడు ఇలాటి సర్దుబాట్లు కొంచెం కష్టమేననపిస్తుంది. అయినా ఈ సమస్యను కూడా కొంతవరకు పరిష్కరించుకోవచ్చు. అదెలా గంటే అన్నిమొక్కల కాండాలు ఒక్కలాగానే ఉన్నా మనం పరిశీలించి చూచినట్లైతే ఆకుల పొందికను బట్టి, కొమ్మల అమరికను బట్టి ఏదో ఒక మొక్క తక్కినవాటి కంటే మరికాస్త నదరగా కనిపించవచ్చు. అలాటి మొక్కను తీసుకుని ఇందాక మనం చెప్పుకున్నట్లు వేళ్ళ క్రింద మట్టిఎత్తుగా పోసి పొడవు ఎక్కువ ఉన్నట్లుగా భ్రమింపజేస్తే మనకు కావలసిన ఎఫెక్టువస్తుంది.

సామూహిక విధానానికి కూడా ఒక'శైలి' అంటూ ఉండాలని మనం ఇంతకు ముందే చెప్పుకున్నాం. ఈ'శైలి' ఎంత ముఖ్యమో సామూహిక విధానానికి 'దిశ' (direction) కూడా అంతే ముఖ్యం! 'దిశ' అంటే ఏమిటో



స్పష్టంగా తెలియడానికి ఒక ఉదాహరణ చెప్పు కోవచ్చు! మామూలుగా మొక్కలన్నీ పెరిగేది వెలుతురు వైపుకుగదా! సహజంగా - అంటే ఏ అడ్డూలేనప్పుడు మొక్కలు క్రింది నుండిపైకి నిటారుగా పెరుగుతాయి. మొక్క ఏవైపు పెరుగుతుందో అది దాని 'దిశ' అన్నమాట! సామూహిక విధానంలో మనం మొక్కలను పెంచదలచు కున్నప్పుడు కూడా శైలితోపాటు దిశను కూడా ముందే నిర్ధారించుకోవాలి. అంటే మనం సామూహికంగా పెంచబోయే మొక్కలు ఎడమనుండి కుడివైపుకు విస్తరించినట్లుగా ఉండాలా లేక కుడినుండి ఎడమవైపుకు విస్తరించినట్లుగా ఉండాలా! అనేది మొక్కలు నాటుకోబోయే ముందే నిర్ణయించుకోవాలన్న మాట!

ఉదాహరణకు మన చిట్టడవి ఎడమ నుండి కుడివైపుకు విస్తరించిందను కుందాం! అప్పుడు అన్నిటికంటే బలమైన మొక్కను కుండీలోని ఎడమ సగభాగంలో నాటి, దానిని కేంద్రంగా చేసుకుని మిగతా మొక్కలను కూడా ఎక్కువ భాగం ఎడమవైపుకే ఉండేలాగానూ, కుడివైపుకు విస్తరిస్తున్నకొద్దీ మొక్కలు చిన్నవిగా ఉండి పలుచబడుతున్నట్లు గాను నాటాలి.

అలాగే దిశ కుడినుండి ఎడమవైపుకయినప్పుడు మనం అమర్చదలచుకున్న విధానాన్ని కుడివైపుకు మార్చుకుంటాం!

అదేగనుక ఏటవాలుపద్ధతి అయిన వైపైతే మొక్కలవాలు ఎటుఉంటుందో అటు వైపు కుండీలో ఎక్కువ ఖాళీ ఉండేలా నాటుకోవాలి.

సామూహిక విధానంలో మొక్కలను అమర్చేటప్పుడు మనం గుర్తుంచు కోవలసిన ముఖ్యవిషయం మరొకటేమిటంటే ఈ చిట్టడవిలోని మొక్కలు వరుసగా బారులుతీరినట్లు కనిపించగూడదు. అంటే (గీతగీసినట్లు) ప్రత్యేకంగా నిలబెట్టినట్లు ఒకదానిపక్కన ఒకటిగాని, ఒకదానివెనుక ఒకటిగాని ఉండకుండా జాగ్రత్తపడాలన్న మాట! ఏవైపునుండి చూసినా ఏరెండు మొక్కలు ఒక్కలైనులో కనిపించగూడదు. అలాగే ఏమూలనుండి చూచినా రెండు మూడు మొక్కలకంటే ఎక్కువ ఒక వరుసలో ఉండగూడదు. అంతేకాదు. మొక్కకు మొక్కకు మధ్యదూరం కూడా కొలిచి పెంచినట్లుగా ఉండగూడదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మొత్తం డిజైను చూచినప్పుడు అధిక కోణ త్రిభుజాకారంలో ఉంటే బాగుంటుంది గాని ఎట్టి పరిస్థితుల్లోను లంబకోణ త్రిభుజంగాని, సమబాహు త్రిభుజంగాని కనిపించగూడదు.

ఈ విధానంలో మనం చిన్న పళ్ళెంలో పెద్ద అడవిపెరిగినట్లుగా భ్రమింప జేయాలనుకుంటున్నాం గనుక మొక్కల సంఖ్యకంటే కూడా ప్రధానమైనది జాగా (Space). ఎటు



పటం 86 : సామూహిక విధానంలో మొక్కలను నాటడం











వైపు ఎంత జాగా ఉంచాలో అలా ఉంచుతూ అమర్చడంపైనే ఈ సెట్టింగ్ అందమంతా ఆధారపడి ఉంటుంది. మనం ఇంతకుముందే అనుకున్న 'దిశ' కూడా ఈస్పేస్‌ని అమర్చుకోడంలో భాగమే! మొక్కలను కుండీలో వెనుక వైపుఅంచుకు కాస్తదగ్గరగా నాటుకుని ముందు వైపు, మొక్కల దిశ విస్తరించిన వైపు వీలైనంత ఎక్కువ జాగా వదలగలిగితే సువిశాలంగా పరచుకున్న భూభాగంలో ఈ అడవి ఒక అంతర్భాగంగా కనిపిస్తుందే తప్ప పనిగట్టుకుని అమర్చినట్లుండదు.

ఇప్పటివరకు మనం సామూహిక విధానానికి అవసరమైన మూల సూత్రాలు తెలుసుకున్నాం! ఇప్పుడు అసలు అనుకున్న డిజైను అమర్చుకోడం ఎలాగో చూద్దాం!

విత్తనాల ద్వారాగాని, కొమ్మలద్వారా గాని ఈ విధానంకోసం తయారు చేసిన మొక్కలు పెద్దకుండీలో సిద్ధంగా ఉన్నాయి గదా! సామూహిక విధానంలో మొక్కలను 3,5,7,9 - ఇలా బేసంఖ్యలోనే పెంచుతారనే సంగతి మనం మరచిపోగూడదు. దానిని దృష్టిలో పెట్టుకుని మనసెట్టింగులో ఎన్నిమొక్కలు నాటదలచుకున్నామో ముందే నిర్ణయించుకోవాలి. అప్పుడు మనం డిజైను సెట్ చెయ్యదలచుకున్న బోన్సాయ్ కుండీ కొలతలు తీసుకోవాలి.ఆకొలతల ప్రకారం కాగితంమీద గీసుకుని మనం ఎక్కడెక్కడ మొక్కలు నాటాలనుకుంటున్నామో ఆయాస్థానాలను అందాజాగా కాగితంమీద గుర్తించాలి. కాగితం మీదమొక్కల స్థానాలను ఇలా గుర్తించడానికి ముందుగానే మొక్కల పరిమాణాలను బట్టి ఏదిముందు నాటాలి ఏది తరువాత నాటాలి అనేది కూడా నిర్ణయించుకోవాలి. ఈ ఊహాచిత్రం తృప్తికరంగా వచ్చింది అనుకున్నాక మొక్కలు పెద్ద కుండీలో ఉండగానే మనం చెయ్యబోయే సెట్టింగ్‌లోకి బాగా అమరేలా అవసరం మేరకు ట్రిమ్‌చెయ్యాలి. ఈట్రిమ్మింగ్ అన్నింటికంటే పెద్దమొక్కతో మొదలు పెట్టాలి. మరీ ఒక్కసారే అంటకత్తిరేయకుండా అది ఉండబోయే స్థానం, దానికి ఉండవలసిన సైజుని, ఆకారాన్ని దృష్టిలో పెట్టుకుని కొద్దికొద్దిగా కత్తిరించాలి.

ఇప్పుడిక పెద్దకుండీలో నుండి మొక్కలను పీకడం మొదలు పెట్టవచ్చు. ముందు పెద్దమొక్కను, ఆతరువాత మనం ముందుగానే ప్లాన్ చేసుకున్న ప్రకారం - మొక్కలను ఒక్కటొక్కటే తీసి - అవసరమనుకుంటే వేళ్ళను కూడా తగిన మేరకు ట్రిమ్ చేసి వాటివాటి స్థానాల్లో నాటెయ్యాలి.

సెట్టింగ్ మొత్తం సంతృప్తికరంగా వచ్చిందనుకున్నప్పుడు వేళ్ళచుట్టూ మట్టివేయ్యాలి. ఆతరువాత కొమ్మలేవైనా అటూ ఇటూ వాలినట్లుగా గాని, మించిన దారంతో ఉన్నట్లు గాని అనిపిస్తే జాగ్రత్తగా అవసరమైన మేరకు కత్తిరించుకోవాలి.



కాగితంమీద డిజైను మొత్తం సిద్ధం చేసు కున్నాకే మొక్కలను కుండీలో నుండి తీయాలి. మొక్కలు పీకిపెట్టి అప్పుడు ప్లాన్ చేస్తూ కూర్చుంటే ఈ మధ్యకాలంలో సున్నిత మైన వేళ్ళు, చిగుళ్లు కూడా వాడిపోయి మొద టికే మోసం వచ్చే ప్రమాదముంది.

అందుకే ట్రిమ్ చేసేటప్పుడు ప్రతిమొ క్కకు - అంటే మొక్కవేళ్ళకు, ఆకులకు సమతుల్యత ఉండాలనేది మరిచి పోగూడదు. అలాగే కొమ్మలుగాని, వేళ్ళుగాని మరో మొక్కను కమ్మేస్తున్నట్లుండగూడదు. ఒకో సారి మనం అనుకున్న తీరులో మొక్కలు స్థిరంగా నిలబడాలంటే కాస్త ఆధారం అవసరం అవుతుంటుంది. అలాటప్పుడు ట్వైన్ దారంతో వాటిని తొట్టికి కట్టవచ్చు. రెండు మూడు నెలల్లో వేళ్ళూని మొక్క నిలదొక్కుకు నేసరికి దారాలు ఎలాగూ చివికిపోనేపోతాయి.

ఈసామూహిక విధానంలో చెట్టు స్థానా నికి, కాండం ఒడ్డు పొడుగులకే అధిక ప్రాధా న్యత! కొమ్మల పాత్ర ఆతరువాతదే! సమూ హంలో మొక్కల సంఖ్య పెరిగిన కొద్దీ కొమ్మల సంఖ్య, సైజులు కూడా తగ్గుతుండాలి. అలా లేకపోతే చెట్ల అందం అంతా అల్లుకు పోయిన కొమ్మల మరుగున పడిపోతుంది.

## మల్టిపుల్ ప్లాంటింగ్స్
## *(Multiple Plantings)*

సామూహిక విధానంలోనే 9 కంటే ఎక్కువ మొక్కలను నాటినట్లయితే దానిని 'మల్టిపుల్ ప్లాంటింగ్స్' అంటారు. ఈ విధా నంలో సంఖ్యకు ప్రాధాన్యత లేదు. అంటే ఖచ్చితంగా ఇన్నిమొక్కలుండాలని గాని, బేసం ఖ్యలోనే ఉండాలన్న నియమం గాని ఏమీలేదన్న మాట! సాధారణంగా ఈ పద్ధతికి గుప్పెడు లేతమొక్కల్ని ఒక్కచోట కుప్పగా బోన్సాయ్ తొట్టిలో కాకుండా మామూలు కుండీలో నాటు తుంటారు. అందువల్లనే ఈ శైలికి ఫిస్ట్ ప్లాంటింగ్స్ (Fist Plantings) అని కూడా పేరు.

కుండీలో నాటిన మొక్కలు కాస్త కుదురు కున్న తర్వాత మరీ బలహీనంగా ఉన్నమొక్కలను, అడ్డదిడ్డంగా కాండాలను దాటుకుంటూ పెరిగే వాటిని, లేదా మనం అనుకున్న డిజైనులోకి ఇమడనట్లున్న మొక్క లను తీసివేయవచ్చు.

గుప్పెడు మొక్కలన్నారు కదా అని కుండీనిండా మొక్కలు కుక్కేయకూడదు. ఎప్పుడయినా కాండాలు స్పష్టంగా కనిపించే పాటి ఎడం ఉండాలి. మొక్కలు ఆరోగ్యంగా పెరగడానికి కూడా మొక్కకు మొక్కకు కొద్ది పాటి దూరమైనా అవసరం గదా!



సామూహిక విధానానికి లోతు తక్కువగా ఉండి అండాకారంలోగాని, దీర్ఘచతురస్రాకారంలోగాని ఉన్న కుండీలు అనువుగా ఉంటాయి. మనం నాటేమొక్కల కాండాలు కాస్త దృఢంగా ఉండేవైతే ఒక మోస్తరు లోతున్న కుండీలనుపయోగించుకోవచ్చు.

కుండీలోని మొక్కల ఎత్తు, కుండీపొడవు ఎట్టి పరిస్థితుల్లోను సమంగా ఉండగూడదు. సమూహంలో అన్నిటి కంటే పెద్దమొక్కఎత్తు కుండీ పొడవులో రమారమి 2/3వ వంతు ఉంటే సెట్టింగులో సమతుల్యత కనిపిస్తుంది.

సామూహిక విధానంలో మొక్కలను పెంచేటప్పుడు అవి గుట్టమెట్టల్లో సహజ సిద్ధంగా పెరుగుతున్న భావనని కలిగించేలా కుండీలోని మట్టిని సర్దడంలో (land scaping) ప్రత్యేక శ్రద్ధచూపాలి. పటంలో మీరు చూస్తున్నట్లు సమూహంలోని మొక్కల మొదళ్ళలో ఎత్తుగా దిబ్బల్లా కనిపించేలాగా మట్టిని పొయ్యాలి. అలా చెట్ల మొదళ్ళలో ఎత్తుగా ఉన్నమట్టి క్రమంగా జారుతూ కుండీ అంచుల దగ్గరి కొచ్చేసరికి పూర్తిగా వాలిపోతుంది.

కుండీలోని మట్టిమీద మాస్ (Moss) నమరిస్తే అది సహజ వాతావరణంలో నేలమీద పెరుగుతున్న గడ్డిని స్ఫురింపచేస్తుంది. ఇది ఎత్తు పల్లాలుగా అమర్చిన మట్టి జారిపోకుండా కూడా పట్టి ఆపుతుంది.

# రాళ్ళలో మొక్కలను పెంచే విధానం

## *(Rock Settings)*
## *(Ishitsuki)*

సృష్టిలో ఎన్నోరీతుల్లో సాగే వృక్ష జీవన సరళిని ప్రతిబింబించే కళే బోన్సాయ్ అయితే, కొండల్లోను, రాళ్ళలోను పెరిగేమొక్కలను తీర్చిదిద్ది మనముంగిట్లోని కుండీల్లో పెంచుకోడం ఆ కళకు పరాకాష్ఠ!

కుండీకి బదులు రాతిని కంటైనర్ గా ఉపయోగించడం; రాతిలోనే మొక్కను పెంచడం; మొక్కవేళ్ళు రాతిని పెనవేసుకుని పెరగడం; రాళ్ళను, మొక్కలను నేర్పుగా అమర్చి చిత్రకారుని చిత్తరువులా ఒక సుందర తర దృశ్యాన్ని (Land Scape) తీర్చిదిద్దడం - ఇవన్నీ రాక్ సెట్టింగ్ లో భాగాలు!

మొట్టమొదట కుండీకి బదులుగా రాతినే, కంటైనర్ గా ఉపయోగించడ మెలాగో చూద్దాం! మనం కంటైనర్ గా ఉపయోగించాలనుకునే రాయి పలుచటి పెద్దపలకలా ఉండి మధ్యలో కాస్త మట్టి పట్టేందుకు వీలుగా కొద్దిపాటి పల్లంగా ఉంటేచాలు. ఈ లోతు మరీ ఎక్కువగాకుండా ఒక మోస్తరుగా ఉన్నట్లైతే ప్రత్యేకంగా రంధ్రాలు చేయనవసరం లేకుండానే మొక్కకు నీళ్ళు పోసినప్పుడు ఎక్కువైన నీరు దానంతటదే ప్రక్కలకుజారిపోతుంది. ఇకపోతే



కంటైనర్‌గా ఉపయోగించడానికి ఎలాటి రాళ్ళు బాగుంటాయి? కేవలం చూడ్డానికి గరుకుగా ఉండడమే కాకుండా కొన్నిరాళ్ళు కంటికి కని పించనంత సన్నని రంధ్రాలతో (porous) ఉంటాయి. ఇలాటి రాళ్ళకు నీటిని పీల్చుకునే శక్తి ఉంటుంది. మరీలోతు ఎక్కువగా లేని రాయి ఇలా రంధ్రాలు కలిగి ఉన్నదైతే మనం పోసేనీరు కొద్దో గొప్పో ఎక్కువైనా రాయి ఆనీటిని పీల్చేస్తుంది. ఎటొచ్చీ ఎంత సూక్ష్మ రంధ్రాలున్న రాయైనాలోతు మరీ ఎక్కువగా ఉంటే ఎక్కువైన నీరుకారి పోవడానికిగాను రాతికి రంధ్రాలు చేయకతప్పదు. అయితే రాతిని తొలిచి రంధ్రాలు వేయడమన్నది అంత తేలికైన పనేమీ కాదు. అయినా ఒక అపురూప మైన అందాన్ని సృష్టించాలంటే శ్రమపడక తప్పదు మరి!

రెండవపద్ధతి వేళ్ళు రాతినల్లుకుని పెర గడం (Root over Rock)- కొండ చరియ



పటం 88 : వేళ్ళు రాతిని అల్లుకొని పెరగడం (Root Over Rock)



శ్లోను, గచ్చుచేయని గోడలమీద తరచు మనం ఇలాటి మొక్కలను చూస్తూంటాం. రాతికి, రాతికి లేదా ఇటుకకు ఇటుకకు మధ్య ఉండే పిసరంత మట్టిని ఆసరా చేసుకుని పెరిగేరావి మొక్కల వేళ్ళు గోడలను కరచుకుని భూమిని వెదుక్కుంటూ క్రిందికి పెరుగుతుంటాయి. ఒక్క రావి మాత్రమే కాకుండా కొన్ని మర్రి జాతి చెట్లు కూడా ఇలా పెరగడం మనకు సర్వసాధారణంగా కనపించే దృశ్యమే! వేళ్లురాతిని అల్లుకుని పెరిగే (Root Over Rock) విధానం వీటి ప్రేరణే అయ్యుంటుంది.

## రాతిపై మొక్కను సెట్‌చేసుకునే విధానం :

రాయి మొక్కసైజుకు తగినట్లుగా ఉండాలి. మొక్క రాతిమీద కుదురుగా కూర్చో వడానికి అనువుగా రాతి ఉపరితలంమీద గాడి ఉండాలి. ఒకవేళ అలా మన శైలికి అనుకూల మైన రాయి దొరకని పక్షంలో మన దగ్గరున్న రాతిని కావలసిన విధంగా కొట్టించుకోవచ్చు. గాడిమీద మొక్కను కూర్చోబెట్టి వేళ్ళు రాతి మీద అందంగా పరచాలి. చూడ్డానికి ఈ వేళ్ళు రాతిమీద ఉన్న గాళ్ళలోనుండి సహజంగా క్రిందికి పెరుగుతున్నట్లు అనిపించాలన్న మాట! వేళ్ళు త్వరగా పెరిగి మనం అనుకున్న ఎఫెక్టు రావడానికి చెట్టు పైభాగం మాత్రం బయటకు కనిపించేలా ఉంచి వేళ్ళు పరుచు కున్న భాగాన్ని రాతితో సహాపూర్తిగా మట్టిలో పాతిపెట్టాలి. రాతి క్రిందఉన్న మట్టిలోకి చొచ్చుకుపోయేటంతగా వేళ్ళు పెరిగాయను కున్నప్పుడు రాతిని మట్టిలో నుండి బయటకు తీసి మనం కోరుకున్నట్లుగా అమర్చుకో వచ్చు. కాలంగడిచి మొక్కఎదిగిన కొద్దీ వేళ్ళు బాగా బలపడి రాతిని పెనవేసుకుని దాన్నుండి వేరు చేయడానికి వీలుకానంతగా బిగిసిపో తాయి. చూస్తుంటే వేళ్లు కప్పేసిన ఈ రాళ్లు కూడా కాండంలో ఒక భాగంలా అనిపిస్తాయి.

ఈ విధానానికి వేళ్ళు బాగా పొడవుగా పెరిగిన మొక్కలు అనుకూలంగా ఉంటాయి. లోతైన తొట్టిలో పెరిగిన మొక్కలకు వేళ్ళు బాగా లోతుకు ఎదిగి పొడవుగాఉంటాయి. నర్సరీలో మనం కొనే మొక్కలు సాధారణంగా ఇలాటి లోతు తొట్లలోనే ఉంటాయి. ఈ 'వేళ్ళు రాతినల్లుకుని పెరిగే శైలికి' అలాంటి తొట్టిలో పెరిగినమొక్క రెడీమేడ్ గా దొరికి నట్లే! ఆ మొక్కను రాతిమీద మనం అనుకున్న విధంగాను, అనువైన విధంగాను కూర్చోబెట్టి వేళ్ళు రాతిమీద నుండి చివరికంటా మట్టిలోకి దిగేలా సర్దుకోవాలి. ఇంకపైన కొమ్మలూ, ఆకులూ బోన్సాయ్‌కి అనువైన విధంగా కత్తిరించుకోవాలి.

ఇలా కాకుండా మామూలు బోన్సాయ్ మొక్కను ఈ శైలిలోకి మలచాలనుకుంటే ముందుగా మొక్కను సన్నగా పొడవుగా ఉన్న ఒక ప్లాస్టిక్ పాత్రలో పాతాలి. ఆ పాత్రకి మామూలు తొట్లకున్నట్లు రంధ్రాలుండాలి. లేదా మనం ఇనప అట్లకాడ ఎర్రగా కాల్చి రంధ్రాలు పెట్టుకోవచ్చు.



పటం 89 : రాతిపై మొక్కను సెట్ చేసుకునే విధానం









ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన విష యమేమిటంటే మనం ఎంత ఎత్తు రాయిని ఈ మొక్క పెట్టడానికి ఉపయోగించాలనుకుంటు న్నామో మనం ఉపయోగించే ప్లాస్టిక్ పాత్ర కూడా అంతలోతుగా ఉండాలనేది! ఇంక ఇప్పుడీ పాత్రని తక్కువ యిసుక కలిపిన మట్టితో నింపాలి.

మట్టి లూజుగా ఉండడం వలన వేళ్ళు త్వరగా పెరగడానికి అవకాశ ముంటుంది. ఆ తరువాత ప్రతినాలుగయిదు నెలలకు కొద్దికొ ద్దిగా పాత్రపై భాగాన్ని కోసేసి వేళ్ళ చుట్టూ ఉన్న మట్టిని తొలగించాలి. దీనివలన మట్టితో కప్పబడి ఉన్న వేళ్ళు త్వరితంగా పెరుగు తాయి. ప్లాస్టిక్ పాత్రను కోసేయడం - మట్టి తీయడం - వేళ్ళునుక్రమేపీ అనాచ్ఛాదితం చేయడం - ఈ ప్రక్రియను రెండు మూడు సంవత్సరాల పాటు చేసాక మనం రాతిమీద పరచడానికి వీలైన వేళ్ళతో మొక్క సిద్ధమా తుంది.

మొక్కను రాతిమీద పెట్టడానికి ముందు వేళ్ళకున్నటువంటి మట్టిని పూర్తిగా తీసేయాలి. అందుకుగాను వేళ్ళను పదేపదే మట్టి పూర్తిగా పోయేవరకు నీళ్ళల్లో ముంచాలి. ఎందుకంటే వేళ్ళు ముద్దలా ఒకదానికొకటి అంటుకుని ఉంటే రాతిమీద అందంగా పర చడం కుదరదు. వేళ్ళల్లో కొన్ని మరీ మొద్దుగా ఉండి, తక్కిన వేళ్ళు తోకలా లేకుండా ప్రత్యే కంగా కొట్టొచ్చినట్లు కనిపిస్తుంటే వాటిని తీసి వేయడం మంచిది. అయితే అలా తీయడం వలన మొక్కకు ప్రమాదం లేదని అనిపించిన ప్పుడే ఆపని చేయాలి. రాతిమీద అనాచ్ఛాది తంగా ఉండడం వలన వేళ్ళు తడారిపోయి దెబ్బతినే అవకాశముంది. అలా జరక్కుండా ఉండడానికి చిక్కగా మట్టి కలిపిన నీళ్లల్లో ఒకసారి ముంచి లేపాలి. వేళ్ళచుట్టూ పలుచని పొరలలా అంటుకున్న ఈ మట్టి వేళ్ళు దెబ్బతి నకుండా కాపాడుతుంది. ఆతరువాత మొక్కను మనం అనుకున్నట్లుగా రాతిమీద కూర్చోబెట్టి స్థిరంగా ఉండడానికి పీచుతో రాతికి కలిపి కట్టాలి. వేళ్ళను సాధ్యమయినంత అందంగాను, కొసలు కుండీలోని మట్టిలోకి దిగేలాను సర్దాలి.

రాతిమీద నుండి వ్రేలాడే వేళ్ళు దెబ్బతి నకుండా మాస్ (Moss) తో కప్పాలి. ఇప్పుడు మాస్‌తోపాటు వేళ్ళనుకూడా పలుచని గుడ్డతో జాగ్రత్తగా చుట్టాలి. ఇంత ఆపరేషన్ (Operation) జరిగాక బోన్సాయ్ మొక్క చాల బలహీ నంగా ఉంటుంది. అందువలన 5,6 నెలలు పాటు ఈ బోన్సాయ్‌ని నీడలో ఉంచి తేమ ఆరిపోకుండా తరచు నీళ్ళు చిలకరిస్తుండాలి. 5,6 నెలల్లో మట్టిలోకి దిగిన వేళ్ళ కొసల్లో నుండి నూగువేళ్లు పుట్టుకొస్తాయి. అంటే అప్ప టికి బోన్సాయ్ రాతిమీద కుదురు కుందని అర్ధం! ఆతరువాత రెండు సంవత్సరాలకు గాని



ఈ సెట్టింగ్‌ని మరీ లోతు తక్కువ బోన్సాయ్ కుండీలోకి మార్చగూడదు.

రాతిమీద పెంచడంలోనే మరొక విధానం కూడ ఉంది. అదేమిటంటే అక్కడక్కడ రవ్వంత మట్టి పట్టడానికి వీలయిన చిన్న చిన్న గాళ్లున్న పెద్దరాయిని తీసుకుని తేమ ఎక్కువగా అవసరంలేని మొక్కల్ని ఈ గాళ్ళల్లో అమర్చడం! ఏళ్ళ తరబడి రాతిలోనే పెరగడానికి అనుకూలమైన వాతావరణం ఉండదు గనుక తక్కిన బోన్సాయ్ మొక్కల కంటే కూడా తరచుగా - కనీసం వేసవిలోనైనా రాతితో సహా మొక్కను దానికి తగిన పెద్ద కుండీలో పెట్టాలి. లేకపోతే తేమ తక్కువై మొక్క చనిపోవచ్చు కూడాను.

ఈ రెండు పద్ధతుల్లో ఎలా పెంచినా కూడా మనం ఎంచుకున్న రాయి మరీ పెద్దది కాకుండా మొక్క సైజుకు తగినట్లుగా ఉండాలి. ఎటొచ్చీ మన నేర్పంతా వేళ్ళను రాతిచుట్టూ అందంగా పరచడంలోనే ఉంటుంది. ఈ వేళ్ళు రాతిమీద ఉన్నసందుల్లో నుండి సహజంగా



పటం 90 : కొండలమీద పెరిగే విధానం (Clinging to the Rock)



క్రిందికి పెరుగుతున్నట్లు అనిపించాలి.

## *కొండల మీద పెరిగే విధానం (Clinging to the Rock):*

ఓ మహాపర్వతం మీద ఎన్నో చెట్లు పెరుగుతున్న విధానాన్ని అనుకరించుతూ బోన్సాయ్‌ని పెంచే పద్ధతి ఇది. ఈ పద్ధతిలో మొక్కలను పెంచేటప్పుడు మనం తీసికోవలసిన అతిముఖ్యమైన జాగ్రత్త ఒకటుంది. అదేమిటంటే మొక్కసైజుకి, రాతిసైజుకి ఉండవలసిన నిష్పత్తి! మహాపర్వతంతో పోల్చినప్పుడు దాని మీద పెరిగే మొక్క ఎంతో అల్పమైనది గదా!

అందుకే ఈ విధానంలో మనం ఎంచుకున్నరాయి అడుగు, అడుగున్నర ఎత్తు ఉంటే దానిమీద పెంచదలచుకున్న మొక్కల ఎత్తు రెండుమూడంగుళాలు మించి ఉండగూడదు.

ఈ పద్ధతికి సన్నని ఆకులున్న మేమ్ బోన్సాయ్‌కి తగిన మొక్కలు బాగుంటాయి. ఇవి కుచ్చువేళ్ల మొక్కలైతే ఇంకా మంచిది. కుచ్చువేళ్ళు రాళ్ళ సందుల్లోని కొద్దిపాటి మట్టిలోకి తేలిగ్గా చొచ్చుకు పోయి బాగా పెరగగలుగు తాయి. ఎక్కువ తేమ ఉంటేగాని జీవించలేని జాతిమొక్కలను ఈ పద్ధతికి ఎంచుకోగూడదు.

ఇంక రాళ్ళ ఎంపిక కొస్తే బాగా గరుకుగా ఉన్నవి, సన్నని గాళ్ళు ఉన్నవి ఇందుకు అనుకూలంగా ఉంటాయి. ఏళ్ళ తరబడి ఎండకూ వానకూ ఎండుతూ, తడస్తూ ఉన్న రాళ్ళలా అనిపించాలి. రాతిని అన్నికోణాల నుండి పరిశీలించిచూచి చెట్టుకు ముఖభాగాన్ని నిర్ణయించి నట్లే రాతికి ఏది ముఖభాగమైతే బాగుంటుందో ముందుగా నిర్ణయించుకోవాలి. అందుకు తగినట్లుగా నిలబెట్టడానికి వీలుగా ఉందో లేదో కూడా చూచుకోవాలి. ఒకవేళ రాతి అడుగుభాగం ఎగుడుదిగుడుగా ఉంటే దాన్ని కుదురుగా నిలబడేలా కట్ చేయించాలి. కట్ చెయ్యడం సాధ్యంగాని పక్షంలో సిమెంట్‌తో సరి చేసుకోవచ్చు.

మనం ఎంచుకునే రాళ్ళు సాధ్యమైనంత వరకు బరువు తక్కువగా ఉండాలి. అలా అని తేలిగ్గా విరిగి ముక్కలైపోయేలా ఉండగూడదు.

సాధారణంగా రాక్ సెట్టింగ్స్‌లో ఒకటి రెండు మొక్కలకంటే ఎక్కువ ఉపయోగించరు. రాయి రంగును బట్టి మొక్క ఎంచుకుంటే బాగుంటుంది. రాతిరంగు నల్లగా ఉన్నప్పుడు ఆకులు మరీ ముదురు ఆకుపచ్చ అయితే చెట్టు అందం తెలియదుగదా! అందుకని ఇది దృష్టిలో పెట్టుకుని మొక్కను ఎంచుకోవాలి. రాయి అన్నిరకాలుగాను మన సెట్టింగుకి తగినట్లు ఉండక పోవచ్చు. ఆలోపాలను కప్పిపుచ్చుతూ సెట్టింగుని అందంగా అమర్చడంలోనే మన ప్రతిభ ఉంటుంది.

ఈ పద్ధతిలో మనం తరచూ చేసే



పొరబాట్లలో ఒకటి ఎక్కువ కొమ్మలు, ఆకులు ఉన్న చెట్లను నాటడం! దీనివలన రాయి కప్పు బడిపోయి దాని అందం తెలియదు. మరో పొరబాటు - రాతిలో సొరంగంలా కనిపించే భాగమేదైనా ఉంటే- అనువుగా ఉందిగదా అని మొక్కని అందులో నాటేయడం! అలా చెయ్యడం వల్ల రాతి అందం తెలియదు గదా! అందుకే రాతిలో అందవిహీనంగా ఉన్నచో టునే అందమైన మొక్కను పెట్టడానికి ఉపయో గించాలి.

## రాళ్ళమీద సామూహికంగా మొక్కలు నాటడం (Group Settings)

ఓ వెడల్పాటి రాతిమీద పెరుగుతున్న చిన్ని కోననుచూపే బోన్సాయ్ విధానం ఇది. దీనికోసం ఎంచుకున్నరాయి నిలువు కొలత కంటే అడ్డుకొలత ఎక్కువ ఉండాలి. ఈ రాతిప లక మీద మొక్కలను ఒక ప్రక్కగా నాటి రెండవ ప్రక్క ఖాళీగా వదిలెయ్యాలి. ఈ ఖాళీ భాగమే సెట్టింగ్ కి సహజత్వాన్నిచ్చి అందాన్ని మరింత ఇనుమడింప జేస్తుంది.

కంటైనర్ గా ఉపయోగించే పలకరాయి తోబాటు మొక్కల మధ్య అమర్చే రాళ్ళ ఆకారం, పొందికల మీదకూడా డిజైను అందం ఆధారప ఉంటుంది.

కంటైనర్ గా ఉపయోగించే రాయి తీర్చి దిద్దినట్లు ఒక ప్రత్యేకమైన ఆకారం - అంటే పూర్తిగా చదరంగా గాని, దీర్ఘచతురస్రం గాగాని లేకుండా ఉంటేనే సహజత్వానికి దగ్గరగా ఉంటుంది.

అలాగని పూర్తిగా అడ్డదిడ్డంగా ఉన్నా బాగుండదు. ఒకవైపు వెడల్పుగా ఉండి రెండో వైపుపోను పోను సన్నగా ఉన్నరాతిని ఎన్నుకో వడం ఈ పద్ధతికి నప్పుతుంది. వెడల్పుగా ఉన్న వైపు మనం కావాలనుకున్న రీతిలో మొక్కలను నాటుకుని సన్నగా ఉన్నవైపు ఖాళీగా వదలివేయాలి.

అలాగే మొక్కల మధ్యనగాని, ప్రక్కల గాని ఉపయోగించిన చిన్న రాళ్ళు కూడా రాతి వాలులోనే - అంటే ఎక్కువ నుండీ క్రమేణా తగ్గుతూ పోయినట్లుండాలి. ఈచిన్న రాళ్ళు కాస్తమట్టిలో కూరుకున్నట్లు అమర్చుకుంటే మరింత సహజంగా ఉంటుంది. అలా పాతితే అడుగురాయి, పైరాళ్ళూ కూడా భూమిలోని ఒక శిలాభాగంలోవిలాగా అనిపిస్తాయి. ఈ రాళ్ళ చుట్టూ, మొక్కల మొదళ్ళ చుట్టూ పోసిన మట్టి కాస్త ఎత్తులో ఉంటే ఆ మొక్కలు గుట్టల్లో సహజంగా పెరుగుతున్నభావన కలు గుతుంది.



# జిన్, షారీ, సబామికీలను రూపొందించడం
## (Jin, Shari, Sabamiki)

బోన్సాయ్‌లంటే ప్రకృతిలో సహజంగా, స్వేచ్ఛగా పెరిగే వృక్షాలకు సూక్ష్మరూపాలని మనం పదే పదే చెప్పుకుంటూనే ఉన్నాం గదా! ప్రకృతి వైపరీత్యాలకు, ఆటుపోటులకు కొన్ని వృక్షాలు పూర్తిగా శిథిలమై పోతుంటాయి. కొన్నిసార్లు వృక్షాల్లోని కొన్నిభాగాలు - కాండాగ్రమో, కొమ్మల కొనలో చెట్టుబెరడో, భూమిపైన ఉబికి పెరిగిన ఉపరితలపు వేళ్ళో - ఆ ఆటు పోటుల తాకిడికి గురికావడంతో శిథిలశకలాలతో మనకు దర్శన మిస్తుంటాయి.

ఉధృతమైన గాలి తాకిడికి విరిగిపోయి - ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ కాలగమనంలో నునుపుదేలి ఎండు పేడులా మారిన కాండాగ్రం, కొమ్మలు, నిలువునా చీలి గాడులు పడిపోయిన బెరడు, తొలిచేసిన కాండాలు చూస్తుంటే - ఆ చెట్లు ఎన్నో ఏళ్ళుగా కష్టనష్టాలకోర్చుతూ ధైర్యస్థైర్యాలతో నిలచి జీవితాన్ని సాగిస్తున్న భావన మనకు కలుగుతుంది.

మన బోన్సాయ్‌లో కూడా చెట్లకు ఎన్నోఏళ్ళ వయసున్నట్లు, అవి మరెన్నో ఒడిదుడుకులను ఎదుర్కొన్నట్లు భ్రమింపజేసేందుకు కూడా కొన్ని ప్రత్యేక విధానాలున్నాయి. వాటిలో జిన్, షారి, సబామికీలు ప్రధానమైనవి.

## జిన్

కాండాగ్రమో, కొమ్మకొసో లేదా కొన్ని కొమ్మలో విపత్కర పరిస్థితుల తాకిడికి కృశించి నిర్జీవమైపోగా శిథిల శిల్పశకలాల్లా అనిపించే మొక్క భాగాలనే 'జిన్' అంటారు.

కొమ్మలతో, ఆకులతో నిండుగా కళకళలాడుతున్న చెట్టులో జిన్ రూపొందిస్తే అది ఎంతో కృతకంగాను, అసహజంగాను ఉంటుంది. చెట్టు పెరగడానికి వాతావరణం అన్నిరకాలుగాను ప్రతికూలంగా ఉన్నప్పుడు తన మనుగడకోసం ఆ చెట్టుచేసే పోరాటపు చిహ్నాలు మనకు ఆచెట్టులో కనిపిస్తుంటాయి. వాటి బెరడు ఎండిపోయి బీటలు వారినట్లుంటుంది. కొమ్మలు సజీవంగా ఉన్నా వాటిలో నిండుదనం లోపిస్తుంది. ఇలాటి మొక్కలలో 'జిన్' రూపొందిస్తే ఎంతో సహజంగా ఉండి, వాటి వయసు ద్విగుణీకృతమైన భావన మనకు కలుగుతుంది. బోన్సాయ్ మొక్కలకు ఎంత వయసు మీరినట్లుగా కనిపిస్తే అంత అందం గదా!

బోన్సాయ్ మొక్కల్లో మూడురకాల జిన్‌స్ని రూపొందించవచ్చు.

- కాండాగ్రాన్ని జిన్‌గా మార్చడం



# పటం 91 : జిన్



- కొమ్మల కొనలను జిన్ చెయ్యడం
- మొత్తం కొమ్మనే జిన్ చెయ్యడం

## *కాండాగ్రాన్ని జిన్‌గా మార్చడం:*

కాండాగ్రాన్ని జిన్‌గా మార్చడం అన్నిట్లోకి తేలికైన పద్ధతేగాని - ఆ జిన్‌కి సహజత్వాన్ని కల్పించడమే కష్టమైన విషయం!

అదృష్టవశాత్తు కాండం దృఢంగా ఉన్న మొక్కొకటి ఏ నర్సరీలోనో, ఊరిబయటో దొరికిందను కోండి! కాండం దృఢంగా ఉన్నప్పుడు మొక్క ఎత్తుగా ఉండడం కూడా సహజం. కాండం బావుంది గదా అని మొక్క భాగాన్ని అడ్డంగా కోసేసి ఎత్తు తగ్గించి బోన్సాయ్ చెయ్యడం పద్ధతి కాదు గదా! ఇదిగో ఇటు వంటప్పుడే ఈ 'జిన్' ఆపద్బాంధవిలా ఆదుకుంటుంది. అదెలాగో చూద్దాం!



## పటం 92 : రకరకాల జిన్‌లు








కాండాగ్రంలో ఎంత భాగం జిన్‌గా మార్చుదామను కుంటామో అక్కడ కాండం చుట్టూ గాటు బెట్టి బెరడు వలిచెయ్యాలి. ఈ ప్రక్రియ మొక్కలు ఏపుగా ఎదిగే వర్షాకాలంలో అయితే బావుంటుంది. ఎందుకంటే ఆ కాలంలో బెరడు తేలిగ్గా ఊడివస్తుంది. ఏ కారణం చేతనైనా బెరడు తేలిగ్గా ఊడిరాన ప్పుడు దానికి ఆవిరికాపడం పెట్టాలి. అంటే

బాగా కాగిన నీళ్ళలో ఒకటవల్ ముంచి దాన్ని జిన్ చెయ్యదలచుకున్న కాండాగ్రభాగం చుట్టూ కొద్దిసేపు చుట్టాలి. అప్పుడు బెరడు తేలిగ్గా ఊడివస్తుంది. అంతేగాకుండా వేడికి మెత్తగిలిన ఆ భాగానికి రాగితీగ చుట్టి మనకు కావలసిన విధంగా వంచుకోవచ్చు కూడాను!

అలా వంచాక ఈ జిన్ భాగాన్ని పూర్తిగా ఎండనివ్వాలి. ఇలా ఎండడానికి రెండుమూడు వారాలు పట్టవచ్చు. ఆ తరువాత మెరుగు కాగితం (Sand —Paper) తో దాన్ని బాగా నునుపుతేలే వరకూ రుద్దాలి. మరో రెండు మూడు నెలలు పోయాక ఈ జిన్ భాగానికి లైమ్ సల్ఫర్‌ని పుయ్యాలి. లేకపోతే ఈ ఎండు కొమ్మ చివికి పోయే ప్రమాదముంది. ఈ లైమ్ సల్ఫర్ పూయడం వలన కొమ్మ ముదురు గోధుమ రంగునుండి తెలుపు కలసిన బూడిద రంగుకి మారుతుంది. ఈలైమ్ సల్ఫర్ చాలా శక్తివంతమైనది, ప్రమాద కరమైనది కూడాను! అందుకే ఇది పచ్చని కాండం మీదగాని, ఆకుల మీద గాని, వేళ్ళమీదగాని, చివరకు కుండీలోని మట్టి మీదగాని ఏమాత్రం ఒలక్కుండా జాగ్రత్త పడాలి. ఎండిపోయిన భాగం బుగిలిపోకుండా చెయ్యడానికి ఈ లైమ్ సల్ఫర్‌ని రెండేళ్ళపాటు కనీసం సంవత్సరానికి రెండుసార్లైనా రాస్తూ ఉండాలి. లైమ్ సల్ఫర్ దొరకని పక్షంలో దాని బదులు క్లియర్ వార్నిష్‌గాని, నీళ్ళుగలిపిన నిమ్మరసం గాని ఉపయోగించవచ్చు.

ఎండకు ఎండి వానకు తడిసిన కొమ్మలు వాగులోని బండరాళ్ళలా అరిగి నునుపుదేలి ఉంటాయి. మనం తాటవలిచిన కాండాగ్రాన్ని అలాఅనిపించేలా చెయ్యడం కోసమే ఈ దీర్ఘప్రక్రియ!

అయితే అభిరుచులు రకరకాలు గదా! కొందరు ఈజిన్‌భాగాన్ని నున్నగా చెయ్యకుండా నన్ననన్న చీలికలుగా పొరలు లేచిన కట్టెలా ఉంచడానికే ఇష్టపడతారు. దీన్నే 'రఫ్ జిన్' అంటారు.

జిన్ నునుపుగా ఉన్నా, రఫ్‌గా ఉన్నా ఎండిన భాగం బుగిలి పోకుండా ఉండడానికి చేసే ప్రక్రియంతా చేయవలసిందే.

కాండాగ్రపు జిన్‌లు మూడురకాలు:

— కాండాగ్రం కొనదేలి ప్రక్క కొమ్మ లేవీ లేకుండా ఒకే శిఖరంలా ఉండడం. కొన దేలడం అంటే మరీ సూది మొనలా గాకుండా అగ్ర భాగం కాస్త గుండ్రంగా ఉండాలి.

— కాండాగ్రానికి ప్రక్క కొమ్మలు కూడా ఉండడం



— కాండాగ్రం అగ్ని శిఖల్లా అనేక చీలికలు చీలి ఉండడం. ఈ పద్ధతి కాండం మరీ లావుగా ఉన్నప్పుడు ఉపయోగపడుతుంది. చెట్టుకు, తొట్టికి మించిన సైజులో కాండాగ్రం మొద్దులా ఉన్నప్పుడు దాన్ని జిన్ పేరిట బెరడు లాగేసినప్పటికీ మనం అనుకున్న ఎఫెక్టు రాదు. పైగా అర్థంతరంగా కాండాగ్రాన్ని కట్ చేసినట్లు చూడగానే తెలుస్తుంటుంది. అప్పుడు దాన్ని అనేక చీలికలుగల జిన్‌లా చేస్తే కొంత సహజంగా ఉంటుంది.

## కొమ్మలను జిన్‌గా మార్చడం

కాండాగ్రాన్ని మలచినట్లే కొమ్మకొనలను గాని, అవసరమనుకుంటే కొమ్మ నంతటినీ కూడా జిన్‌గా మార్చుకోవచ్చు.

## షారీ:

మొక్క కాండానికిగాని, కొమ్మకుగాని



పటం 93 : షారీ



పైబెరడు మాత్రం ఒలిచి వేయడాన్ని 'జిన్' అంటే, మొక్కకు కవచంలా ఉండే బెరడును దాటి కాండంలోకి లోతుగా చీల్చడాన్ని 'షారీ' అంటారు. ఎటొచ్చీ 'జిన్' లా 'షారీ' ఒక్క కాండానికి, కొమ్మలకే పరిమితం కాదు. కాండాగ్రానగాని, మధ్యలోగాని, కొమ్మలోగాని మొదలైన ఈ షారీ ఒక్కోసారి కాండ పీఠం దాటి వేళ్ళ వరకూ కూడా ఉంటుంది.

ఇక షారీని రూపొందించడం -

సజీవంగా ఉన్న కాండంలోగాని, కొమ్మలోగాని, వేరులోగాని, కొంతభాగాన్ని మాత్రం నిలువుగా చీల్చి వదిలేస్తారు. అంటే సజీవంగా ఉన్న ఆ భాగంతో పాటు చీల్చిన భాగం కూడా చెట్టునే ఉంటుందన్న మాట! ఎటొచ్చీ మనం చీల్చడం మూలంగా ప్రధానభాగంనుండి విడివడి ఆహారం అందక క్రమేణా ఎండిపోతుంది.

పచ్చిగా ఉన్న చీలిక పూర్తిగా ఎండిపోకుండా ఉండాలంటే చీల్చినభాగం, సజీవంగా ఉన్నభాగం కలసిన చోట ప్లాస్టిక్ గమ్ పుయ్యాలి.

ఒకవేళ బెరడుని కాండం పొడవునా చీల్చాలనుకుంటే ఆ చీలిక మట్టి అంటే దాకా ఉండగూడదు. అంటే కుండీలోని మట్టికి రవ్వంత పైనే ఆగిపోవాలన్నమాట! లేనట్లైతే మట్టిలో నుండి క్రిమికీటకాలు చీలికద్వారా కాండంలోకి ప్రవేశించి మొక్కనే నాశనం చెయ్యవచ్చు.

## సబామికి:

మహావృక్షం అనగానే ఆకాశాన్నంటే కాండాగ్రం, దిగంతాలకు వ్యాపించినట్లుండే కొమ్మలు, ఇద్దరు మనుషులు చేతులు చాచినా అందని మ్రాను, బాలనాగమ్మ కథలోలా పెద్ద తొఱ్ఱ, నాగుబాముల్లా పెనవేసుకున్న వేళ్ళు - ఇవన్నీ గుర్తొస్తాయి. బుల్లి బుల్లి చెట్లనే ప్రత్యేకంగా మలచి ఇలాటి మహావృక్షాలుగా భ్రమించేలా చెయ్యడమే బోన్సాయ్ పెంపకం దారుల ధ్యేయం గదా! అందుకే 'సబామికి' కి బోన్సాయ్‌శైలిలో ఒక ప్రత్యేక స్థానం ఉంది.

'సబామికి' అంటేనే 'తొలిచిన కాండం' (తొఱ్ఱ) అని అర్థం! చెట్లకు తొఱ్ఱలు ఎలా ఏర్పడతాయనేది మనకు తెలుసు. వడ్రంగి పిట్టల వంటి పక్షుల వలనగాలి, కాండానికి ఏదైనా బలమైన దెబ్బ తగలడం వలనగాని కాండంలో కొంత మేర బుగిలిపోయి తొర్రలా ఏర్పడవచ్చు. ఆ తొర్ర అలాగే చెట్టుతో పాటు పెరిగి పెద్దదవడం - దానిలో పక్షులు, జంతువులు నివాస మేర్పరచుకోడం కూడాకద్దు!

అలాటి 'ప్రత్యేకతను' మన బోన్సాయ్‌లో కూడా కృత్రిమంగా సృష్టించవచ్చు. ఏ పిక్నిక్‌కో వెళ్లినప్పుడు గొడ్లు తినడం మూలంగా ఎత్తు పెరగకుండా ఉండిపోయి, చెదవలనగాని, మరేకారణంగా గాని కాండంలో కొంతభాగం బుగిలిపోయి ఉన్న ముదురు



## పటం 94 : సబామికి

చెట్టు దొరికిందను కోండి! చెట్టులో ఆ బుగిలిన భాగాన్ని జాగ్రత్తగా తొలిచి తొర్రచేసి 'సబామికి' గా మలచుకోవచ్చు. అంటే మనకు రెడీమేడ్ గా సబామికి దొరికినట్లన్నమాట!

అయితే అదే మొక్కలో చెట్టు ఆకారాన్ని చెదరగొట్టే అనవసరమైన కొమ్మలు, రెమ్మలు ఉండి ఉండవచ్చు. అటువంటప్పుడు మనకళాదృష్టిని నేర్పును ఉపయోగించి అనవ



సరమనుకున్న కొమ్మల్లో కొన్ని తీసివేయ డంతో పాటు చెట్టుకు సమతూకంగా ఉండడా నికి అవసరమనుకున్న కొమ్మలను జిన్‌గానో, షారీగానో మలచుకోవచ్చు. ఇలా ఒకే మొక్కలో సబామికీని, జిన్‌ను లేదా షారీని మేళవించినప్పుడు ఆ చెట్టుకు మరింత ప్రత్యే కత లభిస్తుంది.

ఒక ముదురు చెట్టును బోన్సాయ్‌గా రూపొందించవలసి వచ్చినప్పుడు ఎన్నోరకా లుగా ఆ చెట్టును షేప్ చేసుకోవలసి ఉంటుంది. అవసరాన్ని బట్టి ఆకులు గిల్లి వెయ్యాలి. రెమ్మలు కత్తిరించాలి. కొమ్మలను రంపంతో కూడా కొయ్యవలసి రావచ్చు. అలా షేప్ చేసేటప్పుడు చెట్టు ముఖభాగంలో ఉన్న కొమ్మను తొలగించవలసి వచ్చిందనుకోండి! అది లేతగా ఉంటే తుంచిన చోట కాండం మీద ఏర్పడిన మచ్చ మొక్క పెరిగిన కొద్దీ క్రమేణా కాండంలో కలసిపోతుంది. అదే ముదురు కొమ్మ అయితే దాన్ని కోసిన చోట పెద్ద గాటుబడుతుంది. ఆ గాటు కాండానికి కుడిఎడ మలనో, వెనుకభాగానో గాక ముఖ భాగాన ఉండడం పెద్ద చిక్కే! అలాటప్పుడు ఈ సబా మికి టెక్నిక్ మనకు తిరుగులేని ఆయుధంలా ఉపయోగపడుతుంది.

కొమ్మకోసినప్పుడు ఏర్పడ్డగాటు దగ్గర పదునైన చాకుతో మరికాస్తలోతుగా తొలిచి తొర్రలా చెయ్యాలి. అప్పుడిది సహ జంగా ఏర్పడిన సబామికీ లానే ఉంటుంది. ఈ దశలో మొక్కకు నీళ్ళు పోసేటప్పుడు ఎట్టిపరి స్థితుల్లోను ఆ తొర్రలో నీళ్ళు నిలచిపోకుండా జాగ్రత్తపడాలి. తొర్రలో నీరునిల్వ ఉన్న ట్లైతే కాండం కుళ్ళిపోయే ప్రమాదం ఉంది. అందుకని నీరునిలవకుండా జారిపోయేలా ఆ తొర్రలోనుండి మట్టిలోకి వాలుగా గాటు పెట్టు కోవాలి.

జిన్‌కి, షారీకి లాగానే సబామికికి కూడా కాండం తొలచిన చోట లైమ్‌సల్ఫర్ పుయ్యాలి. అలా చెయ్యకపోతే చెట్టు కుళ్ళిపోనూ వచ్చు లేదా అది గాయాన్ని మాన్పుకునే ప్రయ త్నంలో ఆ తొర్ర పూడి పోనూ వచ్చు. అలా జరిగితే మనం పడిన శ్రమంతా వృధా అయినట్లే గదా!





వేప-30 సెం.మీ
ఎక్స్‌టెండెడ్ బ్రాంచ్



మేడి-30 సెం.మీ
ట్రిపుల్ ట్రంక్

మేమ్ బోన్సాయ్‌లు
డా. ప్రసాద్



శ్రీమతి శ్రీదేవి
మర్రిజాతి చెట్టు
ఏటవాలు పద్ధతి - 45 సెం. మీ







కేస్కేడ్.
జూనిపరస్-60 సెం. మీ
శ్రీమతి
ఊర్మిళా చంద్రశేఖర్ రెడ్డి

ఫైకస్ గ్లోమిరేటా
ట్రిపుల్ ట్రంక్-60 సెం. మీ
డా. ప్రసాద్



బారింగ్‌టోనియా స్ప్రీషియోజా
బ్రూమ్‌స్టైల్ - 45సెం.మీ 20సం.
డా. ప్రసాద్

రావి-20సెం.మీ
ట్విన్‌ట్రంక్





# 8 - బుల్లి బోన్సాయ్‌లు

## (Mame Bonsai)

బోన్సాయ్ అంటేనే వామన వృక్షాలు గదా! ఆ వామన రూపాల్లో కూడా మరింత సూక్ష్మవృక్షాలు ఈ బుల్లి బోన్సాయ్‌లు! బోన్సాయ్‌లను వాటిసైజును బట్టి పెద్ద బోన్సాయ్‌లు (Big Bonsai), మధ్యరకం బోన్సాయ్‌లు (Medium Bonsai), బుల్లి బోన్సాయ్‌లు (Mame Bonsai), అని మూడురకాలుగా విభజించుకోవచ్చని అనుకున్నాం గదా! సుమారు 2,3 అడుగుల ఎత్తువరకు ఉన్నవి పెద్ద బోన్సాయ్‌లైతే, సుమారు రెండు, మూడంగుళాల నుండి 6 అంగుళాల ఎత్తువరకు మాత్రమే ఉండేవి మినియేచర్ (Miniature Bonsai) లు. సుమారు ఒక అడుగు ఎత్తులో ఉండేవి మీడియం బోన్సాయ్‌లు.

చూడడానికి ఎంతో ముద్దుగా ఉండే ఈ మేమ్ బోన్సాయ్‌లను పెంచాలని ఔత్సాహిక బోన్సాయ్ కళాకారులు ఎంతో ముచ్చటపడు తుంటారు. అయితే అది అనుకున్నంత తేలిక గాదు. పరిమాణంలో ఎంతో చిన్నగా ఉన్నా అసలైన బోన్సాయ్‌లకుండ వలసిన లక్షణాలన్నీ వీటికి ఉండి తీరవలసిందే! ఎటొచ్చీ మరీ పొట్టిగా ఉంటాయి గనుక కొమ్మల వలయం ఒక్కటుంటే సరిపోతుంది.

ప్రకృతి సిద్ధంగానే కొన్ని చెట్లు చాలా పొట్టిగా ఉన్నప్పుడే పూలు పూచి, కాయలు కాస్తుంటాయి. అంతమాత్రాన అవి బుల్లి బోన్సాయ్‌లనడానికి వీల్లేదు. ఎందుకంటే బోన్సాయ్ ప్రత్యేక లక్షణాలైనటువంటి దృఢమైన కాండం గాని, కొమ్మల వలయాలు గాని వీటికుండవు గదా! ఇక్కడ మనం మరో విషయం గుర్తు పెట్టుకోవాలి. ఏ మొక్కయినా



ఎంతచిన్న కుండీలో పూలుపూచి కాయలు కాచినా వాటిసైజు మాత్రం మారదు. కాని బోన్సాయ్‌లో చెట్ల సైజుతో బాటు ఆకులు, పూలు, కాయల సైజు కూడా తగ్గితేనే బాగుం టుంది - ముఖ్యంగా మేమ్ బోన్సాయ్‌లలో.

అందుకే మొక్క పొట్టిగా ఉండడమే గాక, ధృఢమైన పీఠం, పెళుసుబారి పొరలు లేస్తున్నట్లున్న బెరడు, చారికలు వంటి చెట్టు వయసును తెలిపే కాండం; అతి సన్నవి, చిన్నవి అయిన ఆకులు, పూలు, కాయలు; దగ్గరదగ్గరగా ఉండే కణుపులతో కూడిన మొక్కలనే ఈమేమ్ బోన్సాయ్‌ల పెంపకానికి ఎన్నుకోవాలి. ఈ విధానానికి సీమచింత, చింత, సుబాబుల్, సర్వి, పెద్దఉసిరి, కరివేప, బోటిల్ బ్రష్ వంటి మొక్కలు బాగా అనువుగా ఉంటాయి.

## *బుల్లి బోన్సాయ్‌ల కనువైన మొక్క లను పొందే విధానాలు:*

## *(Methods of Propagation)*

మామూలు బోన్సాయ్‌ల లాగే విత్తనాలు నాటి, కొమ్మలు పాతి, అంటుగట్టి బుల్లిబోన్సా య్‌లకు కావలసిన మొక్కలను సిద్ధం చేసుకో వచ్చు. విత్తనం నాటడం ద్వారా లభించిన మొక్కల మొదలు ధృఢంగా ఉండి క్రమంగా కొనదేలుతూ పోయిన కాండం, తీరైన కొమ్మలు, ఆకుల అమరికలతో మంచి మేమ్ బోన్సాయ్‌ని తేలిగ్గా తయారుచేసుకోవచ్చు.

అదే కొమ్మలద్వారాను, అంటుగట్టడం (ముఖ్యంగా గాలిఅంటు) ద్వారా వచ్చిన మొక్కలు త్వరగా వయసు కనిపించే రెడీమేడ్ మేమ్ బోన్సాయ్‌లుగా తయారవుతాయి.

కాస్త పెరిగి అనువుగా ఉన్న మొక్క నర్సరీలోగాని, మరెక్కడయినా గాని మనకు దొరికితే దాన్ని స్పెషల్ టెక్నిక్స్ ఉపయో గించి బుల్లి బోన్సాయ్‌గా మలచుకోడానికి ఆట్టే కాలం పట్టదు.

మొక్క బుల్లిగా, ముద్దుగా ఉన్నట్లు గానే వీటి కుండీలూ ఉండాలి. ఈ మేమ్ బోన్సాయ్‌ల కోసం చిన్ని చిన్ని అందమైన కుండీలను ప్రత్యేకంగా తయారుచేస్తారు. ఈ కుండీలు మట్టివైతేనే మంచిది. ఎక్కువైన నీళ్లు పోయే బెజ్జాలులేని చిన్న చిన్న కుండీలను ఉపయోగించడం కూడా కద్దు. అయితే అలాటి వాటిని ఉపయోగించినప్పుడు అందులోని మొక్కకు నీళ్ళు పోసిన కొద్దిసేపటి తర్వాత కుండీని జాగ్రత్తగా ప్రక్కకు వంచితే ఎక్కువైన నీళ్ళు బయటి కొచ్చేస్తాయి.

ఈమేమ్ బోన్సాయ్‌లకు నీళ్ళు పోసే విషయంలో ఎంతో శ్రద్ధ అవసరం. ఎందుకంటే నీళ్ళు ఎక్కువైకుళ్ళిపోతుందేమోననే భయంతో తక్కువ పోస్తే నీళ్ళు చాలక మొక్క ఎండిపో వచ్చు. నీళ్ళు చాలవేమోననే భయంతో ఎక్కువ పోసి మొక్కను కుళ్ళబెట్టే ప్రమాదమూ ఉంది.



ఉంది. అందుకే ఈ మొక్కల కుండీల్లో పోసే మట్టిలో ముప్పాతిక వంతువరకు ఇసుక గలిపితే ఎక్కువైన నీరు నిలవ ఉండకుండా కారిపోతుం టుంది. ఆ వార మొక్కకు అరగారగా నీళ్ళు పోస్తుండాలి. ఇలా ఎప్పటికప్పుడు నీళ్ళు పొయ్యడం కూడా ఒక సమస్యే గనుక దానికీ ఒక మార్గం ఉంది. ఒక పెద్ద ట్రే లాటి దాంట్లో మాస్‌నుగాని, బాగా చీల్చిన కొబ్బరి పీచును గాని పరచి ఆ ట్రేలో ఈ మేమ్ బోన్సాయ్ తొట్లను పెట్టుకుంటే కుండీల్లో ఎక్కువైన నీళ్ళు, మనం మొక్కలకు పోసేటప్పుడు ట్రేలో పడిన నీళ్ళు మాస్‌ను ఎప్పుడూ తేమగా ఉండేలా చేస్తాయి. చల్లదనానికి మొక్క వాడిపో కుండా నవనవలాడుతూ ఉంటుంది. అప్పుడ ప్పుడూ మొట్టమొదటి సారిగా మొక్కను నాటి నప్పటిలా కుండీని నీళ్ళతొట్టిలో దించితే డ్రైనేజి రంధ్రాల్లోంచి కుండీలోకి వచ్చిన నీరు మట్టి అంతటినీ తడిచేలా చేస్తుంది.

మొక్క ఎండలో ఉండగా నీళ్ళు పొయ్యడం ఎప్పుడూ మంచిది కాదు. పోసిన నీళ్ళు వేడెక్కి సున్నితమైన వేళ్ళని మాడ్చేసే ప్రమాదం ఉంది. కుండీలో ఇసుకతో పాటు కలిపే మట్టి బాగా సన్నగా ఉన్నట్లైతే ఈ చిన్ని మొక్కల సున్నితమైన వేళ్ళు ఆ మట్టి లోకి తేలికగా చొచ్చుకుని పోగలుగుతాయి.

## రీపాటింగ్ (Repotting):

సంవత్సరానికొకసారైనా కుండీలోని మట్టిని మార్చుతుండాలి. ఇందుకోసం కుండీలో నుండి మొక్కను తీసినప్పుడు ముది రిన పెద్ద వేళ్ళని కత్తిరించేసుకోవాలి. అలాచేస్తే నీటిని బాగా పీల్చగలిగే సన్నటి వేళ్ళు బాగా పెరగడానికి అవకాశం ఎక్కువగా ఉంటుంది. వేళ్ళను కత్తిరించినప్పుడు తగిన మేరకు ఆకు లను కత్తిరించడం మరచిపోగూడదు.

కేవలం చారెడు మట్టిలోనే సంవత్సరాల తరబడి పెరిగే ఈ మేమ్‌లను రెండు మూడేళ్ళ కొకసారైనా కొన్నాళ్ళపాటు పెద్ద తొట్టిలో పెడితే అవి శక్తిని పుంజుకుంటాయి. ఆ సమ యంలో పెరుగుదల బాగా ఉంటుంది గనుక షేప్ చెడకుండా మరింత జాగ్రత్తగా మొక్కను ట్రిమ్ చేసుకుంటుండాలి.

బుల్లి బోన్సాయ్‌లు మరీ వేలెడు మొక్క లవడంతో రోజంతా ఎండలో ఉంటే తట్టుకో లేవు. సాధ్యమైనంతవరకు వీటిని బాగా వెలుతు రుసోకే నీడప్రదేశంలో పెట్టడం మంచిది. అలా గని ఎప్పుడూ నీడన ఉంచామనుకోండి! తోట కూరకాడల్లా ఊరికే సాగిపోతాయి. మొక్క పొందికగా, బలంగా పెరగాలన్నా; పూలూ, కాయలూ కాయాలన్నా దానికి సూర్యరశ్మి అవసరం! పైగా తగుమాత్రపు ఎండ మొక్కను



**పటం 95 : బుల్లి బోన్సాయ్‌కి ద్రవరూపంలో ఉన్న ఎరువును సిరంజ్‌తో ఎక్కించడం**



చీడపీడలనుండి కూడా కాపాడుతుంది. అందుకే ఈ మేమ్‌లను రోజులో కొంతసేపన్నా - వీలున్నంతవరకు ఉదయం పూట ఎండతగిలేలా ఉంచాలి.

## ఎరువుల వాడకం:

సంవత్సరాని కొకసారి ఎటూ మట్టిని మారుస్తుంటాం గనుక ఆ మట్టిలోని పోషకాలే మొక్కకు సరిపోతుంటాయి. ఈ మొక్కలకు ఎరువు వెయ్యకపోయినా ఫర్వాలేదుగాని, చిటికెడు ఎక్కువైనా ప్రమాదమే!

మరీ అవసరం అనుకుంటే మొక్క పెరుగుదల కోసం నత్రజని ఎరువులని, పూలుకాయల కోసం పొటాషియం, భాస్వరం ఎరువులని తగిన మోతాదులో వాడుకోవచ్చు. మేమ్ బోన్సాయ్‌లు మరీ చిన్నవిగా ఉంటాయి గనుక ద్రవరూపంలో ఉన్న ఎరువులను ఇంజక్షన్ సిరంజ్‌తో కూడా ఇస్తుంటారు.

## టెక్నిక్స్:

ఈ మొక్కలు మరీ చిన్నవి, సున్నితమై



నవి కావడంతో వైరింగ్ ద్వారా మొక్కని షేప్ చెయ్యడం చాలా కష్టం! అందుకే దీనికి గ్రోఅండ్ క్లిప్ పద్ధతి ఎంతో అనువుగా ఉంటుంది. మరీ అవసరం అనుకుంటే బ్రైన్ దారాన్ని ఉపయోగించి మొక్కల ఆకారాన్ని మలచుకోవచ్చు. సమయానుకూలంగాను, మరీ గుబురుగా ఉండి మొక్క అందం కమ్మకు పోతోందనిపించినప్పుడు మామూలు బోన్సాయ్‌లో లాగానే ఇక్కడ కూడా ఎక్కువనుకున్న ఆకులను తీసేస్తుండాలి. మేమ్‌ల ట్రిమ్మింగ్‌కి, షేపింగ్‌కి ఉపయోగించే పరికరాలు బాగా పదునుగా ఉండాలి. మొక్కను మరీ ఎక్కువగా ప్రూన్ చేసినప్పుడు కొద్ది రోజులపాటు పూర్తిగా నీడలో పెట్టాలి.

## *బుల్లి బోన్సాయ్ కుండీలను ఉంచవలసిన విధం (Display)*

సహజ ప్రకృతికి దూరం అయిపోవడం, స్థలాభావం ఈ నాటి నాగరిక మానవుడిని బోన్సాయ్ పెంపకానికి పురి కొల్పుతున్నాయని అందరూ అనుకునేమాటే! కాని ఇది ఒక్కటే కారణమని అనిపించదు. ఏదో ఒక విలక్షణమైన పనిని చెయ్యడం ద్వారా తన ప్రత్యేకతను చాటుకోవాలనుకోవడం మానవ నైజం! బోన్సాయ్ పెంపకం ఒక కళగా రూపొంది, పెంపొందడానికి అది కూడా ఒక కారణం కావచ్చు. బోన్సాయ్‌ని పెంచడమే ఒక విలక్షణ విధానం అనుకుంటే బోన్సాయ్‌లో బోన్సాయ్‌లైన ఈ మేమ్‌లను పెంచడం, మరింత ప్రత్యేకతగదా! అందుకే వాటిని ప్రదర్శించడానికి కూడా ప్రత్యేక శ్రద్ధ అవసరం!

మేమ్ బోన్సాయ్‌లను, విడి విడిగా గాక ఒక పెద్ద బోన్సాయ్‌కి క్రిందో, ప్రక్కనో తోడు పెళ్ళి కూతురులా పెడుతుంటారు కొందరు. అలాగాకుండా కేవలం వీటినే ఒక గ్రూపుగా కూడా అమర్చుకోవచ్చు. ప్రత్యేకమైన స్టాండ్ మీద అంచెలంచలుగా - పైవరసలో కొండల మీద పెరిగే శృంగాకార వృక్షజాతులు, ఆ తరువాత వరుసలో ఎత్తుగా విశాలంగా పెరిగే ఆకురాల్చే వృక్షజాతులు, పూర్తిగా క్రింది వరుసల్లో గడ్డిజాతి మొక్కల్లాటివి అమరిస్తే సహజత్వానికి దగ్గరగాను, చూడడానికి అనువుగాను, అందంగాను కూడా ఉంటాయి.



# 9 - బోన్సాయ్ మొక్కల సంరక్షణ

## (Care of the Bonsai)

ఏ మొక్కైనా ఆరోగ్యంగా, బలంగా పెరగాలంటే సారవంతమైన నేల, పరిశుభ్రమైన గాలి, చక్కటి నీటివసతి, తగినంత సూర్యరశ్మి అవసరం! ప్రకృతిలో స్వేచ్ఛగా పెరిగే మొక్కలకు ఎవరి ఆలనాపాలనలతో నిమిత్తం లేకుండా వాటి అవసరాలను ఆ ప్రకృతే తీరుస్తుంది. కాని మనం తోటలో పెంచుకుంటున్న మొక్కల - అందునా కుండీల్లో పెరిగే మొక్కల దారే వేరు! ఇంక అది బోన్సాయ్ అయితే దాని సంగతి వేరే చెప్పనవసరం లేదు.

— కుండీలోని మట్టిసారవంతంగా ఉందా? లేదా?

— మొక్కకు నీళ్ళు ఎప్పుడు పొయ్యాలి? ఎలా పొయ్యాలి? ఎన్ని పొయ్యాలి?

— మొక్కలోని అన్ని భాగాలకు గాలిసరిగా తగుల్తోందా? లేదా?

— మొక్కకు ఎండ ఎంత అవసరం? ఏయే సమయాల్లో ఎండ తగలవచ్చు?

— ఈ మొక్కలకు ఎరువులు వేయవచ్చా లేదా?

— వేస్తే ఎలాటి ఎరువులు ఏయే సమయాల్లో వాడాలి?

— మొక్కకు చీడపీడలు ఆశించకుండా ఎలాటి జాగ్రత్తలు తీసుకోవాలి? ఒక వేళ ఆశిస్తే వాటిని అరికట్టడం ఎలా?

ఇలాటి విషయాలన్నిటి గురించి అనునిత్యం ఎంతో శ్రద్ధవహిస్తూ బోన్సాయ్ పెంపకందారు తన మొక్కలను పసిపిల్లల్లా సంరక్షించుకోవాలి.

మన వాతావరణానికి తేలికగా తట్టుకుని నిలబడగల రావి, మర్రి, మద్ది, జువ్వి మొదలైన మొక్కలను గనుక బోన్సాయ్ పెంపకానికి



మనం ఎన్నుకున్నట్లైతే 'అసలు మొక్కను బ్రతికించగలమా, లేదా' అనే భయం ఉండదు. అలాటప్పుడు మన శక్తిని, కాలాన్ని మనం అనుకున్న శైలిలో బోన్సాయ్‌ని తీర్చిదిద్దడానికి వినియోగించవచ్చు. ఎటొచ్చీ అవి ఎంతమొద్దు మొక్కలైనా దోసిలంత బోన్సాయ్ తొట్లో మహా వృక్షాల్లా మలచాలనుకున్నప్పుడు ప్రత్యేక శ్రద్ధ చూపించక తప్పదు.

## బోన్సాయ్‌లకు నీళ్ళు పెట్టడం

## (Watering Bonsai)

మొక్కలకు నీళ్ళు తక్కువైనందువలన కాకుండా, నీళ్ళు ఎక్కువైనందువల్లనే అవి చనిపోతాయి అనే విషయం మనందరికీ ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అందుకే మనం ఎంతో అపురూపంగా పెంచుకునే బోన్సాయ్ మొక్కలకు ఈ ప్రమాదం రాకుండా ఉండాలంటే వాటికి నీరు సమతూకంగా ఉండాలి. అన్నిరకాల మొక్కలకు నీటి ఆవశ్యకత ఒక్కటిగా ఉండదు.

సీతాఫలం, నిమ్మ, నారింజ, సైకాస్ లాటి మొక్కలకు నీరుకాస్త అటూ ఇటూ అయినా ఫరవాలేదు. కాండంలో నీటిపాలు ఎక్కువగా ఉండే ఎడీనియం, ఫైకస్ జాతి మొక్కలకు తక్కువనీరే సరిపోతుంది. కాని లాంటానా, మందార జాతి మొక్కలకు ఏమాత్రం నీరు తగ్గినా వాలిపోతాయి.

పైగా మొక్కకు ఎంతనీరు అవసరమన్నది ఆ మొక్క తీరునిబట్టే మారినట్లే వాతావరణాన్ని బట్టి, తొట్టెఉన్న ప్రదేశాన్ని బట్టి మారుతుంటుంది.

సాధ్యమైనంతవరకు నీళ్ళు ఉదయం పూట పోయడం ఉత్తమం. వాతావరణం చల్లగా ఉన్నప్పుడు ఉదయం పోసిన నీరే మొక్కలకు సరిపోవచ్చు.

వర్షాకాలంలో రోజుకొక్కసారి కూడా నీళ్ళు పోయవలసిన అవసరం కలుగకపోవచ్చు. కుండీలో మట్టి ఏమాత్రం తేమలేకుండా పొడిగా ఉంది అనిపించినప్పుడు నీళ్ళుపోస్తే సరిపోతుంది.

ఇంకవేసవి కాలం సంగతి! మనరాష్ట్రంలో - ముఖ్యంగా ఎండవేడిమి ఎక్కువగా ఉండే గుంటూరు, విజయవాడ, రాయలసీమ ప్రాంతాల్లో పెరిగే బోన్సాయ్ మొక్కలకు ఉదయమూ, సాయంత్రమూ కూడా నీళ్ళు పోసినా చాలదేమో! వేసవిలో మొక్కను నీడనే పెట్టినా గాలిలో తేమను పెంచడానికి, మొక్క సేదదీరడానికి అవసరాన్ని బట్టి - ముఖ్యంగా ఏప్రిల్, మే నెలల్లో మధ్యాహ్నం ఒకటి రెండుసార్లు ఆకులమీద నీళ్ళను చిలకరించితే మంచిది.

ఏదేమైనా బోన్సాయ్ తొట్టిలోని మట్టి పూర్తిగా ఎండి బీటలువారే స్థితికి ఎప్పుడూ



రాగూడదు. అది గమనించి చూచుకుంటుం డడం ఎంతో అవసరం!

బోన్సాయ్‌లను పెంచేవాళ్ళు సాధారం ణంగా ముప్పొద్దులా వాటి అవసరాలను గమని స్తూనే ఉంటారు. అయినా ఏ కారణంగానో కాస్త అటూ ఇటూ అయ్యి మనం చూసేసరికి ఆకులు వాడిపోయి మొక్క తలవాల్చేసిందను కోండి. అప్పుడు వెంటనే ప్రథమచికిత్సగా మొక్కను నీడకు తరలించి ఆకులమీద నీళ్ళు చల్లాలి. కుండీలో ఒక్కసారిగా ఎక్కువనీళ్ళు పోసెయ్యగూడదు. ఎందుకంటే అప్పటివరకు నీళ్ళులేకపోవడం వల్ల మొక్కలోని కణాలు చచ్చుబడినట్లై నిస్సత్తువగా అయిపోతాయి. ఆ స్థితిలో ఒక్కసారిగా నీళ్ళు పోస్తే పీల్చిన నీటిని వేగంగా ముందుకు పంపలేక ఆ కణాలు ఉబ్బి పగిలిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. అందువలన ఆ స్థితిలో ఉన్న మొక్కకు మధ్య మధ్య కాస్త వ్యవధి ఇస్తూ నీళ్ళు పొయ్యడం మంచిది. పదే పదే ఆకుల మీద నీళ్ళు చిలకరిం చడం కూడా అవసరమే!

ఒకోసారి కుండీలోని మట్టి తేమగానే ఉన్నా మొక్కలు వాడిపోయి తలలు వేలాడేస్తుం టాయి. ఎండలేకపోయినా వాతావరణంలో తేమ లోపించడం వలనగాని, గాలి ఎక్కువగా ఉండడం వలనగాని ఇలా జరగవచ్చు. అలాట ప్పుడు కూడా మొక్కను నీడలో పెట్టి ఆకుల మీద నీళ్ళు చిలకరించాలి.

ఇక మేమ్‌బోన్సాయ్‌ల కయితే ఈ చిలక రింపు మరింత తరచుగా చేయవలసివస్తుంది. ముఖ్యంగా వేసవిలో ఈ అవసరం మరింతగా ఉంటుంది. అదీ చాలదనుకున్నప్పుడు ఒక ట్రేలో చిన్ని చిన్ని ఇటుక ముక్కలు వేసి వాటి మీద ఈ మేమ్ బోన్సాయ్ తొట్లను ఉంచ వచ్చు. ఆ ముక్కలను మధ్య మధ్యలో తడుపు తుంటే ఆ చల్లదనానికి మొక్క దెబ్బ తినకుండా ఉంటుంది.

ఒక్కోసారి బోన్సాయ్ మొక్కల ఆకుల అంచులు మాడి పోయినట్లుగా నల్లగా అవడం చూస్తుంటాం! దీనికి కారణం వేళ్ళకు, ఆకు లకు సమతూకం లేకపోవడమే! అంటే మట్టి లోని వేళ్ళు అందించే నీరు ఆకులకు సరిపో వడం లేదన్నమాట! వేళ్ళశక్తిని ఎలాగూ పెంచలేం గనుక మనం చెయ్యగలిగిందల్లా ఆకు లనుసగానికి సగం తగ్గించెయ్యడమే! ఇందువల్ల మొక్కకు నీటి ఎద్దడీ ఉండదు - ఆకులకు ధారాళంగా గాలీ తగులుతుంది.

మొక్క క్రొత్తగా చివురులు తొడు గుతూ, ఏపుగా పెరిగే సమయంలోను, పూత కాలందాటిపోయి పిందెలు ఎదిగే సమయం లోనూ కూడా మొక్కకు నీటి అవసరం ఎక్కు వగా ఉంటుంది. పూతపూచే తరుణంలో మాత్రం పొరబాటున కూడా నీరు ఎక్కువ పొయ్యగూడదు. అలాపోస్తే పూతను అణగ దొక్కి ఆకులు దట్టంగా పెరిగిపోతాయి.



అలాగే మొక్కకు ఎరువువేసినప్పుడు కూడా ఎక్కువనీళ్ళు అవసరం! ఎందుకంటే ఎక్కువ నీటిలో కరిగిన లవణాలను మొక్క తేలికగా గ్రహించగలుగుతుంది. అదేగనుక నీరు తక్కువైనట్లయితే లవణాల గాఢత అధిక మవడం వల్ల నీటిని పీల్చుకోడం కష్టమై మొక్క చనిపోయే ప్రమాదం కూడా సంభవిస్తుంటుంది.

మొక్కకు నీరెంతో అవసరం అన్నాం గదా అని దానికి అదేపనిగా నీళ్ళు పోసినా ప్రమాదమే! మట్టిపొడారకముందే మళ్ళీ నీళ్ళు పోస్తుంటే అది సుద్దకట్టిపోతుంది. మొక్కకు నీరెంత ముఖ్యమో గాలికూడా అంతే ముఖ్యం! మట్టి సుద్ద కట్టినప్పుడు తగినంత గాలిలోపలికి ప్రవేశించడం కష్టమైపోతుంది! దానితో సరిగా ఊపిరాడక వేళ్ళ కొనలు బలహీనపడి క్రమంగా కుళ్ళడం ప్రారంభిస్తాయి. నీటిని పీల్చగలశక్తి ఉన్న నూగువేళ్ళు ఇలా కుళ్ళిపోవడంతో మొక్క అవసరానికి సరిపడినంత పోషకజలం లభించక మొక్క క్రమంగా కృశించి చివరకు చనిపోవడం తథ్యం!

అందుకే మొక్కకు నీళ్ళుపోసే ముందు మట్టి పొడిగా ఉందా లేదా చూచుకుని మరీ పొయ్యాలి. లోపల కాస్తో కూస్తో చెమ్మ ఉన్నప్పటికి పైపొర పొడిగా కనిపించాలి. *అలా మట్టిని పొడారనివ్వడం - అప్పుడు మట్టి పూర్తిగా తడిసేవరకు నీళ్ళుపొయ్యడం - మధ్య మధ్యలో అవసరాన్ని బట్టి ఆకులమీద నీళ్ళు చిలకరించుతుండడం అనేవి మనం ప్రధానంగా గుర్తుంచుకోవలసిన అంశాలు!*

బోన్సాయ్ మొక్కలకు రెండు పద్ధతుల్లో నీళ్ళు పెట్టుకోవచ్చు. మామూలు మొక్కలకు పోసినట్లు పైనుండి నీళ్ళు పొయ్యడం ఒక పద్ధతి. క్రింది నుండి డ్రైనేజి రంధ్రాలద్వారా నీళ్ళు పెట్టడం ఒక పద్ధతి.

మొక్కల సంఖ్య ఎక్కువగా ఉన్నప్పుడు, కుండీసైజు కాస్త పెద్దగా ఉన్నప్పుడు మొదటి పద్ధతిలో రోజ్‌కాన్‌తో పైనుండి నీళ్ళు పోయక తప్పదు. అలాగాకుండా కుండీలు మొయ్యగల సైజులో ఉన్నప్పుడు వాటిని పెద్దనీళ్ళతొట్టిలో ముంచి డ్రైనేజి రంధ్రాల ద్వారా నీళ్ళు పెట్టుకునే విధానం ఎంతో మంచిది. ఇలా చెయ్యడం వల్ల కుండీలో మట్టి చెదరదు. డ్రైనేజి రంధ్రాల ద్వారా మెల్లగా నీరుపైకి పాకడంతో రూట్‌బాల్‌తో సహా మట్టంతా బాగా తడుస్తుంది.

ఏ విధంగా మొక్కకు నీరుపెట్టినా ఎప్పటికప్పుడు మట్టిమీద కొద్దికొద్దిగా నీళ్ళు చిలకరించడం గాకుండా కుండీలోని మట్టిమొత్తం తడిసేలా నీరుపొయ్యాలి. ఇలా పొయ్యడం వల్ల మొక్కకు ఎన్నోలాభాలున్నాయి. కుండీలోని వేళ్ళన్నిటికి నీరు సమంగా అందడంతో ఇవి అన్నివైపులకు చక్కగా విస్తరించి సమగ్రంగా పెరుగుతాయి. అందువల్ల మట్టిలోని పోషకాలన్నీ పూర్తిగా వినియోగింపబడతాయి. ఒకసారి



మట్టిపూర్తిగా తడిసేలా పోసాక మళ్ళీ మట్టిపూర్తిగా పొడారాకే నీళ్ళు పోస్తాం గనుక మట్టికణాల్లోంచి గాలి ధారాళంగా వేళ్ళకు అందుతుంటుంది. ఒకోసారి ఏ కారణంగానైనా నీళ్ళుపొయ్యడం కాస్త ఆలస్యమైనా నీటి కొరతను తట్టుకునే శక్తి ఈ మొక్కలకు ఉంటుంది.

అలాగాకుండా కుండీలో పైవరస మట్టి మాత్రం తడిసేలా అప్పుడప్పుడూ నీళ్ళు పోస్తామనుకోండి! అప్పుడు మట్టిలోని పోషకాలను వినియోగించుకుంటూ కుండీ అన్ని వైపులా సమతూకంగా పెరగవలసిన వేళ్ళు తేమను వెతుక్కుంటూ మట్టి ఉపరితలానికి తన్నుకొస్తుంటాయి. అటువంటప్పుడు నీళ్ళు పొయ్యడం ఏ కాస్త ఆలస్యమైనా, ఎండ ఏమాత్రం ఎక్కువ తగిలినా సున్నితమైన ఈ వేళ్ళు మాడిపోతాయి.

అందువల్ల అవసరాన్ని బట్టి మధ్య మధ్యలో ఆకులమీద చిలకరించినట్లుగా కుండీలో కొంచెం కొంచెం నీళ్ళు పొయ్యడం మంచి పద్ధతి కాదు.

మొక్క ఆకులను, కొమ్మలను కత్తిరించినప్పుడు మొక్కకు నీరు తగ్గించి పొయ్యాలి.

ఎక్కువ వయసున్న మొక్కల్లో పెరుగుదల తక్కువ ఉంటుంది గనుక వీటికి నీటి అవసరం అంతగా ఉండదు. అందుకే బాగా ఎదిగే వయసులో ఉన్న మొక్కలకు పోసినంతగా నీరు వయస్సుమళ్ళి పెరుగుదల ఆగిపోయిన మొక్కలకు పొయ్యగూడదు.

ఆకులు చిన్నవిగాను, రెమ్మలునాజూకుగాను ఉండి మొక్క పొందికగా పెరగాలనుకున్నప్పుడు కూడా నీరు తక్కువగా పోయాలి. అయితే మొక్క పెరుగుదల, దాని అవసరాలను గమనించి ఎంతమేరకు నీటిని తగ్గించాలో తెలుసుకోగల అనుభవం, నేర్పు ఉన్నవాళ్ళు మాత్రమే ఈ పనిని విజయవంతంగా చెయ్యగలరు. అలా చెయ్యలేనప్పుడు నీరు చాలక మొక్క చనిపోయే ప్రమాదముంటుంది.

బాగా ఎండగా ఉన్నప్పుడు కుండీలో ఉన్న మొక్కలకు నీళ్ళు పొయ్యగూడదు. అలా పోస్తే మట్టివేడికి నీళ్ళు కాగి సున్నితమైన నూగువేళ్ళను దెబ్బతీస్తాయి.

ఎండ తీవ్రత ఎక్కువగా ఉండే సమయాల్లో (ఆ సమయంలో మొక్కలను నీడనే ఉంచినా) ఆకులమీద అప్పుడప్పుడు నీళ్ళను చిలకరించడమే గాకుండా ఒకట్రేలో నీళ్ళుపోసి అందులో బోన్సాయ్ కుండీని గనుక ఉంచినట్లైతే ఆ చెమ్మవల్ల మొక్క ఎండ దెబ్బతినకుండా కాపాడుకోవచ్చు.

ఆకులమీద తరచూ నీళ్ళు చిలకరించడం వల్ల మొక్కకు చల్లదనం గలగడమే గాక, ఆహారాన్ని తయారుచెయ్యవలసిన ఆకులు ఎప్పటికప్పుడు శుభ్రపడుతుంటాయి.

బోన్సాయ్‌లకు మంచినీళ్ళు తప్ప ఉప్పునీళ్ళు పొయ్యడం మంచిదికాదు. ఉప్పునీటిలోని లవణాలు వేళ్ళకు నీటిని పీల్చుకునే శక్తిని తగ్గిస్తాయి. మనం మొక్కకు పోసే నీటిలో



లవణశాతం అధికంగా ఉందనడానికి నిదర్శ నంగా కాండం మొదట్లోను, కుండీలోపలి అంచుచుట్టూ తెల్లగా కరడుగట్టినట్లు అరబడు తుంది. ఒకోసారి మట్టిసరైన పాళ్ళలో కలపకపో యినా, డ్రైనేజి రంధ్రాలద్వారా నీరు సరిగ్గా బయటకు పోకపోయినా, ఎండ తగలకపోయినా కూడా పైన చెప్పినట్లుగా తెల్లటి పొర ఏర్పడు తుంది. కారణం ఏదైనప్పటికి ఈ లక్షణం మొక్క అనారోగ్యాన్నే సూచిస్తుంది గనుక వెంటనే తగిన చర్య తీసుకోవాలి.

## బోన్సాయ్ పెంపకంలో ఎరువుల వాడకం

## (Fertilizing Bonsai)

మొక్కలు భూమినుండి నీటితో పాటు ఖనిజలవణాలను పీల్చుకొని పెరుగుతుం టాయి. ఏళ్ళ తరబడి అలా ఒకే నేలలో మొక్కలు పెరుగుతున్నట్లైతే కొన్నాళ్ళకు ఆనేల నిస్సారమై పోతుంది. ఇంక అతి చిన్న బోన్సాయ్ కుండీలోని చారెడు మట్టి ఆ స్థితికి రావడానికి ఆట్టేకాలం పట్టదు. దానికి తోడు కుండీ అడుగు రంధ్రాల ద్వారా కారే నీటితో పాటు కొంతసారం దిగిపోతుంటుంది. అందుకే బోన్సాయ్ కుండీలోని మట్టిని సంవత్సరాని కొకసారన్నా మారుస్తుంటాం! ఎంత మట్టి మార్చినా మొక్క త్వరగా దృఢంగా పెరగా లన్నా, ఫలపుష్పాలనివ్వాలన్నా అడపాదడపా ఎరువులు వాడకతప్పదు.

స్వాభావిక ఎరువులు లేక సేంద్రియ ఎరువులని, కృత్రిమ ఎరువులు లేక రసాయని కపు ఎరువులని రెండురకాల ఎరువులను మనం సాధారణంగా వాడుతుంటాం.

సేంద్రియ ఎరువులు జంతువులు, వృక్షా లనుండి లభిస్తాయి - చివికిన పేడ, కుళ్ళిన ఆకులు, జంతువుల ఎముకలనుండి తయారైన బోన్ మీల్, వేపపిండి, ఆముదపు పిండి, వేరుశ నగపిండి మొదలగునవి. వెంపలి, జిల్లేడు, గానుగ మొక్కల ఆకులను గుంటలో వేసి మట్టికప్పితే కొన్నాళ్ళకు మంచి ఎరువుగా తయారవుతుంది. దీన్ని తయారు చేసుకోడం సులభం కూడాను. సేంద్రియ ఎరువులు మొక్కలకు మేలుచేసే సూక్ష్మజీవులను అభి వృద్ధి చేయడమేకాక మొక్కలకు కావలసిన అన్ని పోషకాలను అందిస్తాయి. అందువలన సేంద్రియ ఎరువులను పరిపూర్ణమైన ఎరువు లుగా భావిస్తారు. పైగా ఇవి నిరపాయకరమైనవి కూడా!

రసాయనిక ఎరువులను కృత్రిమ ఎరు వులు అంటాం. వీటిలో నత్రజని, భాస్వరం, పొటాష్ లవణాలు ఎక్కువ పాళ్ళలో ఉంటాయి. ఈ ఎరువులవలన మొక్కలకు పోషకపదార్థాలు త్వరితంగా లభిస్తాయి. వీటిని వేర్వేరు నిష్పత్తుల్లో కలిపి బజారులో అమ్మి తుంటారు.



ప్రకృతి సిద్ధంగా భూమినుండి లభించినా, ఎరువుల రూపంలో మనం అందించినా అసలు మొక్కలకు కావలసిన ధాతువులేమిటో, అవిలోపిస్తే మొక్కల్లో ఏ లక్షణాలు కనిపిస్తాయో కొంతవరకయినా మనకు తెలిస్తే తప్పించి ఏ మొక్కకు ఏ ఎరువులు ఎప్పుడు ఎంత మోతాదులో వాడాలన్న అవగాహన ఉండదు.

మొక్క సమగ్రమైన అభివృద్ధికి నైట్రొజన్, భాస్వరం, పొటాషియం, కాల్షియం, మెగ్నీషియం, గంధకం, ఐరన్, జింక్, బోరాన్, మాంగనీస్, కోబాల్ట్, మోలిబ్డినం లాంటి ఖనిజాలు దోహదం చేస్తాయి.

ఈ ఖనిజాలలోల క్షణాలు ఆకుల్లోను, కాండం మీద, ఈ నెల మధ్యభాగంలోను, చివుళ్ళలోను, హరిత వర్ణంలోని మార్పులతోను, కాయలు, పండ్లు, పూలరూపాలలోని తేడాల ద్వారాను మనకు కనిపిస్తూనే ఉంటాయి.

అందుకే ఏయే ఖనిజాలు మొక్కలకు ఎంత మోతాదులో, ఏ కాలంలో వాడితే లాభదాయకంగా ఉంటుందో తెలుసుకుంటే మంచిది.

## నైట్రొజన్:

నైట్రొజన్ సమపాళ్ళలో ఉన్నప్పుడు ఆకులు నిగనిగలాడుతూ మొక్క ఆరోగ్యంగా కనిపిస్తుంటుంది. అదే నైట్రొజన్ తక్కువైతే రెమ్మలు తీగల్లా సాగి మొక్క బలహీనంగాను, అందవిహీనంగాను తయారవుతుంది. ఆకులు పండబారినట్లుగా కనిపిస్తాయి. పెరుగుదల కూడా అంతంత మాత్రంగానే ఉంటుంది. ఆకుల చివరలు మాడిపోయినట్లు నల్లబడిపోతాయి. అందుకే మొక్క ఏపుగా పెరిగే తరుణంలో నైట్రొజన్ ఎరువులు వాడాలి.

మొక్క మొగ్గ తొడిగే సమయంలోను, పూతకాలంలోను నైట్రొజన్‌ను వాడగూడదు. అలా వాడినట్లైతే పూత ఆగిపోయి, ఆకులు విపరీతంగా పెరుగుతాయి.

మనకు నైట్రొజన్ యూరియా, అమ్మోనియం సల్ఫేటు, సోడియం నైట్రేటుల రూపంలో లభిస్తుంది.

## ఫాస్ఫరస్:

మొక్క బాగా దృఢంగా ఎదగాలన్నా, చెట్టునిండా పూలు పుయ్యాలన్నా, కాయలు ఎక్కువగా కాయాలన్నా భాస్వరం అవసరం! భాస్వరం సమపాళ్ళలో లభిస్తే మొక్కలవేళ్ళు ఎంతో చురుకుగా పనిచేస్తాయి.

భాస్వరంలో ఉన్న సుగుణమేమిటంటే ఏ కారణంగానన్నా మోతాదు మించి మొక్కకు భాస్వరాన్ని వేసినా అది మొక్కకు హాని చెయ్యదు. మొక్క తనకెంత పరిమాణంలో భాస్వరం అవసరమో అంతవరకే ఉపయోగించు కుంటుంది.



భాస్వరం సూపర్ ఫాస్ఫేటు, బోన్ మీల్ వంటి ఎరువుల రూపంలో లభిస్తుంది.

## పొటాషియం:

వేళ్ళు, ఆకులు ఆరోగ్యంగా పెరగడానికి పొటాషియం బాగా ఉపయోగపడుతుంది. ఇది నైట్రొజన్ పాత్రను క్రమబద్ధం చేస్తుంది. అంతే కాకుండా ఇది మొక్కకు రోగనిరోధక శక్తిని ఇనుమడింప జేస్తుంది.

పొటాషియం లోపించిన మొక్కల్లో ఆకులు ముడుచుకు పోతాయి. మొక్కల్లో పూత, కాపు బాగా తగ్గుతుంది. పూచిన పూలు, కాచిన కాయలు కూడా బలంగా ఉండవు.

ఎటొచ్చీ పొటాషియం ఎక్కువైనా సమస్యే! ఆకులు రాలిపోతాయి. పూతనిలవదు. పెరుగుదల మందగిస్తుంది.

పొటాషియం సల్ఫేటు, (కర్రలు) చెక్కలు కాల్చిన బూడిదల్లో పొటాషియం సమృద్ధిగా లభిస్తుంది.

## కాల్షియం:

ఇది భూమిని సారవంతంజేసి మొక్కలు ఆరోగ్యంగాను, బలంగాను ఎదగడానికి దోహదం చేస్తుంది. మొక్కల్లో ఫాస్ఫరస్, కాల్షియం లవణాలను గ్రహించే శక్తిని పెంచుతుంది.

కాల్షియం తక్కువైతే ఆకులు చివుళ్ళ దశలోనే ఎండిపోతాయి.

కాల్షియం పాలు ఎక్కువైనట్లైతే మొక్కలో ఇనుమును గ్రహించే శక్తి మందగిస్తుంది. దాంతో ఆకులు పండబారినట్లుగా మచ్చలు ఏర్పడతాయి.

సూపర్ ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్, బోన్‌మీల్‌ల రూపంలో కాల్షియం లభిస్తుంది.

## ఐరన్:

ఆకుల్లో పచ్చదనానికి మూలకారణం ఐరన్. దీనిమూలంగా పత్రహరితం తయారుగావడం, తద్వారా కిరణజన్య సంయోగక్రియ జరిగి మొక్కలు ఆహారాన్ని సమృద్ధిగా తయారు చేసుకోవడం జరుగుతాయి.

ఐరన్ లోపిస్తే ఆకుల్లో పచ్చదనంలోపించి పసుపురంగుకు మారడమేగాక, ఆకుల సైజుకూడా తగ్గుతుంది.

మొక్కలకు కాల్షియం, ఫాస్ఫరస్‌లు మోతాదుకు మించి వేసినా, నీళ్ళు మరీ ఎక్కువ పోసినా, డ్రైనేజిరంధ్రాలు సరిగాలేక నీరు నిలవ ఉండి పోయినా మొక్కకు ఇనుమును గ్రహించే శక్తి నశిస్తుంది.

ఇకపోతే ఈ ఎరువులను ఎలా వెయ్యాలి అనేది తరువాత ప్రశ్న. సేంద్రియ ఎరువులను గనుక ఉపయోగించే టట్లైతే మట్టిలో రెండు మూడు చోట్ల గుంటగా చేసి దానిలో చిటికెడు చొప్పున ఎరువువేసి మట్టితో మూసెయ్యాలి.



అంతశ్రమ అనవసరం అనుకుంటే మట్టిమీద కొద్దిగా చల్లినా ఫరవాలేదు. ఎటొచ్చీ ఎరువులను ఎలా వేసినా వెంటనే నీళ్ళు మాత్రం పొయ్యాలి. సేంద్రియ ఎరువులు రసాయనికపు ఎరువులకంటే నెమ్మదిగాను, ఎక్కువకాలమూ పని చేస్తాయి గనుక వాటిని నెలకొక్కసారి వాడితే సరిపోతుంది.

సాధారణంగా రసాయనికపుఎరువులను ద్రవరూపంలోకి మార్చివాడుతుంటాం! అందువలన ఇవి నీటిలో త్వరగా కరిగిపోయి త్వరగా ఫలితాన్నిస్తాయి. అయితే వీటి ఫలితం మొక్కకు ఎంత త్వరగా అందుతుందో వాటి ప్రభావంకూడా అంతే త్వరగా తగ్గిపోతుంది. అందువలన వీటిని 15 రోజుల కొకసారి వెయ్యవలసి ఉంటుంది. ఈ ఎరువులను వాడేముందు, తరువాత కూడా మొక్కకు ఎక్కువ నీళ్ళుపొయ్యాలి.

రసాయనికపు ఎరువులు సేంద్రియ ఎరువులంత నిరపాయకరమైనవి కావు. ఏ మాత్రం వీటి మోతాదు మించినా మొక్కచని



పటం 96 : ఎరువు గుళికలను మొక్క మొదట్లోగాక కుండీ అంచుదగ్గరలో గుచ్చాలి



పోయే ప్రమాదముంటుంది. కనుక వీటిని చాలా జాగ్రత్తగా, అతి తక్కువ మోతాదుల్లో ఉపయోగిస్తుండాలి. ఈ కారణంగా కొంతమంది అసలు రసాయనికపు ఎరువులను వాడడానికే ఇష్టపడరు.

జపాన్‌లో బోన్సాయ్ మొక్కలకోసం ఎరువును ప్రత్యేకమైన గుళికలుగా చేసి అమ్ముతారట! వీటిని గనుక మట్టిలో గుచ్చితే క్రమేణా నీటిలో కరిగి మొక్కకు బలాన్నిస్తుంటాయి.

మనంకూడా బోన్ మీల్, వేపపిండిలాటి వాటిని చిన్నచిన్న ఉండలుగా చేసుకుని వాడవచ్చు. ఎరువు గుళికలను మొక్క మొదట్లో గాక దూరంగా కుండీ అంచు ప్రక్కన గుచ్చాలి.

సహజంగా మొక్కబాగా ఎదిగేసమయంలో ఎరువులు అవసరమౌతుంటాయి. అలాగే మేలురకం ఫలపుష్పాల కోసం కూడా ఎరువులు వాడాలి. అయితే ఏవి ఏసమయంలో వాడాలో, ఏ సమయంలో వాడగూడదో మనకు తెలిసి ఉండాలి.

మొక్కబాగా ఎదిగే సమయంలో పూత, కాపు ఉండదు. పూచి, కాచే సమయంలో శాఖీయమైన పెరుగుదల ఆగిపోతుంది. అందుకే మొక్క ఎదిగేందుకు నత్రజనిని, పూలు, కాయలకోసం ఫాస్పరస్, పొటాషియంలను వాడాలి.

## ఎరువులు ఎప్పుడు వెయ్యాలి, ఎప్పుడు వెయ్యగూడదు?

మొక్కచిగురు తొడగడం ప్రారంభించగానే ఎరువు వెయ్యాలి.

మొక్క మొగ్గతొడిగే సమయంలో ఎరువులు వెయ్యగూడదు. వేస్తే పూత, కాపు తగ్గిపోతుంది.

పిందె ముదురుతున్న సమయంలో ఎరువులు అవసరం

మొక్కను ఒక కుండీ నుండి మరోకుండీలోకి మార్చే సమయంలో ఎరువు వాడగూడదు. ఆ సమయంలో వేళ్ళను కత్తిరిస్తాం గనుక మిగిలిన కొద్దిపాటి వేళ్ళకు ఎరువును పీల్చుకునే శక్తి ఉండదు.

అలాగే వేసవిలో కూడా ఎరువులు వాడడం మంచిది కాదు.

వర్షాకాలంలో ఎరువులు వాడడం వలన పెద్ద ప్రయోజనం ఉండదు. ఆ కాలంలో మొక్కలు సహజంగానే ఆరోగ్యంగా పెరుగుతాయి. ఒక వేళ ఎరువులు వేసినా వాటిని మొక్కలు గ్రహించకముందే వాననీళ్ళతో కొట్టుకుపోవచ్చు. డ్రైనేజి రంధ్రాలద్వారా కారిపోవచ్చు.

అనారోగ్యంతో బలహీనంగా ఉన్న మొక్కకు ఎరువు వెయ్యగూడదు.



ఒక వేళ మొక్క తగిన పోషణ లేని కారణంగా బలహీనపడితే - దానికి అతి తక్కువ మోతాదుతో ప్రారంభించి క్రమక్రమంగా మోతాదును పెంచుతూ ఎరువులు వాడవచ్చు. అంతే గాని మొక్కకు ఒక్కసారే బలం వచ్చెయ్యాలని ఎక్కువ ఎరువు వేస్తే మొదటికే మోసం రావచ్చు.

ఆకులు పచ్చగా ఆరోగ్యంగా లేనప్పుడు చిన్న బకెట్ నీళ్ళలోకి ఒక స్పూను ఎప్సమ్ సాల్ట్ కరిగించి ఆకుల మీద చల్లాలి.

మొక్కకు బాగా వయసువచ్చి ముది రాక పెద్దగా ఎరువులు వాడనవసరం లేదు.

మరీ చిన్ని కుండీల్లో పెరిగే మేమ్ బోన్సాయ్‌లకు తక్కువ మోతాదుల్లో తరచూ ఎరువులు వాడడం మంచిది.

ఎరువులు వాడనంతమాత్రాన ఏ మొక్క చావదు. ఎప్పుడూ కూడ తక్కువమోతాదుల్లో ఎక్కువసార్లు ఎరువులు వాడడం మంచిది. త్వరగా ఫలితం కనిపించాలన్న దురాశతో ఒక్కసారే ఎక్కువ మోతాదులో ఎరువులు వేయగూడదు.

ఒక వేళ పొరబాటున ఎరువు ఎక్కువైందని అనిపించిందనుకోండి. అప్పుడు మొక్కకు మామూలుగా పోసే నీళ్ళ కంటే బాగా ఎక్కువ నీళ్ళు పొయ్యాలి. ఆ నీళ్ళతోపాటు ఎరువు కూడా క్రిందికి కారిపోతుంది. మొక్కకు ప్రమాదం తప్పుతుంది.

## బోన్సాయ్ నాశించే చీడపీడలను అరికట్టడం ఎలా?

## *(Pests and Diseases)*

మామూలుగా తోటలో మొక్కలకు వచ్చినట్లుగానే బోన్సాయ్ మొక్కల క్కూడా చీడపీడల బాధలు తప్పవు. అయితే ప్రతి పూటా మొక్కలను ఎంతో శ్రద్ధతో గమనిస్తుంటాం గనుక వీటిని తొలిదశలోనే అరికట్టవచ్చు. బోన్సాయ్‌లు ఎటూ చిన్నగానే ఉంటాయి గనుక క్రిమికీటకాలను చూడగానే చేత్తోనే ఏరివేయవచ్చు. ఒకోసారి శక్తివంతమైన క్రిమిసంహారకమందులను వాడకుండానే సబ్బు నీళ్ళలో ముంచిన గుడ్డతో కాండాన్ని, కొమ్మలను, ఆకులను తుడిచినట్లైతే సన్నని క్రిములు నశిస్తాయి. సిగరెట్‌నుసిని నీళ్ళలో కలిపి పాతటూత్ బ్రష్‌తో కాండాలకు, కొమ్మలకు వ్రాస్తే త్వరగా పురుగుపట్టదు. ఉన్న క్రిములు కూడా నశిస్తాయి.

సాధారణంగా చుట్టుపట్ల ఉన్న ఇతర చెట్ల నుండి క్రిమి కీటకాలు బోన్సాయ్ మొక్కలకు వ్యాపిస్తాయి. వాతావరణంలోని మార్పుల మూలంగా బూజుతెగులు, ఆకుమచ్చతెగులు లాటి కొన్ని తెగుళ్ళు వస్తుంటాయి. అందువలన మొక్కలకు సాధారణంగా ఏయే క్రిమికీటకాలు ఎలాటి నష్టం కలుగజేస్తుంటాయో తెలుసుకుంటే అందుకు తగిన నివారణ చర్యలను చేపట్టవచ్చు.



## గొంగళిపురుగులు

(Caterpillars)

ఈనెలను మాత్రం మిగిల్చి ఆకులు మొత్తాన్ని తినివేస్తుంటాయి. ఇలాటి ఆకులు ఒకటి రెండు కనిపించగానే ఈ ఆకు పురుగుల ఉనికిని తేలిగ్గా తెలుసుకోవచ్చు. జాగ్రత్తగా వెదికి ఏరిపారేయవచ్చు. తక్కువ శక్తి ఉన్న పారాథియాన్ మందును ఎక్కువ నీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.

## పేనుబంక (Aphids)

గుంపులుగా ఆకుల అడుగున కదల కుండా అతుక్కొని రసాన్ని పీల్చివేస్తాయి. తక్కువ శక్తిఉన్న మలాథియాన్ మందును ఎక్కువ నీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.

## కొమ్మతొలుచు పురుగు

(Stem Borer)

తలక్రింద భాగాన పసుపు పచ్చ మచ్చ లుండే సన్నని కీటకాలు. కాండాన్ని, కొమ్మ లను తొలిచి రంధ్రాలు చేసి రసాన్ని పీల్చేస్తాయి. వీటివలన మొక్క చనిపోయే ప్రమాదం ఎక్కువ.

కాండం మీద, కొమ్మలమీద ఉన్న ఈ పురుగుల తుట్టెలను తీసి రంధ్రాల్లో పెట్రోలు పొయ్యాలి. ''పారాడైక్లోరో బెన్‌జీన్'' గుళిక లను రంధ్రాలలో వేసి దూదితో మూసెయ్యాలి.

## ఆకు ముడత పురుగులు

(Thrips)

ఆకుల అడుగున చేరి రసాన్ని పీల్చి వేసే సన్నని కీటకాలు. వీటివలన ఆకులు ముడుచు కుపోతాయి. B.H.C 10 శాతం పొడి చల్లవచ్చు.

## పిండి పురుగు లేక నుడి తెగులు

(Mealy Bugs)

నల్లిజాతికి చెందిన పురుగులు. ఆకు లోను, ఆకుతొడిమలోను కూడా చేరి రసాన్ని పీల్చి మొక్కను ఎదగనివ్వవు. తక్కువశక్తిఉన్న పారాథియాను మందును ఎక్కువ నీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.

## ఎర్రతెగులు (Mites)

ఎర్రని చిన్న నల్లులవంటి సూక్ష్మజీ వులు. లేత కొమ్మల ఆకులనుండి రసాన్ని పీల్చి వేయడం వల్ల కొమ్మలు వాడి ఎండిపోతాయి. ఆకులు పండిపోతాయి. మెత్తటి గంధకపు పొడిని ఎక్కువనీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.

## దీపపురుగులు

(Jassids)

గుంపులుగా చేరిచెట్ల రసాన్ని పీల్చే సన్నని కీటకాలు. తక్కువ శక్తిగల డి.డి.టి, కార్బరిల్ గాని, ఎండోసల్ఫాన్ ఎక్కువ నీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.



### బిళ్ళపురుగు (Flee Beetle)

లేత కాండాలను తొలిచి వేస్తుంది. ఆకుల్లో రంధ్రాలు చేస్తుంది. బి.హెచ్.సి 10 శాతం మందును చల్లాలి.

### కుంకుమ తెగులు (Rust)

ఆకుల అడుగుభాగాల్లో ఎరుపులేక గోధుమ రంగు బుడిపె లేర్పడతాయి. ఆకులు ఎండి పోతాయి. గంధకాన్ని ఎక్కువనీళ్ళలో కలిపి పిచికారీ చెయ్యాలి.

### పొలుసు పురుగు (Scale Disease)

గట్టికవచం గలిగిన చిన్న పొలుసు పురుగులు. ఆకులను, కొమ్మలను, కాండాన్ని అంటుకుని రసాన్ని పీల్చివేస్తాయి. చిన్ని చిన్ని బుడిపెల్లా ఏర్పడతాయి. పెరుగుదల తగ్గిపోతుంది. 0.15% మలాథియాన్‌ను పిచికారి చెయ్యాలి.

### మసితెగులు (Suity Mould)

ఆకులమీద, కొమ్మల మీద నల్లటి బూజు కనిపిస్తుంది. పేను బంక ఉన్న చెట్లకు ఇది కూడా సోకుతుంది. గంధకాన్ని ఎక్కువ నీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.

### తెల్ల బూజు లేక కొమ్మ బూజు (Felt Disease)

చిన్న చిన్న కొమ్మల మీద తెల్లటి బూజు కనిపిస్తుంది. బూజు తోలులా సాగుతుంది. బూజుకిృంద కీటకాలుంటాయి. ఇవి కొమ్మలో రసాన్ని పీల్చివేస్తాయి. తక్కువశక్తి ఉన్న పారాథియాను, కార్బరేటుల మిశ్రమాన్ని ఎక్కువ నీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.

### బూడిద తెగులు (Powdery Mildew)

ఆకులపైన బూజులా వచ్చి వ్యాప్తిచెందుతుంది. దీనివల్ల చిగుళ్ళు, లేతఆకులు వంకరలు తిరిగి ముడతలు పడిపోతాయి. ముదురు ఆకులు పండి రాలిపోతాయి. పూతమాడిపోతుంది. పిందెలు ఉడిగి రాలిపోతాయి. గంధకపు పొడిని ఎక్కువనీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.

### పాచిరోగం (Pink Disease)

చిన్నకొమ్మల పంగలలో జిగురు చుక్కలుగా కారుతుంటుంది. బెరడు గట్టిపడి పగిలిపోతుంది. కొమ్మలు ఎండిపోతాయి. తెగులు సోకిన కొమ్మలని విరిచి కాల్చేయాలి. విరిచిన చోట బోర్డోపేస్టు రాయాలి.

### కాకిబొడ్డు (Root Rot)

వేళ్ళలో తెల్లటి బూజువంటి దారాలు కనిపిస్తాయి. వేళ్ళమీద బెరడు కుళ్ళిపోయి గోధుమ లేక ఎరుపురంగుకు మారుతుంది. క్రమంగా ఇది బెరడు నుండి దారువులోకి వ్యాపిస్తుంది. ఆ తర్వాత వేళ్ళనుండి కాండానికి



సోకుతుంది. చెట్టుమొదలు నుండి కుక్కగొడుగులాటి కాకి బొడ్డు పైకి వ్యాపించుకుంటూ వచ్చి చివరకు చెట్టు చనిపోయే పరిస్థితి వస్తుంది.

తెగులు సోకిన వేళ్ళను కత్తిరించి బోర్డో పేస్టు పుయ్యాలి. చెట్టు చుట్టూ కాస్త తవ్వి గంధకం చల్లాలి.

## పులిచీమలు (Red Tree Ants)

ఇవి స్వతహాగా మొక్కలకు హానిచెయ్యక పోయినా ఇతరపురుగులను తెస్తాయి. బి.హెచ్.సి 10 శాతం పొడిని నీళ్ళలో కలిపి పిచికారి చెయ్యాలి.

## చెదలు (White Ants)

ఇవి క్రొత్తగా నాటిన మొక్కల వేళ్ళను కొరికి తిని చంపుతుంటాయి. బి.హెచ్.సి 10 శాతం పొడిని చల్లాలి.

## పుల్లవిరుపు రోగం (Die Back)

కొమ్మల చివరి భాగాలు ఎండిపోయి,ఆకులు రాలిపోతాయి. దీనిమూలంగా చెట్టు చనిపోతుంది కూడా! రాగిధాతులోపం మూలంగా ఈ వ్యాధి వస్తుంటుంది. ఎండిన కొమ్మలను, రెమ్మలను విరిచి తగలబెట్టాలి. విరిచిన చోట బోర్డో పేస్టు పుయ్యాలి. రాగి ధాతువు గల మందులను వాడాలి.

# అత్యవసర పరిస్థితుల్లో బోన్సాయ్‌కి అందించ వలసిన సేవలు

## Emergency Treatment for Sick Bonsai

బోన్సాయ్ మొక్కలు లోతులేని చిన్న కుండీలో చారెడు మట్టిలో పెరుగుతుంటాయి గదా! ఒకోసారి ఆ మట్టిపాళ్ళు సరిగా ఉండకపోవడం వలన గాని, మొక్కకు నీళ్ళు పొయ్యడం ఆలస్యం అవడం వలనగాని, నీరు ఎక్కువయి గాని మొక్కను ప్రూన్ చేసినప్పుడు వేళ్ళకూ, కొమ్మలకూ మధ్య సమతూకం లోపించిగాని, మట్టిలో పోషకాలు లోపించిడం వల్లగాని, ఎరువులు ఎక్కువై గాని, మొక్కకు చీడపీడలాశించడం వలన గాని మొక్క దెబ్బతినవచ్చు.

ఇందులో ఏ ఒక్క కారణంగానయినా మొక్క వాడిపోవడమో, అనారోగ్యానికి గురికావడమో జరుగుతుంది. అలాటి స్థితిలో మొక్కను మనం గమనించినప్పుడు దానికి కారణమేమిటో తెలుసుకుని తగిన చర్యలు తీసుకోవాలిగదా! వాటి గురించి క్లుప్తంగా చెప్పుకుందాం!



కారణం ఏదైనా మొక్కను వెంటనే నీడకు తరలించాలి. అప్పుడు కారణమేమై ఉంటుందో పరిశీలించవచ్చు.

నీళ్ళు లేక బాగా వాడిపోయినట్లుంటే - ఒక్క సారిగా ఎక్కువ నీళ్ళు పోసేయకుండా కొద్దిగా నీళ్ళు పోసి, ఆకుల మీద మాత్రం బాగా నీళ్ళు చిలకరించాలి. ఒక అరగంట పోయాక కుండీలో మట్టి బాగా తడిచే వరకు నీళ్ళు పొయ్యవచ్చు. ఆకుల మీద మాత్రం కాసేపటికి కాసేపటికి నీళ్ళు చిలకరిస్తుండాలి.

నీళ్ళు ఎక్కువైనట్లుగా అనిపిస్తే ముందుగా డ్రైనేజి రంధ్రాలు సరిగా ఉన్నాయో లేవో చూడాలి. కుండీ వేళ్ళతో నిండిపోయి రంధ్రాలకు వేళ్ళు అడ్డుపడుతున్నట్లుంటే మొక్కను మరో కుండీలోకి మార్చాలి. మార్చే ముందు తగినంతవరకు వేళ్ళను కత్తిరించాలి.

వేళ్ళు ఎక్కువ కత్తిరించడం మూలంగా మొక్క వాలిపోతున్నదనిపిస్తే వేళ్ళకు తగినట్లుగా కొమ్మలను, ఆకులను కూడా కత్తిరించాలి.

వాతావరణం వేడిగా ఉన్న రోజుల్లో మొక్కను నీడనే ఉంచి ఆకులమీద నీళ్ళు జల్లుతుండాలి.

కుండీలోని మట్టినిస్సారంగా ఉన్నట్లనిపించితే కుండీని మార్చి మరో కుండీలో పెట్టుకోడం గాని, తగిన మోతాదుల్లో ఎరువులు వాడడం గాని చెయ్యాలి.

ఎరువు ఎక్కువై మొక్క దెబ్బతింటుందేమోననిపిస్తే వెంటనే ఆ ఎరువు కుండీ అడుగు రంధ్రాల్లోంచి కారిపోయేంతగా నీళ్ళు పొయ్యాలి.

కుండీలో మట్టి సరైన పాళ్ళలో లేనట్లనిపించినా, సుద్దకట్టి వేళ్ళు కుళ్ళిపోతాయేమోననిపించినా మొక్కను కుండీనుండి తీసి - ధైర్యం చేసి రూట్‌బాల్ కూడా కదిపి వేళ్ళను శుభ్రంగా కడిగి ఇసుక ఎక్కువపాళ్ళు కలిపిన పొడిమట్టి పోసిన కుండీలో తిరిగి నాటుకోవాలి.

మొక్క అనారోగ్యంగా అనిపించినప్పుడు మొక్కను అదే కుండీలో ఉంచినా, కుండీమార్చినా కూడా తరుచు ఆకులమీద నీళ్ళు చిలకరిస్తుంటే త్వరగా కోలుకునే అవకాశం ఉంది. ఈ పరిస్థితిలో మట్టిమరీ పొడారిపోయే వరకూ నీళ్ళు పొయ్యకుండా ఉండగూడదు. అలాగని మట్టి సుద్ద కట్టేంత ఎక్కువగాను పొయ్యగూడదు.

ఎంత జేసినా ఒక వేళ మొక్క చనిపోయిందనుకోండి. దిగులుపడి కూర్చోక కారణం తెలుసుకుని మరోసారి ఆ లోపం కలుగకుండా చూచుకోవాలి.



# ఎలాంటి స్థలంలో బోన్సాయ్ మొక్కలనుంచాలి?

## (Placement of Bonsai)

బోన్సాయ్ మొక్కలు కూడా తక్కిన మొక్కలలాగే ఆరుబయట సూర్యరశ్మిలో పెరగవలసినదే! ఎటొచ్చీ వాటికి మిటమిటలాడే మధ్యాహ్నపుటెండగాక ఉదయపుటెండగాని, సాయంత్రపు టెండగాని తగలాలి.

ఒక వేళ ఎప్పుడైనా ముచ్చటగా డ్రాయింగ్ రూమ్‌లో పెట్టుకోవాలనిపించినా రెండుమూడు రోజులు మించి లోపల పెట్టగూడదు.

మొక్కను ఎక్కువరోజులు ఇంట్లోగాని, పూర్తిగా నీడనుగాని ఉంచినట్లైతే సూర్యరశ్మి లేని కారణంగా అది ఆహారాన్ని తయారుచేసుకోలేదు. అందువలన బలంలేక పాలిపోవడమే గాక రెమ్మలు తీగల్లా సాగిమొక్క అందవికారంగా తయారవుతుంది.

అంతేగాకుండా గదిలోపల ఉండే వేడికి పత్రరంధ్రాలు ముడుచుకుపోవడంతో మొక్కకు గాలి పీల్చుకోడం కూడా కష్టమైపోతుంది.

బోన్సాయ్ మొక్కలకు నీడమంచిది గదా అని వాటిని ఒక పెద్దచెట్టు క్రింద పెట్టామనుకోండి - కోరి ప్రమాదం తెచ్చుకున్నవాళ్ళమవుతాం! ఎందుకంటే ఆ పెద్దచెట్టుకున్న క్రిమి కీటకాలు, తెగుళ్ళు చెట్టు క్రింద ఉన్న బోన్సాయ్‌లకు కూడా వ్యాపిస్తాయి. అందువలన నీడకోసం పెద్ద చెట్టును ఆశ్రయించడం గాక మరో ఏర్పాటు చూచుకోడం మంచిది. మరీ వేసవికాలంలో తాటాకులతోనో, కొబ్బరాకులతోనో పందిరి వేసుకోడం మంచిది.

నీడగా ఉందిగదా అని గాలీ వెలుతురు లేని ఇరుకు మూలల్లో కూడా బోన్సాయ్ తొట్లను పెట్టగూడదు.

మొక్క అన్నివైపులకు సమానంగా విస్తరిస్తూ పెరగాలంటే అందుకు తగినట్లుగా సూర్యరశ్మి కూడా తగలాలి. అందుకుగాను సమంగా గాలి, వెలుతురు లభించే చోట బోన్సాయ్ కుండీలను పెట్టుకోవాలి. ఒక వేళ కుండీఉన్న చోటుకు ఒకవైపునుండి మాత్రమే సూర్యరశ్మి పడుతుంటే కుండీని అప్పుడప్పుడు ముందు వెనకలకో, కుడి ఎడమలకో అవసరాన్ని బట్టి తిప్పుతుండాలి.

సూర్యరశ్మి మొక్కలకు ఆహారాన్నివ్వడమే గాక చెట్టును చీడపీడలనుండి కూడా రక్షిస్తుంది. అయితే అన్నిరకాల మొక్కలకు సూర్యరశ్మి అవసరం ఒకే రకంగా ఉండదు. పూలూ, కాయలూ కాచే చెట్లకు సూర్యరశ్మి అవసరం ఎక్కువగా ఉంటుంది. అలాగే ఆకు



రాళ్ళే డెలొనిక్స్, పెల్టోఫాం, కుంకుడులాటి చెట్లు కూడా ఎక్కువ ఎండను తట్టుకుంటాయి.

అలాగని బోన్సాయ్ మొక్కలకు ఎట్టి పరిస్థితుల్లోను మధ్యాహ్నం 12 నుండి 3 గంటల మధ్య కాలపు ఎండ తగలనీయగూడదు.

నీడన పెరుగుతున్న మొక్కకు మరి కొస్త ఎండ అవసరమని పించినప్పుడు ఒక్కసారిగా ఆమొక్కను ఎండలోకి తరలించేయగూడదు. ఎండలో ఉంచే సమయాన్ని రోజుకు కొంత చొప్పున పెంచుతూ క్రమక్రమంగా వాతావరణంలోని మార్పుకు దాన్ని అలవాటు చెయ్యాలి.

గోడకు ఆనించిగాని, సిమెంటుగచ్చు మీదగాని, రాతి అరుగుమీదగాని బోన్సాయ్ తొట్లను డైరెక్టుగా ఉంచగూడదు. అవి ఎండకు కాలి ఉంటాయి గనుక వాటి వేడికి ఈ చిన్ని మొక్కలు తట్టుకోడం కష్టం! అందువలన బోన్సాయ్ కుండీలు పెట్టడానికి చెక్క బెంచీల నుపయోగిస్తే మంచిది. లేని పక్షంలో కుండీ సిమెంటురాతిమీద ఆనకుండా నాలుగంగుళాల ఎత్తున ఇటుకలతో గట్టుగట్టి ఆ గట్టు మీద ఈ కుండీలనుంచాలి.

బోన్సాయ్ తొట్లను నేలమీద గాకుండా మనదృష్టికి చక్కగా ఆనేలా ఎత్తుమీద (Eye Level) ఉంచితే బావుంటుంది. దీనివలన బోన్సాయ్‌లు అందంగా, ఆకర్షణీయంగా కనిపించడమే గాకుండా భూమిలో పెరిగే క్రిమికీట కాలనుండి రక్షణకూడా ఉంటుంది.





# 10 - బోన్సాయ్ కుండీలు

## (Containers)

నేలలో మహావృక్షంగా పెరగగల చెట్టును వామన వృక్షంగా మలచగలుగుతున్నా మంటే - అందులో రెండు ప్రధాన ప్రక్రియలు న్నాయి. ఎప్పటికప్పుడు చివుళ్ళను, ఆకులను ప్రూన్‌చెయ్యడం ఒక కారణమైతే, మొక్కను చారెడు మట్టిమాత్రమే పట్టే కుండీలో పెంచడం మరో కారణం. నేలలోనో, మామూలు పెద్ద కుండీలోనో పెరుగుతున్న మొక్కను ఎప్పటికప్పుడు ప్రూన్ చేసినా మొక్క పెరుగుదలను పెద్దగా అరికట్టలేము. కుండీ లోతులేనిది, చిన్నది అయినప్పుడు మాత్రమే అది సాధ్యమా తుంది. బోన్సాయ్ (బోన్, సాయ్) అనే పదమే కుండీకి, మొక్కకు ఉండే అవినాభావ సంబంధాన్ని తెలుపుతుంది

అందువల్లనే మొక్క పరిమాణాన్ని కుదించడంలో అంతటి ప్రధానపాత్ర వహించే బోన్సాయ్ కుండీలను ఎంచుకునే విషయంలో ఎంతో ప్రత్యేక శ్రద్ధ చూపవలసి ఉంది.

మనం బోన్సాయ్ మొక్కను పెంచే శైలిని బట్టి, దాని ఆకుల, పూవుల రంగును బట్టి కుండీని ఎంపికచేసుకోవలసి ఉంటుంది - అంటే ఏ మొక్కకు ఏ సైజు కుండీ అవసరం, ఏ ఆకారంలో ఉంటే బాగుంటుంది, ఏ రంగులో ఉంటే మొక్క అందం స్పష్టంగా కనిపిస్తుంది అనే వాటిని ముందు నుండే పరిగణ నలోకి తీసుకోవాలన్నమాట!

కుండీ ఎంపిక విషయంలో మార్పడానికి వీల్లేనంత ఖచ్చితమైన నిబంధనలేవీ లేక పోయినా అనుభవజ్ఞులు చేసిన కొన్ని సూచనలు అనుసరించడంలో తప్పేమిలేదు. అవి ఆధారంగా మన కళాదృష్టికి, అభిరుచికి అనుగుణంగా కొన్నిమార్పులు, చేర్పులు చేసుకోవచ్చు.



సాధారణంగా మట్టితోను, రాతితోను, పింగాణితోను చేసిన బోన్సాయ్ కుండీలు మనకు దొరుకుతుంటాయి. కుండీ దేనితో తయారైనా దానికి ఎక్కువైన నీళ్ళు కారిపోవడానికి అవసరమైనన్ని డ్రైనేజి రంధ్రాలుండాలి. కారిన నీరు ఆరిపోయేందుకు, నేలమీద క్రిమికీటకాలు తేలిగ్గా కుండీలోకి ప్రవేశించకుండాను ఉండేలా కుండీకి తప్పనిసరిగా కాళ్ళు ఉండాలి.

మట్టికుండీలకు మనకంటికి కనిపించనంత సూక్ష్మరంధ్రాలు ఉండడంతో వాటి ద్వారా మొక్కవేళ్ళు శ్వాసించడానికి అవసరమైన గాలి లోపలికి ప్రవేశిస్తుంది. మట్టికూడా ఆ గాలికి చక్కగా పాడారుతుంది. అందుకే మట్టి కుండీలు అన్నిరకాల మొక్కలకు, ముఖ్యంగా బోన్సాయ్ మొక్కలకు అనువుగా ఉంటాయి.

పింగాణి కుండీలు వాటిమెరుపు, అందం దృష్ట్యా బోన్సాయ్ పెంపకానికి అంతగా ఉపయోగించరు. ఒకవేళ ఉపయోగించినా మెరుపు తక్కువగా, ఏ మాత్రం డిజైన్లు లేకుండా నిరాడంబరంగా ఉన్న కుండీలను వాడుకోవాలి. ఎందుకంటే ఎప్పుడూ కూడా కుండీ అందం మొక్క అందాన్ని ఇనుమడింపజేసేదిగా ఉండాలేగాని, దాని అందాన్ని మింగేసేదిగా ఉండగూడదు.

ఏ కుండీకైనా సాధారణంగా నునుపు, మెరుపు కూడా బయటవరకే పరిమితమై ఉండాలి. లోపల గరుకుగా ఉంటేనే మట్టికి, వేళ్ళకు కూడా పట్టు చిక్కుతుంది.

సాధారణంగా దీర్ఘచతురస్రం, చతురస్రం, అండాకారం, గుండ్రం, షడ్భుజి, అష్టభుజి, పుష్పాకారం - ఇలా వివిధ ఆకారాలలో ఉండే బోన్సాయ్ కుండీలు మనకు లభిస్తుంటాయి. మొక్క శైలికి తగిన ఆకారం గల కుండీని మనం ఎంచుకోవాలి. ఫార్మల్ అప్రైట్, ఇన్‌ఫార్మల్ అప్‌రైట్, ఏటవాలు పద్ధతి లాటి నిలువుగా పెరిగే రకం మొక్కలకు దీర్ఘచతురస్రం, అండాకారం గల కుండీలను ఉపయోగిస్తుంటారు. కేస్కేడ్ రకాలకు చతురస్రం, గుండ్రం, షడ్భుజి, అష్టభుజి ఆకారాల్లో ఉన్న కుండీలను వాడుతుంటారు. ఏ శైలికి ఎలాటి కుండీలు అవసరమో 'శైలి విన్యాసాలు' అనే అధ్యాయంలో ఇవ్వబడింది.

ఏ ఆకారపు కుండీలో ఏ మొక్క పెడితే అందంగా ఉంటుందో సందిగ్ధంలో పడ్డామనుకోండి! అలాటప్పుడు మూలలు గుండ్రంగా తిప్పిన దీర్ఘచతురస్రాకారంలో గాని లేక అండాకారంలోగాని ఉన్న కుండీలో ఏ శైలిలో ఉన్న మొక్కైనా పెట్టుకోవచ్చు.

రాక్ సెట్టింగ్స్‌గాని, గ్రూప్ సెట్టింగ్స్ గాని పెట్టేటప్పుడు మొక్కలు విశాలమైన భూభాగంలో విస్తరించి పెరుగుతున్న భావన వచ్చేలా ఉండడం కోసం ఒక నిర్దుష్టమైన ఆకారమంటూలేని పలుచని రాతిపలకమీద అమరిస్తే అది సహజత్వానికి ఎంతో దగ్గరగా ఉంటుంది.



ఇంక మేమ్ బోన్సాయ్‌లకైతే చిన్ని ప్రమిదను కూడా కుండీగా ఉపయోగించుకోవచ్చు.

బోన్సాయ్ కుండీ పొడవును నిర్ణయించేటప్పుడు మొక్క ఎత్తును దృష్టిలో పెట్టుకోవాలి. కుండీ పొడవు మొక్క ఎత్తులో 2/3వ వంతుగాని, 3/4వ వంతుగాని ఉంటే కుండీకి, మొక్కకు సమతూకంగా ఉంటుంది.

బోన్సాయ్ అంటేనే లోతులేని కుండీలో పెరిగే మొక్క అని గదా! మరి ఆ కుండీలోతు ఎంత ఉండాలి అనేది నిర్ణయించేటప్పుడు కాండపు పీఠభాగం ఎంత లావున ఉంది? మొక్క ఏ సైజులో ఉంది? దాని శైలి ఏమిటి? అనే అంశాలను పరిగణనలోకి తీసుకోవాలి. వీటినిబట్టి కుండీ లోతు కాండపీఠ భాగం లావులో1/2వ వంతు నుండి 2 1/2 రెట్ల వరకు మారుతుంటుంది. కేస్కేడ్ శైలిలో పెరిగే మొక్కలకు తప్ప మిగిలిన శైలులన్నిటికి బాగాలోతు తక్కువ కుండీలనే ఉపయోగిస్తుంటారు. కేస్కేడ్ శైలిలోని మొక్కలు క్రిందికి జాలువారుతూ పెరుగుతుంటాయి గనుక మొక్క బరువును ఆపగలిగేపాటి లోతుగల కుండీలను ఉపయోగించవలసి ఉంటుంది. ఏ శైలికి ఎంత లోతు కుండీలను ఉపయోగించవచ్చనే విషయాలను ''శైలీ విన్యాసాలు'' అనే అధ్యాయంలో చెప్పటం జరిగింది.

గ్రూప్ సెట్టింగులో కుండీ పొడవు, లోతులను నిర్ణయించడానికి గ్రూపులోని పెద్ద మొక్క ఎత్తు, కాండపులావులను పరిగణనలోకి తీసుకోవాలి.

బోన్సాయ్ కుండీలకు టెర్రాకోటా రంగును మించి అందమైన రంగు మరొకటి ఉండదనిపిస్తుంది. ఇదిగాక వేరే రంగులను వాడదలచుకున్నప్పుడు సాధ్యమైనంత లేత రంగువిగా ఉంటే మంచిది. కొట్టొచ్చినట్లుగా ముదురురంగు పూలు పూసే మొక్కలకు, ముదురు రంగు ఆకులుండే వాటికి ఆయారంగులకు తగిన ముదురు రంగు కుండీలను వాడుకోవచ్చు. ఆకురాల్చే మొక్కలకు కూడా ముదురు రంగు కుండీలు బాగుంటాయి. అలాగే ఆకులరంగు, పూలరంగు లేతరంగులోనే ఉన్నప్పుడు తప్పనిసరిగా కుండీకూడా లేతరంగులానే ఉంటే బాగుంటుంది. ఇంతకు ముందే చెప్పినట్లు ఇవి సూచనలు మాత్రమే! నిర్ణయాన్ని తీసుకొనే స్వేచ్ఛ మనకెలాగూ ఉంది.

క్రొత్త మట్టికుండీ క్రొత్తకుండలాగే బాగా నీటిని పీల్చుతుంది. అందుకే క్రొత్త కుండీని వాడడానికి ముందు దాన్ని ఒక అరగంటసేపు నీళ్ళలోనాననిస్తేమంచిది. లేకపోతే ఆ కుండీలో క్రొత్తగా మొక్కను నాటి నీళ్ళుపోస్తే ఆ నీళ్ళనుకాస్తా కుండీయే పీల్చేసుకోవడంతో మొక్కకు నీరుచాలక ఎండిపోయే ప్రమాదం ఉంటుంది.

కుండీలో మొక్కను నాటేముందు కుండీ ముఖభాగమేదో చూచి నాటుకోవాలి. ఏవైపు నుండి చూస్తే మొక్క అందంగా కనిపిస్తుందో అదే దాని ముఖ భాగంగా నిర్ణయించినట్లు - పెచ్చులులేచి, రంగుసరిగా కలవక, అంచులు వంకరబోయి ఉండకుండా అన్నిరకాలుగానూ బాగున్నవైపును కుండీ ముఖ భాగంగా నిర్ణయించుకోవాలి.



# 11 - బోన్సాయ్ పరికరాలు

## (Bonsai Tools)

బోన్సాయ్‌లను పెంచాలనే అభిలాష క్రొత్తగా కలిగినవారికి సాధారణంగా అప్పటికే మొక్కల పెంపకంలో కాస్తోకూస్తో అభిరుచి, ప్రవేశము ఉండే ఉంటుంది. అందుకు అవసరమైన కనీస పరికరాలూ ఉంటాయి. బోన్సాయ్ పెంపకం మొదలుపెట్టిన తొలిదశలో పెద్ద కత్తెర, పదునైన చాకు, పట్టకారు, కొనవంచిన సన్న ఇనపకడ్డీలాటి మామూలు పరికరాలే సరిపోతాయి. మొక్కలు కొంతవరకు పెరిగి - వాటితోపాటు బోన్సాయ్ పెంపకం పట్ల మన ఆసక్తి కూడా పెరిగినప్పుడు ప్రత్యేక పరికరాల అవసరం వస్తుంది. లేతగా ఉండే చిగుళ్ళను, ఆకులను, రెమ్మలను, సన్నవేళ్ళను కత్తిరించడానికి, లావుగా ఉన్న కొమ్మలను, కాండాన్ని, వేళ్ళను కొయ్యడానికి, వేళ్ళసందున ఉన్న మట్టిని తియ్యడానికి, రాగి తీగను కత్తిరించడానికి - ఇలా రకరకాల పనులకోసం వేరు వేరు పరికరాలు ఏయే పనులు చెయ్యడానికి ఉపయోగపడతాయో ఇప్పుడు చూద్దాం!

1. ఆకులను కత్తిరించే సన్న కత్తెర (Leaf Cutter)
2. లేత చిగుళ్ళను, వాడిన ఆకులను తుంచేయడానికి పదునైన పరికరం (Tweezers)
3. రెమ్మలను, కొమ్మలను, లేత వేళ్ళను కత్తిరించే కత్తెర.
4. గుబురుగా ఉన్న కొమ్మలను, ఆకులు విరగకుండా వాటి మధ్యన ఉన్న అనవసరమైన రెమ్మలను తొలగించడానికి అనువుగా ఉన్న పొడవైన కత్తెర.
5. లావుపాటి వేళ్ళను కత్తిరించడానికి తగిన



పట్టకారులాటి బలమైన కత్తెర (Pliers)

6. ముదిరిన లావుపాటి కాండాన్ని, కొమ్మ లను, వేళ్ళను కొయ్యడానికి చిన్న రంపం(Saw)
7. మొక్కను 'రీపాట్' చెయ్యడానికి తీసిన ప్పుడు అల్లుకుపోయిన వేళ్ళని, వేళ్ళ మధ్య ఉన్న మట్టిని లాగేందుకు పనికివచ్చే సన్నని పళ్ళున్న ఆటగొర్రు (Rake)
8. పెద్దకొమ్మలను ఏమాత్రం మొంటెలు మిగ లకుండాను , కోసిన చోట గాయం త్వరగా మానేందుకు వీలుగాను, పుటాకారంగా కత్తిరించే ప్రత్యేకమైన పట్టకారులాటి కత్తెర (Concave Pliers). ఈ కత్తెర పెద్ద పెద్ద నగరాల్లోని షాపుల్లో మాత్రమే దొరుకు తుంది.
9. మొంటెలను జాగ్రత్తగా తొలగించడం కోసం ఉలి (Chisel)
10. కత్తిరించినచోట నునుపుగా చెయ్యడానికి ఉపయోగపడే ఆకురాయి (File)
11. సుమారు 22 నుండి 10 గేజీల వరకు మందం ఉన్న కాల్చిన రాగి లేక అల్యూ మినియం తీగలు
12. రాగితీగను కావలసిన సైజులో ముక్కలు చేసుకోడానికి, చెట్టుకు చుట్టిన తీగకు కత్తిరించి తొలగించడానికి అనువైన పట్ట కారు (Wire Cutter)
13. డ్రైనేజి రంధ్రాలు ముయ్యడానికి ప్లాస్టిక్‌మెష్
14. మట్టిని జల్లించే జల్లెడలు
15. కుండీలో మట్టిని పోసేటప్పుడు దాన్ని కూరేందుకు కొనదేలిన ముక్కున్న కర్ర లేక చువ్వ (Potting Stick)
16. కుండీని, కుండీలో మట్టిని నీటుగా కనిపిం చేలా చెయ్యడానికి బ్రష్

ఏ వస్తువైనా సరైన తీరులో దాన్ని వాడు కుంటేను, జాగ్రత్తగా భద్రపరచుకుంటేను పది కాలాల పాటు మన్నుతుంది. బోన్సాయ్ పరిక రాల విషయమైనా అంతే! ఏ మాత్రం అశ్రద్ధ చేసినా అవి ఊరికే తుప్పుపట్టి పదునుపోయి మొండివై పోతాయి. అలాపదునుపోయిన పరిక రాలతో సున్నితమైన బోన్సాయ్ భాగాలను కత్తిరిస్తే మొక్కఎందుకూ పనికిరాకుండా పోతుంది. అందుకే వాటిని జాగ్రత్తగా వాడడమే గాక, వాడాక శుభ్రంచేసి ఎంతో పదిలంగా భద్రపరచుకోవాలి.

రకరకాల బోన్సాయ్ కత్తెరలను వాడేట ప్పుడు వాటిశక్తి ఏపాటిదోచూచి మరీ వాడాలి. అందుబాటులో ఉంది గదా అని చిన్న కత్తెరతో పెద్దకొమ్మలను, కొమ్మలను కత్తిరించే కత్తెరతో మట్టితోకూడిన వేళ్ళను కత్తిరించడం లాటి పనులు చెయ్యగూడదు.



ఈ క్రింది జాగ్రత్తలను కూడా తీసుకుంటే పరికరాలు పదునుపోకుండా జాగ్రత్తగా ఉంటాయి.

— కాండాన్ని, ముదురుకొమ్మలను, వేళ్లను కొయ్యడానికి తప్పనిసరిగా రంపాన్నే ఉపయోగించాలి.

— కత్తెర కొసభాగంతో ఎప్పుడూ కత్తిరించగూడదు.

— వేళ్ళను కత్తిరించ వలసివచ్చినప్పుడు వాటికున్న మట్టిని దులిపి మరీ కత్తిరించాలి.

— పరికరాలను ఎత్తుమీద నుండి జారి క్రింద పడకుండా చూచుకుంటుండాలి.

— వీటిని విసిరి నేలమీద వెయ్యగూడదు.

— పనైపోగానే వాటి కంటిన మట్టిని గుడ్డతో శుభ్రంగా తుడిచెయ్యాలి.

— కణరసం (Cell Sap) మూలంగా కత్తెరల మీద మరకలేర్పడినప్పుడు అంచులు జిగురుగా ఉన్నవాటిని స్పిరిట్‌తో శుభ్రం చెయ్యాలి.

— కత్తెరల అంచులకు తరుచు నూనె గాని, గ్రీజు గాని రాసి దాస్తుండాలి. అలా చేస్తే తుప్పుపట్టదు.

— పరికరాలను పెట్టెలో (Tool Box) పెట్టినా, వేరే చోట పెట్టినా విడి విడిగా పెట్టి తడి తగలని చోట భద్రపరచాలి.

ఈ విధంగా పరికరాలను జాగ్రత్త చేసుకుంటే 3,4 ఏళ్ళపాటు పదునుపోకుండా ఉంటాయి.





# 12 - ప్రదర్శనకు...పోటీకి....

## (Exhibition, Display & Judgement)

బోన్సాయ్ పెంపకమే ఒక విలక్షణమైన కళ! ఇందులో మొక్కకు ప్రత్యేకత ఉంది. మొక్కను నాటే కుండీలూ ప్రత్యేకంగానే ఉంటాయి. కుండీలో మొక్కనాటే విధానానికి కూడా ఒక ప్రత్యేకమైన పద్ధతి ఉంది. మామూలు మట్టిలోనో, గుట్ట మెట్టల్లోనో, రాళ్ళు రప్పల్లోనో మొక్క సహజంగా పెరుగుతున్న భావన వచ్చేటట్లుగా కుండీలో మట్టి పోసే విధానంలోగాని, ల్యాండ్ స్కేపింగ్ చేయడంలోగాని ప్రత్యేక మైన శ్రద్ధ కూడా తీసుకోబడుతుంది. ఇలా మొక్క, కుండీ, కుండీలోని మట్టి - ఈ మూడింటి మధ్య ఒక విధమైన సంయమనం ఉన్నప్పుడే బోన్సాయ్ సెట్టింగ్ కి సమగ్రత చేకూరుతుంది.

ఇంత శ్రద్ధ తీసుకుని చక్కగా అమర్చి పెంచిన బోన్సాయ్‌ని ఎక్కడంటే అక్కడ ఎలా బడితే అలా పెడితే మొక్క అందాన్ని స్పష్టంగా చూడలేము.

బోన్సాయ్‌ని భగవదర్పణకు వినియోగించే ఒక పవిత్రమైన పూజా కుసుమంలా భావించిన ప్రాచీనకాలంలో జపానువారు వారి పూజా మందిరాల్లో దానికో ప్రత్యేకమైన స్థానాన్ని కేటాయించేవారు. పాతకాలం నాటి మన ఇళ్ళల్లో దీపాలు పెట్టుకోడానికి గోడల్లో గూళ్ళు ఉన్నట్లుగా వాళ్ళకు గోడలో బోన్సాయ్ కుండీకి, ఇకీబనా (పుష్పాలంకరణ) పెట్టుకోడానికి అవసరమైనంతమేర గూడులా అమర్చుకోడం రివాజుగా ఉండేది.

రాను రాను నాగరికత అభివృద్ధి చెంది అభిప్రాయాలతో పాటు అలవాట్లు కూడా



మారిపోయి బోన్సాయ్‌లు, ఇకీబనాలు డ్రాయింగ్ రూమ్‌లో పదిమందీ చూచి ఆనందించే అలంకార వస్తువులుగా మారిపోయాయి. దాంతో ప్రదర్శనకు (నలుగురూ చూడడానికి) అనుకూలమైన ఏ చోటైనా బోన్సాయ్ నుంచడానికి అనువైన చోటుగానే భావించడం జరుగుతోంది. బోన్సాయ్ అందం ఇనుమడించేలా ప్రదర్శించాలి అంటే దానికీ కొంత హంగూహంగామా తప్పనిసరి!

ఆరుబయట పెరుగుతున్న మన బోన్సాయ్‌లను మామూలుగా కూడా నేరుగా నేలమీద ఉంచగూడదని, బోన్సాయ్ అందం చూపరులకు గోచరించేలా ఎత్తుగా (eye level) చెక్క పలకలు పరచిన అరుగుల మీదగాని, వీలైతే విడివిడిగా స్టాండుల మీదగాని పెట్టాలని ఇంతకుముందే చెప్పుకున్నాం!

ఇప్పుడు డ్రాయింగ్‌రూంలోగాని (indoor) లేదా బయట ప్రదర్శనకు (exhibition) తీసుకువెళ్ళి నప్పుడుగాని చూపరులను ఆకర్షించేలా బోన్సాయ్‌లను ఎలా అమర్చాలో (display) తెలుసుకుందాం!

ఒకటికంటే ఎక్కువ మొక్కలను ప్రదర్శిస్తున్నప్పుడు అన్నీ ఒకే చోట లైనుగా బారులు తీరినట్లు పెట్టగూడదు. మొక్కలు వేరు వేరు ఎత్తుల్లో విడివిడిగా అమర్చడానికి చెక్క స్టాండులను ఉపయోగించవచ్చు. లేదా చెక్క స్టూల్స్ మీదగాని, టీపాయ్‌ల మీదగాని కూడా పెట్టవచ్చు.

స్టాండు ఎప్పుడూ కూడా మొక్క శైలికి, సైజుకు, తొట్టి ఆకారానికి, రంగుకు అన్నివిధాల తగినదిగా ఉండాలి. కుండీ వెడల్పుకంటే స్టాండు వెడల్పు తప్పనిసరిగా ఎక్కువ ఉండాలి. స్టాండు రంగు కుండీ రంగులో కలిసిపోగూడదు. నలుపురంగులో గాని, రోజ్‌ఉడ్ రంగులో గాని, గోధుమ (Brown) రంగులో గాని, కాఫీరంగులోగాని ఉన్న స్టాండ్లు దాదాపు అన్నిరంగుల కుండీలకు మ్యాచ్ అవుతాయి. అలా అని ఖరీదుగల రోజ్‌ఉడ్ స్టాండులే కావాలనేమీ లేదు. చౌకగా దొరికే దేవదారు చెక్కతో చేయించుకుని కావలసిన రంగు వేసుకోవచ్చు. అందంగా ఉంటుందిగదా అని స్టాండుకి మరీ నగిషీలు చెక్కించగూడదు. అలా చేస్తే మొక్క బదులు స్టాండే చూపరులను ఆకట్టుకునే ప్రమాదం ఉంది.

శైలిని బట్టి స్టాండు ఉండాలనేది - తక్కిన వాటి సంగతి కాస్త అటూ ఇటూ అయినా కేస్కేడ్ విషయంలో మాత్రం తప్పక పాటించవలసి ఉంటుంది. ఎందుకంటే కేస్కేడ్ తోక ఎట్టిపరిస్థితుల లోను క్రిందనేలను తాకగూడదు - పైన కుండీ నుంచిన స్టాండ్ పలక (Plank of the table) మీద ఆనగూడదు. అందువలన మొక్కతోక పొడవును దృష్టిలో పెట్టుకుని స్టాండును ఎంపిక చేసుకోవాలి.

నలుచదరంగాగాని, గుండ్రంగాగాని, అన్ని ప్రక్కలూ సమానంగా ఉన్న షడ్భుజాకారంలోగాని ఉన్న స్టాండులు దాదాపు అన్ని శైలులకూ నప్పుతాయి.



ఎటొచ్చీ మరీ మెరకగా ఉన్న బాదం కాయ ఆకారంగాని, దీర్ఘచతురస్రాకారంగాని ఉన్న కుండీలకు ఎత్తు తక్కువగా ఉన్న దీర్ఘచతురస్రాకారపు స్టాండులు బాగుంటాయి.

సాధారణంగా బోన్సాయ్ కుండీలను నేరుగా స్టాండుమీద పెట్టేసే కంటే పుష్పాలంకరణలో లాగానే కుండీ అడుగున ఒక బేస్ (Base) నుపయోగిస్తే బాగుంటుంధి. ఈ బేస్ రంగు ఇటు కుండీ రంగులోగాని, అటు స్టాండు రంగులోగాని కలిసిపోగూడదు. లిటరటీకి, ల్యాండ్ స్కేప్స్‌కి, లోతు మరీ తక్కువగా ఉండే కుండీలన్నిటి అడుగునా కూడా పలుచగా కోసిన చెక్కముక్కలుగాని, చాపలా అల్లిన వెదురుబద్దలుగాని బావుంటాయి.

ఒక్క ముక్కలో చెప్పాలంటే మనం ఉపయోగించే బేస్‌గాని, స్టాండుగాని బోన్సాయ్ అందాన్ని ఇనుమడింపజేసే ఉపకరణంగా ఉండాలే తప్ప మొక్కనుండి మనదృష్టిని మళ్ళించేలా ఉండగూడదు.

బోన్సాయ్‌లను ప్రదర్శించేటప్పుడు మొక్క వెనుక తగిన తెరలాటిది (back ground) ఉంటే మొక్క అందం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. అయితే తెర రంగుని బాగా ఆలోచించి మరీ నిర్ణయించుకోవాలి. ఇవి మరీ ముదురు రంగులో గాకుండా సాదా (Plain) గాను, లేత రంగుల్లోను ఉంటే కంటికింపుగా ఉంటాయి. లేత నీలంరంగు (Sky Blue) తెర నుపయోగిస్తే మన బోన్సాయ్ ఒక పెద్ద వృక్షం లాగాను, దాని వెనుక దూరంగా ఆకాశం వాలినట్లుగాను అనిపిస్తుంది.

ప్లైఉడ్ పలకలకు రంగులు వేసిగాని, మనకు కావలసిన రంగులో ఉన్న ప్యాంటు గుడ్డలాటి దాన్ని గాని తెరగా ఉపయోగించుకోవచ్చు. మొక్కలను గదుల్లోగాక ఆరుబయట ప్రదర్శిస్తే చెక్కతోచేసినవి గాని, వెదురు బద్దలతో అల్లిన చాపలు గాని తెరలుగా ఉపయోగించుకోవచ్చు.

మేమ్ బోన్సాయ్‌లను ఇంట్లోగాని, ఎగ్జిబిషన్స్‌లోగాని, వేరు వేరు ఎత్తుల్లో గ్రూప్‌గా అమర్చుతుంటాం! వీటన్నింటిని కలిపి ఒకే డిస్ప్లే స్టాండ్ (Display Stand) లో అమర్చడం రివాజు. ఈ స్టాండు మరీ పుస్తకాల అలమరలాగా అడ్డంగా నాలుగు అరలుగా గాకుండా షోకేస్‌లోలా వేరువేరు ఎత్తుల్లో చెక్కలు బిగించి ఉంటే బాగుంటుంది. స్టాండులో పెట్టిన మొత్తం మొక్కలన్నిటి అమరికనూ చూడగానే అందులో మనకో త్రిభుజాకారం కనిపిస్తే బాగుంటుంది. కోనిఫర్స్, కేస్కేడ్స్, లిటరటీ, గాలివాలు శైలిలో పెరిగే మొక్కలు అన్నింటికంటే ఎత్తుగా పై అరలోను, అప్‌రైట్, వివరకర్రి విధానంలో పెరిగే మొక్కలు, ఆకులు రాల్చే మొక్కలు, పొదల్లా పెరిగే మొక్కలు క్రింది అరల్లోను పెడితే ఆ త్రిభుజాకారం తేలిగ్గా వస్తుంది. అంతేగాకుండా



అలా అమర్చడంమూలంగా ప్రకృతిలో ఆయా మొక్కలు సహజంగా పెరిగే స్థలాలను చూపి నట్లు అవుతుంది.

మొక్కలతో పాటు బోన్సాయ్ కుండీలో ఇళ్ళు, జంతువులు, పక్షులు, మను షులు మొదలైన చిన్న చిన్న బొమ్మలను కొందరు అలంకారంగా పెడుతుంటారు. ముఖ్యంగా లాండ్ స్కేప్స్‌ని తీర్చిదిద్దేట ప్పుడు ఈ బొమ్మలను విధిగా అమరుస్తుం టారు. అందమైన ఈ బొమ్మలు ఎక్కడ అమర్చినా నిస్సందేహంగా చూపరుల దృష్టిని ఆకర్షిస్తుంటాయి. కాని ఏ ఆకర్షణైనా బోన్సాయ్ మొక్కనుండి దృష్టి మళ్ళించేదిగా ఉండగూడదుగదా! అందుకే బోన్సాయ్ మొక్కల అందచందాలను పరీక్షించేటప్పుడు కృత్రిమమైన ఈ బొమ్మల అలంకరణను ఒక లోపంగా పరిగణించి మార్కులు తగ్గించడం కూడా పరిపాటి! అందుకే బోన్సాయ్ మొక్క లను ప్రదర్శించే టప్పుడు ఈ ప్రలోభాలకు లోనుకాగూడదు.

బోన్సాయ్ కుండీని ఎంతో శుభ్రంగా ఉంచాలి. మట్టిలో కలుపు మొక్కలుగాని, రాలిన ఆకు, అలమూగాని లేకుండా శుభ్రం చేస్తుండాలి. మనం ఎంత జాగ్రత్తగా నీళ్ళు పోసినా కుండీ మీద మట్టి మరకలు లేకుండా ఉండవు. అందుకే కుండీని ముందు పొడి గుడ్డ తోను, ఆ తరువాత తడిగుడ్డతోను, అవస రాన్ని బట్టి కుండీ పింగాణీదైతే సబ్బునీళ్ళ తోను తుడిస్తే శుభ్రంగా ఉంటుంది. మట్టిద యితే మెత్తని మెరుగుకాగితం (Sand Paper) తో కొట్టి టెరాకోటారంగు ఒక కోటింగ్ వేస్తే బావుంటుంది. పింగాణీ తొట్టెను నూనెలో ముంచిన గుడ్డతో తుడిస్తే నిగనిగ లాడుతుంటుంది.

మొక్కను చూడగానే ఆకట్టుకునేవి ఆకులే గనుక ఆకులను శుభ్రం చేయడంలో కూడా ప్రత్యేక శ్రద్ధ అవసరం. బోన్సాయ్ మొక్కకు నీళ్ళు రోజ్ కాన్‌తో పోస్తాంగనుక ఆకులమీద మట్టి ఉండదు. కాని ఆకులు మరింత అందంగాను, ఆరోగ్యంగాను కనిపించ డానికి నీళ్ళల్లో కొద్దిగా నూనె చుక్కలువేసి ఆకుల మీద స్ప్రే చేస్తుంటారు. దీనివలన ఆకులకు ఒకలాటి నిగారింపు వస్తుంది. కొందరు నీళ్ళలో కొద్దిగా పాలు గలిపి వాటితో ఆకులను శుభ్రం చేస్తారు.

మొక్కలో ఎండిన కొమ్మలను, పండిన ఆకులను తుంచెయ్యాలి. ప్రదర్శన కోసం మొక్కను ఒక తెర ముందు స్టాండు మీద అమర్చి చూచినప్పుడు మొక్కలో ఉన్న లోపాలు స్పష్టంగా కనిపిస్తాయి. అలా చూచి శైలికి తగిన డిజైన్‌లో ఇమడకుండా బయటకు వచ్చినట్లున్న కొమ్మలను, రెమ్మలను, ఆకు లను ట్రిమ్ చెయ్యాలి.

ఆకారాన్ని మలచడం కోసం వైరింగ్



చేసిన మొక్కను ప్రదర్శనలో పెడితే బాగుండ దుగాని తీరూ తెన్నూలేని మొక్కను ప్రదర్శిం చడం కంటే వైరింగ్ చేసినా సరైన ఆకారంలో ఉన్న మొక్కను పెట్టడమే నయం!

## మాస్ (Moss)

బోన్సాయ్ కుండీలోని మట్టిమీద పచ్చటి తివాచీలా కనిపించే మాస్‌ను పెంచు తుంటాం! దీనివలన ఎన్నో లాభాలున్నాయి. ఇది కుండీలోని మట్టి జారిపోకుండా ఆపు తుంది. తేమను నిలిపి ఉంచి మట్టిత్వరగా పొడారి పోకుండా కాపాడుతుంది. మొక్క అందాన్ని ఇనుమడింప జేస్తుంది. దట్టంగా పెరి గిన ఈ మాస్‌ను చూచినప్పుడు మొక్క ఎన్నో ఏళ్ళుగా అక్కడే స్థిరంగా ఉన్న భావన మనకు కలుగుతుంది.

అయితే మట్టి కూడా కనిపించకుండా పూర్తిగా మాస్‌తో కప్పడం వలన కొన్ని ఇబ్బం దులు కూడా ఉన్నాయి. ఇలా ఉండడం మూలంగా ఒకోసారి మనం పోసిన నీరు క్రింది కంటా దిగిందో లేదో తెలియదు. మరోసారి కుండీలో తేమ ఉన్న సంగతి తెలియక మళ్ళీ మళ్ళీ నీళ్ళు పోస్తుంటే మట్టంతా చిత్తడిగా తయారై వేళ్ళకు గాలి ఆడని పరిస్థితి రావచ్చు. అందుకే మట్టి మొత్తాన్ని మాస్‌తో కప్పకుండా కొద్ది ఖాళీ లుంచడమే మంచిది.

కుండీలోని మట్టిని కప్పడానికి మాస్‌తో పాటు ఇసుక, చిన్న చిన్న రాళ్ళను కూడా ఉపయోగించవచ్చు. కుండీలో చెట్టు పచ్చటి ఆకులతో నవనవలాడు తున్నప్పుడు ఇలా రాళ్ళను పెడితే అసహజంగా ఉంటుంది. అందుకే ఆకులు తక్కువ ఉన్నప్పుడు రాళ్ళను పరిస్తే సెట్టింగ్ సహజంగా అనిపిస్తుంది.

అలాగే మొక్క పచ్చగా నిగనిగలాడుతు న్నప్పుడు మాస్ దట్టంగా పెరిగితే అందం గాను, సహజంగాను ఉంటుందిగాని, ఆకులు తక్కువ ఉండే మొక్క ఉన్న కుండీలో అలా ఉంటే కృతకంగా ఉంటుంది.

వర్షాలు కురిసాక గోడలమీద ముఖ్యంగా సున్నం చెయ్యని ఇటుకగోడల మీద ఈ మాస్ పెరుగుతుంటుంది. పదునైన కత్తితో దాన్ని అచ్చులు అచ్చులుగా లేపి నేరుగా బోన్సాయ్ కుండీలో పెట్టుకోవచ్చు. లేదా అవసరమైనప్పుడు వాడుకోడానికి వీలుగా విడిగా ఒక తొట్లో మట్టిపోసి దాని మీద పెట్టు కోవచ్చు. విడిగా గనుక పెట్టినట్లైతే కుండీలో ఎప్పుడూ తేమ ఉండడం కోసం తరచుగా నీళ్ళు చిలకరిస్తుండాలి.

మనం అచ్చులుగా తెచ్చిన మాస్ మరీ దట్టంగా ఉంటే రూళ్ళ కర్రి లాటి దానితో రోల్ చేస్తే పలుచని పొరలా వస్తుంది. అప్పుడు దాన్ని తడిగా ఉన్న మట్టిమీద పరచి, వేళ్ళతో నొక్కితే సరిపోతుంది. ఇలా చెయ్యడం వలన ముందుకొన్ని వడిలినట్లుగా అయినా ఆ తరు



వాత నెమ్మదిగా తిప్పుకుంటుంది. అదే ఎగ్జిబిష న్‌కి తయారు చెయ్యడానికైతే కర్రితో రోల్ చెయ్యకుండా ఉన్నదున్నట్లుగా పెడితే తాజాగా కనిపిస్తుంది. కుండీలో మట్టి చెట్టు మొదలునుండి క్రిందికి వాలుగా గనుక పోసి ఉన్నట్లైతే మాస్ జారిపోకుండా సన్నని వైరుని ముడి పిన్నులా వంచి గుచ్చితే మంచిది. మాస్ కుదురుకునే వరకూ ఈ పిన్నులు దాన్ని పట్టి ఉంచుతాయి.

ఎండ తగులుతున్న గోడలమీద పెరు గుతున్న మాస్ అయితే బోన్సాయ్ కుండీలను ఎండలో ఉంచినప్పుడు కూడా తట్టుకుం టుంది. అదే పూర్తిగా నీడనగాని, బాగా తేమత గిలే చోటగాని పెరిగే మాస్ ఎండకు నిలవలేదు.

కుండీలో మట్టిమీద ఉన్న మాస్ ఒకో సారి పూర్తిగా ఎండిపోయినట్లు అనిపిస్తుం టుంది. అలా అనిపించినా దాన్ని పీకి పారెయ్య గూడదు. అది కొన్నాళ్ళకు మళ్ళీ చిగిర్చే అవకాశం ఉంటుంది.

## జడ్జిమెంట్ (Judgement

ఏ కళకైనా ''ఇది పరాకాష్ట'' అని నిర్ద్వం దంగా చెప్పడం అసాధ్యం! కళలోని ఔన్న త్యాన్ని నిర్ణయించడానికి ఇదమిద్ధమైన కొలబద్ద లంటూ లేకపోయినా ప్రతికళలోను ఉత్తమ కళాఖండానికి ఉండవలసిన లక్షణాలను, లక్ష్యా లను సూత్రప్రాయంగా నిర్దేశించడం, వాటి ఆధారంగా కళారూపాల ఔన్నత్యాన్ని గుర్తించి అంగీకరించడం జరుగుతూనే ఉంటుంది. సజీవ శిల్పాలైన బోన్సాయ్‌ల విషయంలో కూడా ఇదే విధానాన్ని అవలంబించవలసి ఉంటుంది.

సౌందర్య దృష్టితో చూడవలసిన కళా రూపాలైన బోన్సాయ్ మొక్కలను పోటీలో పెట్టడాన్ని చాలా మంది వ్యతిరేకిస్తుంటారు. కాని పోటీ అంటూ ఉన్నప్పుడు మరింత ఉత్తమ కళాఖండాలను రూపొందించడానికి కళాకా రులు ఉత్సాహపడతారని అందువలన పోటీలు, న్యాయనిర్ణయాలు తప్పనిసరి అని మరికొందరి అభిప్రాయం!

ప్రదర్శనల్లో (Exhibitions) గాని, పోటీ లలో (Competetions)గాని బోన్సాయ్‌ల నుంచినప్పుడు వాటి స్థాయిని నిర్ణయించడానికి మొక్కలను మూడు కోణాల నుండి చూడడం జరుగుతుంటుంది.

1. మొక్క ఆరోగ్యం, స్థితిగతులు (Horticu- ltural Point)
2. శైలిలో పరిపూర్ణత (Perfection in the Style)
3. అందచందాలు (Aesthetics)

ఏ అనారోగ్యమూ లేకుండా మొక్క దృఢంగాను, బలంగాను ఉండడం, మొక్కకు తగినట్లుగా ఆకులుండడం; కుండీ, కుండీలోని మట్టి ఉపరితలం పరిశుభ్రంగా ఉండడం



మొదటి అంశపు పరిధిలోకి వస్తాయి.

ఇక శైలి! మనం మొదటి నుండీ ఒక ప్రత్యేకమైన శైలిని దృష్టిలో పెట్టుకుని బోన్సాయ్‌కి శిక్షణనిస్తుంటాం! మొక్కలో ఏదో ఒక నిర్దుష్టమైన శైలి కనిపిస్తోందా లేదా అన్నది ప్రదర్శన సమయంలో ప్రధానంగా పరిగణనలోకి తీసుకోబడుతుంది.

దృఢమైన పీఠభాగంతోను, పోను పోను కొనదేలుతూనూ పెరిగిన కాండం, వయసును సూచించే బెరడు, మొక్కకు పరిపూర్ణమైన ఆకారాన్నిచ్చే కొమ్మల వలయాలు, శైలికి తగినట్లుగా విస్తరించిన ఉపరితలపు వేళ్ళు రెండవ అంశంలోని ప్రధాన విభాగాలు.

కేవలం సాంకేతికమైన ఈ రెండు అంశాలను దృష్టిలో పెట్టుకుని మొక్క బాగోగులను నిర్ణయించడం కష్టమైన విషయమేమీ కాదు. కాని వీటన్నిటికీ అతీతమైనవి - చూడగానే మనస్సులను కట్టుకునే ముగ్ధమనోహరమైన వామనవృక్షపు అందచందాలు! మొక్క ఔన్నత్యాన్ని నిర్ణయించేటప్పుడు వీటిని విస్మరించగూడదు గదా!

అందుకే అన్ని అంశాలను దృష్టిలో పెట్టుకుని న్యాయనిర్ణయానికి ఉపయోగపడేలా ఒక పట్టికను తయారు చేసుకోడం అవసరం. ఇది కేవలం న్యాయనిర్ణయ సమయంలోనే గాక, మన బోన్సాయ్‌ల రూపురేఖలను శాస్త్రీయంగా మలచుతున్నామో లేదో చెక్ చేసుకోడానికి కూడా ఉపయోగపడుతుంది.

వక్తృత్వం, వ్యాసరచనల్లాటి పోటీల్లో విషయం, భావవ్యక్తీకరణ, భాష మొదలైన అంశాలను ప్రాతిపదికగా తీసుకుని ప్రాధాన్యత నిస్తూ మార్కుల నెలా వేస్తామో అలాగే బోన్సాయ్ ప్రదర్శన, పోటీల్లో కూడా కాండం, కొమ్మలు, ఆకులు, ఉపరితలపు వేళ్ళు, కుండీ, కుండీలోని మట్టి - వీటన్నిటికీ తోడుగా మొక్క అందచందాలు - ఇలా విభజించి ఆయా అంశాల ప్రాధాన్యతను బట్టి మార్కులను కేటాయించడం జరుగుతుంటుంది.

మొత్తం మార్కులు 100 అనుకుంటే కాండానికి 15, కొమ్మల అమరికకు 25, ఆకులకు 15, ఉపరితలపు వేళ్ళకు 10, కుండీకి 5, మట్టి ఉపరితలానికి 5 - మిగిలిన 25 మార్కులను మొక్క అందచందాలకు కేటాయించుకోవచ్చు.

### *కాండం:*

**మొత్తం మార్కులు :15**

శైలికి అనుగుణమైన ఆకారం - 5

క్రమమైన టాపరింగ్ (Tapering) - 3

వయసును ఇనుమడింప జేసి చూపే బెరడు - 3

కొమ్మలను కోసిన గాట్లులాంటివి లేకుండా ఉంటే - 2

షేప్ చెయ్యడానికి ఉపయోగించిన తీగగుర్తులు లేకుండా ఉంటే - 2



## కొమ్మలు:

**మొత్తం మార్కులు : 25**
మూడు కొమ్మల వలయాలు - 5
శైలికి తగిన ఆకారం - 5
ప్రధానమైన కొమ్మల పెరుగుదల - 4
అనాగొమ్మల, రెమ్మల అమరిక - 5
తీగతో షేప్ చేసిన విధం - 4
బెరడు - 2

## ఆకులు:

**మొత్తం మార్కులు: 15**
చీడపీడలు లేకుండా ఆరోగ్యంగా నవనవ లాడుతుంటే - 5
చెట్టుకు తగిన సైజు - 5
కొమ్మల అడుగునలేకుండా ఉంటే - 5

## వేళ్ళు:

**మొత్తం మార్కులు : 10**
శైలిని బట్టి ఉపరితలపు వేళ్ళ విస్తరణ - 5
ఉపరితలపు వేళ్ళ మొదళ్ళు దృఢంగా మొదలై క్రమమైన టాపరింగ్ ఉంటే - 5

## కుండీ:

**మొత్తం మార్కులు : 5**
పరిశుభ్రత - 1
కుండీలో మొక్క నాటిన స్థానం - 1
మొక్కకు తగిన సైజు - 2
కుండీ చిన్నగా ఉన్నా చూడడానికి బాగుంటే - 1

## మట్టి:

**మొత్తం మార్కులు : 5**
మట్టి ఉపరితలం ఆకులు, అలం, కలుపు మొక్కలు లేకుండా శుభ్రంగా ఉంటే - 1
మట్టి పోసిన తీరు - 1
మాస్ పెరిగిన తీరు - 2
ఉపరితలం మీద సహజత్వం కోసం పెట్టిన చిన్ని రాళ్ళు మొదలైనవాటికి - 1

**వీటన్నిటికీ అతీతంగా చూడగానే ఆకట్టుకునే మొక్క అందచందాలకు – 25**





బిందువులో సంద్రం
క్షణంలో అనంతం
అరచేతిన చిరువృక్షం !

– డా. విజయమోహన్

